# హృదయ శిల్పం

పెద్దలు శ్రీ KV సుబ్రహ్మణ్యంగారికి

## పద్య, గద్య సంకలనం

### ఇందిరాగాంధి అవార్డు పొందిన గ్రంథం


రచన

**హృదయ శిల్పి**

**డా॥ అమరవాది ప్రభాకరాచారి**

M B B S M S M Ch

Cardio Vascular & Thoracic Surgeon

# హృదయ శిల్పం

మొదటి ముద్రణ పిబ్రవరి 2002

తేది మార్చి 8 2002
అంతర్జాతీయ మహిళా దినోత్సవం (ఢిల్లీలో)
**ఇందిరాగాంధి అవార్డు** పొందిన గ్రందం

రెండవ ముద్రణ జూన్ 2002
ప్రతులు 1000


**శ్రీమతి అమరవాది విజయలక్ష్మి**
ఇ నెం 11 15 15 డాక్టర్స్ కాలనీ సరూర్‌నగర్
హైదరాబాద్ – 500 035 ఫోన్ 4033318

వెల **40/ రూపాయలు**

ముద్రణ
కిసాన్ ప్రెస్ అఫ్జల్‌గంజ్ హైదరాబాద్
ఫోన్ 4601029 4617617

# పారకులే - పీరికలు

స్వతహాగా నేను ఒక కవినీ రచయితను సాహితీవేత్తనూ కాను రచన చేయాలనుకున్నాను ఎం వ్రాయాలి? కవిత్వం సాహిత్యం నవలు అన్నీ-అంతా-ఒక ఊహ లోకం కాదా? ఊహ లోకంలోకి వెళ్లడానికి నా కిష్టం లేదు లేనిది కానిది భ్రమలోకం ఊహాసుందరులను చిత్రీకరించడం కదలు కల్పించి రాయడం ఒక కళే అదీ ఒక ఆనందమే అలాంటి గ్రందాలు కొకొల్లలుగా వ్రాయవచ్చు బయం బీబత్సం వాంసన సృష్టించే సాహిత్యం సునాయసంగా వ్రాయవచ్చు కాని అలా వ్రాసి ఎం లాబం నిజ జీవితంలో ఎం జరిగిందో నేను నా కళ్ళతో చూసిన నిజానిజాలు నాకుదోచిన రీతిలో నా దోరణిలో తెలియచేయాలనుకున్నాను ఈ రచనలోనివి అన్నీ నా హృదయాన్ని బాదించినవి కొన్ని కదిలించినవి మరికొన్ని ఇంకా కొన్ని నా హృదయాన్ని శిల నుండి శిల్పంగా మార్చి పారాలు నేర్పిన అంశాలు మరెన్నో అందుకే ఈ గ్రందం నా హృదయ శిల్పం - ఈ శిల్పం మరెన్నో శిలలను శిల నుండి శిల్పంగా మార్చాలని నా హృదయావేదనను పారకులకు అందించి పారకులే పీరికలై నిలవాలని అసలైన ఆశీస్సులని తలంచాను మరో వ్యక్తిని ఓడించి బాదించి వేదించి ఆశించి యాచించి బతిమాలి పీరిక వ్రాయించాలని తలచక నన్ను నేను శిక్షించుకొని ఆదేశించుకొని పీరికకు అదిక ప్రాదాన్యం హంగులు రంగులు పొంగులు పులమక ఈ పీరిక వ్రాశాను నాకు పరిచయమైన ప్రతి వ్యక్తీ ఒక గ్రందంగా కనపడసాగారు వారు పలికిన ప్రతి మాట సాహిత్య సరళిగా వినబడింది అవన్నీ ఒక దగ్గర చేర్చడమే ఈ గ్రందం

పీరిక అంటే ఎమిటి? దీని పుటుపూర్వోత్తరాలు ఎమిటి? అసలు పీరిక ఎందుకు పుట్టింది? ఇది ఎంత వరకు అవసరం? పీరిక వ్రాసేముందు ప్రతి రచయితకు ఈ ఆలోచన వస్తుంది అసలు ప్రాచీనకాలంలో ఏ గంద్రానికైనా పీరిక ఉందా? ఏ యుగంలో ఇది మొదలైంది? పీరిక వ్రాసే వారి అర్హత లేమిటో అవసర మేమిటో కూడా మనం ఆలోచించాలి

పదవ శతాబ్దారాంబంలో పీరిక ఉండేది రచయితలు తమ గ్రందాలకు మాత్రమే పీరికలు వ్రాసేవారు ఆ తరువాత కొద్ది కాలం వరకు పీరిక కద కనుమరుగైంది మొగలుల పరిపాలనలో ఈ పీరిక కొంత వరకు మరుగున పడిపోయింది గ్రందాలకు ఆదరణ లేక పోవడం వల్ల కావచ్చు

మళ్ళీ ఆంగ్లేయుల పరిపాలన కాలంలో ఈ పీరిక (పుస్తకపరిచయం) ప్రారంబమైంది అవసరం కూడా అయ్యింది ప్రతి గ్రందానికీ పీరిక ఆంగ్లంలోనో తెలుగులోనో వ్రాయవలసిన అవసరం వచ్చింది గ్రందాలు తర్జుమా చేసినప్పుడు పీరిక అవసరం ఎంతైనా ఉండేది

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పీఠిక వ్యాధి ఉగ్రరూపం దాల్చింది ప్రతి రచయిత తన గ్రంధానికి ఒక ప్రముఖ వ్యక్తితో పీఠిక వ్రాయించడం చాలా అవసరంగా మారింది నా పుస్తకానికి పలానా గొప్ప వ్యక్తి పీఠిక వ్రాశారని గొప్పలు చెప్పుకోవడానికి ప్రముఖ వ్యక్తితో పీఠిక వ్రాయించడము ఒక అలంకరణగా లేదా అదో విలువగా ప్రముఖ వ్యక్తి పీఠిక లేనట్లైతే గ్రంధానికి విలువ లేనట్లుగా భావించడం జరుగుతుంది

పీఠిక వ్రాసే వ్యక్తుల బాధలు చూస్తే పీఠిక వ్రాసే వారికే తెలుస్తుంది గ్రంధం అంతా చదవాలి విలువల కోసం భూతద్దంతో వెదకాలి వెదికి వెదికి ప్రతి ఒక్క అంశంపై గొప్పగానే వ్రాయాలి వ్రాయకపోతే తన గొప్పతనం ఏంటి? లేదా! రచయిత గొప్పతనం పడిపోతుందేమోనని బాధ ఇక పారితోషికం మాట దేవుడెరుగు ఒక్కోసారి పీఠిక వ్రాసిన ప్రముఖ వ్యక్తి మనస్తాపానికి గురికావలసి వస్తుంది లేదా ఆ గ్రంధానికి నేనే పీఠిక వ్రాశానండీ అని మరీ మరీ వక్కాణించి చెప్పుకోవలసిన పరిస్థితి కూడా వస్తుంది కొందరైతే పీఠిక వ్రాసే ముందు విసుక్కుంటారు కూడా ఈ మధ్య రాజకీయ నాయకులు కూడా పీఠికలు వ్రాస్తున్నారు

చందాలు ఇవ్వండి సన్మానం చేస్తాం అలాగే చందాలు ఇవ్వండి గ్రంధాలు వ్రాస్తాం అనే రోజులు ఇవి సాహిత్యానికి ఆదరణ లభించని రోజులు ఇవి చదువు పాండిత్యం విద్య వ్యాపారంలోకి దూకాయి కొందరైతే ఆ ప్రముఖ వ్యక్తికి తెలియకుండా వారి పేరుతో పీఠికలు వ్రాస్తారు మరి కొందరైతే తామే పీఠికలు వ్రాసి ఓ ప్రముఖ వ్యక్తి పేరు పెట్టడం లాంటివి చేస్తూవుంటారు పీఠికాగ్రేసరులు పీఠికా మహాత్ములు పీఠికా రచయిత సంఘాలు పీఠికల సంపుటి కూడా ఇక ముందు రావచ్చు

వెనకటి రోజుల్లో ఆర్థిక సహాయం అందించే వారి గురించో లేక అంకితం తీసుకొన్న వారి గురించో పీఠికలో వివరించేవారు దాన్ని పుస్తక పరిచయం అంటారు రాజులు సాహిత్యాన్ని పోషించే కాలంలో అలాంటివి జరిగేవి అవి ముందు మాట గా మారాయి క్రమ క్రమంగా పీఠిక ఎన్నో రూపాంతరాలు చెందింది పీఠం కలిగినదే పీఠిక అవతారిక ముందుమాట పరిచయం ఉపోద్ఘాతం Foreword Introduction An Insight నాంది ప్రస్తావన మేపుమాల పీఠికలకు మారుపేర్లు

వినువీధికి చేరవలసిన సాహిత్యం పొట్లాలుగా మారి నడివీధిలో పడి చెత్తకుండీకి చేరుతూంది గొప్ప గొప్ప గ్రంధాలు కిలో చొప్పున అమ్మబడుతున్నాయి బూడిదగా మారుతున్నాయి ఇప్పటికే ఎన్నో గ్రంధాలు ఆచూకి లేకుండా పోయాయి ఎంతో సాహిత్యం హత్య గావించబడింది అంతర్ధానమైపోతుంది ముందు తరం కొరకు సాహిత్యాన్ని జాగ్రత్త పరచవలసిన బాధ్యత మనందరిపైన ఉంది

ఇక గ్రందావిష్కరణకొస్తే ఇదొక అట్టహాసం రచయిత ఆర్దిక స్తోమత పలుకుబడిని బట్టి లేదా స్పాన్సరర్ హోదాను బట్టి పబ్లిసిటి కార్యక్రమం జరుపుతారు ఇదికూడా కొంత సొంత ప్రచారం కొరకేనేమో

ఈ రోజు గ్రందం వ్రాయాలంటే సాహితీవేత్తలు వదిలేసినపదాలు పందాలు దారులు వెతుక్కోవాలి ఆ ప్రయత్నమే ఈ పద్యగద్య సంకలనం ఇక ఈ గ్రందం నామకరణాని కొస్తే ఈ గ్రందములోని చాలా అంశాలు విని సాహితీవేత్తలు నాకు అందించిన గౌరవ సత్కారమే హృదయశిల్పి అప్పుడప్పుడు సాహిత్య సమావేశాల్లో పాల్గొని నేను ప్రసంగించినవే కొన్నిటిని ఈ గ్రందంలో చేర్చి ఈ గ్రందానిక హృదయ శిల్పం అని నామకరణము చేయడం జరిగింది పాదనియమం కలది పద్యం లయాన్విత వచనం గద్యం ఈ అర్హతలు ఉన్నాయనే దైర్యంతో పద్యబాగం గద్యబాగం అనే పదాలను ఉపయోగించి గ్రందాన్ని విబజించాను సత్యం పునాదిపై నిలచిని కాల్పనిక రచన అని తలంచాను తెలుగు కాలమానంలో ఉన్న అరువది సంవత్సరాల గౌరవార్దం అరువది అంశాలను ఈ గ్రందములో చేర్చడం జరిగింది శాంతి అహింస జాతి సమైఖ్యత దేశ సమగ్రత మత సామరస్యం వరకట్న సమస్య స్త్రీకి సమానత్వం అనే అంశాల ఆదారంగా రచించిన ఈ రచనలో ప్రసక్తమైన పేర్లు ఎవరినీ ఉద్దేశించినవి కావు

ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే ! ఈ గ్రందానికి పీరిక ఎంత వరకు అవసరం అనే ఆలోచన వచ్చింది పీరిక వ్రాయించుకొనే అర్హత కూడా గ్రందానికి ఉండాలి గదా! ఉందో లేదో తెలియదు అందుకే నేనే పీరిక వ్రాయవలసి వచ్చింది నా గ్రందానికి - ఇతరులను కష్ట పెట్టొద్దని కాని ఒకటి మాత్రం నిజం అసలైన పీరికలు పాఠకులే పాఠకులే పీరికలు పాఠకులు చదివి హర్షించని గ్రందాలకు పీరికలు ఎందుకు? పీరికా రచయితలు ఎందుకు? ఆకర్షణీయమైన ముఖ చిత్రాలెందుకు? రచయిత చాయా చిత్ర మెందుకు? అంటూ పాఠకులకు నమస్కరిస్తూ ఈ గ్రందము ముద్రణకు నేతృత్వం వహించిన కిసాన్ ప్రెస్ యజమాని శ్రీ ఎ ఎస్ సత్యప్రకాశ్‌రెడ్డి గారికి మరియు సలహాలు సూచనలు విమర్శలు అందించిన సాహిత్యబ్రహ్మ శ్రీ డా॥ వి వి యల్ నరసింహ్మారావు గారి కృతజ్ఞతలు తెలుపుతూ

**రచయిత**

**హృదయ శిల్పి**

**డా॥ అమరవాది ప్రభాకరాచారి**

MBBS MS M.Ch.

కార్డియోదొరాసిక్ సర్జన్

# విషయ సూచిక


| పద్య భాగం | పేజి |
|---|---|
| 1) స్త్రమేవా | 1 |
| -) ఆది నుండి | 2 |
| ) షర్ - మిస్టర్ | 4 |
| 4) ఎల్లి - ఎుక | 5 |
| ) దిక్క | 6 |
| 6) ేట కటయ్యో | 7 |
| 7) వ్రత విదానం | 8 |
| 8) ేట ఆసుపత్రి | 9 |
| 9) రిక్షాబండి | 10 |
| 10) ాటు తుపాకితో గుండు | 11 |
| 11) బుడ్డ పరకలు | 1ు |
| 12) ఇదేం దేశంరన్నో | 14 |
| 1 ) పూలు - పూలు | 15 |
| 14) బాపు బాట | 16 |
| 15) కార్గిల్ | 17 |
| 16) విశ్వ కార్మికులు | 17 |
| 17) చూడర మూడు | 19 |
| 18) కాక - కోకిల | 21 |
| 19) వాన చుక్కమ్మో | 22 |
| -0) ఒం అల్లా | 23 |
| 21) ఉందీ - ఉందీ | 24 |
| 22) అన్నం - పప్పు - చారు | 25 |
| 2 ) మిర్చి బజ్జీ | 26 |
| 24) విప్లవాల జాడలు | 26 |
| 25) సూద్దాం రారా | 28 |
| 26) బరతమాతరన్న | 29 |
| 27) ప్రేమ | 0 |
| -8) ఒద్రం దొరో | 1 |
| -9) ిజ జీవితం | - |
| 30) ముద్దుర ముద్దు | |
| 1) ఆకలి మంటలు | 34 |
| ) హోషియార్ | 5 |

| గద్య బాగం | పేజి |
|---|---|
| 1) తల్లి | 36 |
| 2) తండ్రి | 39 |
| 3) గురువు | 43 |
| 4) మగ వేశ్యాలు | 45 |
| 5) వ్యాపారం | 48 |
| 6) మాసి కట్నం | 51 |
| 7) మరో జన్మ | 55 |
| 8) కళలు కల్లలైన వేళ | 57 |
| 9) ఎద చికిత్స | 58 |
| 10) ఎయిడ్స్ వొడిలోకి | 60 |
| 11) చిప్ప | 63 |
| 12) మత కల్లోలం | 64 |
| 13) మహాత్ముడు చెప్పని రహస్యం | 65 |
| 14) ఓ జాతిఎతా | 66 |
| 15) ఎల్లి పులి అయిన వేళ | 68 |
| 16) తృప్తి | 69 |
| 17) సలీం బయ్యా | 71 |
| 18) బీదవాని తాజ్‌మహల్ | 74 |
| 19) ఆత్మ పరమాత్మ | 77 |
| 20) శూన్యం నవ్వుతుంది | 79 |
| 21) మరణం మరణించదు | 80 |
| 22) దేవుడు - టీ | 82 |
| 2 ) ఎచ్చి తల్లి | 84 |
| 24) అణు ఎశాచి | 88 |
| 25) అబార్షన్ | 89 |
| 26) కల కద | 93 |
| 27) అన్నం దొంగ | 97 |
| 28) కిచ్ కిచ్ | 101 |


**పీఠికను చదవడం మరవకండి**

# 1 స్త్రీ మేలా

పల్లవి అదరకు తల్లి – నీవు బెదరకు చెల్లి
అబలవు కావు – నీవు సబలవు తల్లి

చరణం పోకిరోళ్ళుంటారు పోజు కొడుతుంటారు
పొంచి పొంచీ చూసి మోసగిస్తుంటారు
మోసబోయి నీవు చిన్నబోకు తల్లి
చిన్నబోయి నీవు చితిని చేరకు చెల్లి
చిత్తాన్ని మార్చేసి సత్తాను చూపించి
అర్ధరేత్రైనా ఒక్కదానవే నిలిచి
పోకిరి మూకకు ముకుతాడు తగిలించి – అదరకు తల్లి

చరణం పైసలాశ చూపి వేశ్యగా మార్చేసి
చెడిన ఆడదంటు చెరసాల దోసేసి
చెఱచి చెఱచి కసితీర్చుకుంటుంటే
ఆడదేవే అంటు గేలి చేస్తుంటే
ఆటబొమ్మగ చేసి ఆడుకుంటుంటే
కామాంధు లందరిక కళ్ళాలు వేసేసి – అదరకు తల్లి

చరణం ఆడపోలీసైతె నేమి? ఆడ జడ్జీవైతె నేమి?
డాక్టరైతే నేమి? యాక్టరైతే నేమి?
గర్భకోశంలోనే పసికట్టి నిన్ను
ఉరికొయ్యకేసి కసి తీసుకుంటుంటే
మంగళ సూత్రాన్ని మంటల్లో వేస్తుంటే
కట్టుబశాచాన్ని మట్టుపెట్టి నీవు – అదరకు తల్లి

చరణం అందముంటే నేమి? చందముంటే నేమి?
చదువుకుంటే నేమి? సంపాదనం టేమి?
సైతాను నువ్వంటు ముసుగుతో కట్టేసి
సతివి నీ వంటు చితిలోన నెట్టేసి
మతమనే పేరుతో మంటల్లో తోస్తుంటే
పులి పంజ చూపించి ఎదురుబడి తిరగబడి – అదరకు తల్లి

చరణం  విజయసూత్రానమ్మ ఝాన్సీ లక్ష్మమ్మ
సమరయోధురాలు సరోజినమ్మ
మాతృమూర్తివి నీవు  మాతృభూమివి నీవు
మాతృభూమికో నీవు  మళ్ళీ మళ్ళీ పుట్టి
మా వాళ్ళకి నీవు  మంచి బాటలు వేసి
కళ్ళ సంపూలకు  సంకెళ్లు వేసి  - ఉదరకు తల్లి

అంకితం  నలుగబడే మహిళలకు మహిళా సంఘాలకు

1991లో  స్త్రీమేళా  సాహిత్య సభలో చర్చించబడ్డ గేయం

ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాంగణంలో వెయి కరపత్రాలు పంచబడ్డాయి

స్త్రీకి ఆస్తిలో సక్రమంగా హక్కు కల్పించిన నాడే వరకట్న దురాచారం (వరకట్న వ్యభిచారం)
అంతరిస్తుంది  గర్భస్థ స్త్రీ శిశు హత్యలు ఆగిపోతాయి

ప్రస్తుత సమాజంలోని సమస్యలే గర్భస్థ స్త్రీ శిశువును గుర్తించి  కాపాడవలసిన

తల్లిదండ్రులే గర్భంలోనే స్త్రీని హత్య గావించడం ఉందరూ బాగా ఆలోచించవలసిన విషయం

## 2  ఆది నుండి

పల్లవి  యాదమ్మో యాదమ్మో
జర - యాద్ రఖ్‌లో యాదమ్మ
జానమ్మో జానమ్మో
జర - జాన్ పహచాన్ జానమ్మ

చరణం  రాముడు గొప్పోడులె - వ్హా వ్హా
రావణుడు గొప్పోడులె - వ్హా వ్హా
అడవికి పంపినారులె - సీతను
అగ్గిలో తోసినారులె -  ఓరి నాయనో
ఆది నుండి ఆడదానికి అష్టకష్టమే
ముందు వెనక తెలియకుంటే ముదనష్టమే  - యాదమ్మో యాదమ్మో

చరణం   పాండవులు గొప్పోరుటె – హై హై
కౌరవులు గొప్పోరుటె – హై హై
వలువలూడ దీసినారులే – పాంచాలి
పరువు కాస్త తీసినారుటె   హరిదేవుడో
ఆదినుండ ఆడదానికి అష్టకష్టమే
ముందు ఎనక తెలియకుంటే ముదనష్టమే   యాదమ్మో యాదమ్మో

చరణం   జూదమాడ ఓడినాడు ఒకడు – ఒహో ఒహో
అంగట్లో అమ్మినాడు ఒకడు – ఆహా ఆహా
కోడకేక వేసినాడు ఒకడు – అయ్యయ్య
కోకలూడ పీకినాడు ఒకడు – హరి నీ యవ్వ
అనసూయమ్మకు నగ్న పరీక్ష
సీతమ్మ తల్లిక అగ్ని పరీక్ష
ఆది నుండి ఆడదానికి అష్టకష్టమే
ముందు ఎనుక తెలియకుంటె ముదనష్టమే   – యాదమ్మో యాదమ్మో

చరణం   ఆనాటి వనితకు అష్టకష్టమే
ఈనాటి మగువకు రోజూ కష్టమే
ఈయుగములోన కలియుగముచోసి
కన్నెపరీక్ష కట్న పరీక్ష గర్భమందే ఎక్స పరీక్ష
ఆడ మగ పుట్టేది ఆడదానికే
ఆడవారి బతుకంతా గొడ్డు ఒతుకులే   – యాదమ్మో యాదమ్మో
ఎల్లమ్మ, మల్లమ్మ పుల్లమ్మో బయమెందుకే బాలమ్మో
ఎదురు తిరగవే ఎంకమ్మో   తిరగబడవే చెల్లెమ్మ
తిరగబడవే ఎల్లమ్మ, తిరగబడవే చెల్లెమ్మో

అంకితం   స్త్రీ విముక్తికై పోరాడే ఆదర్శ సంఘాలకు మరియు ఆదర్శమూర్తులకు
సాహిత్య సభ – సిటీసెంట్రల్ లైబ్రరీ చిక్కడపల్లి
వయసులో పదవిలో విద్య అర్హతలలో ఆస్తి – అంతస్తులో కూలి జీతంలో పురుష ఆధిక్యతలు
స్త్రీల హక్కుల పరిధిలో చర్చించవలసిన అంశాలు

# 3 సిస్టర్ - మిస్టర్

పల్లవి  ఓ మిస్టర్ - తెలుసా నీకు సిస్టర్
ఓ మిస్టర్ - తెలుసా నీకీ సిస్టర్

చరణం  వార్డుకో గులాబీల క్లస్టర్
రకరకాల రోగుల పాలిట డస్టర్
ఆమె వృత్తి ధర్మమే థర్మామీటర్
రాస్తుంది రోజూ రోగాల రిజిస్టర్  - ఓ మిస్టర్

చరణం  చాలీ చాలని జీతానికి మినిస్టర్
తెలియక అవుతుంది ఒక్కోసారి ఎన్స్టర్ - ప్లన్స్టర్
మన అమ్మే మొట్టమొదట సిస్టర్
ఫ్లారెన్సమ్మకు గ్రేట్ గ్రాండ్ డాటర్  - ఓ మిస్టర్

చరణం  డాక్టర్‌కూ - పేషంటుకూ
పేషంటుకూ - అటెండెంటుకూ
మధ్య ఒక - ట్రాన్సిస్టర్
మల్లెపూల డ్రెస్సులో మాస్టర్
బ్రతుకంతా బాదల రోస్టర్  - ఓ మిస్టర్

చరణం  అందుకే ఓ మిస్టర్
ఈవిడే నీ - నా - అసలైన సిస్టర్
మన హాస్పిటల్ అందాల సిస్టర్

అంకితం  నర్సులకు - పవిత్రమైన నర్సింగ్ వృత్తికి
సందర్భం - క్యాపింగ్ సెరిమోని - స్కూల్ ఆఫ్ నర్సింగ్ ఉస్మానియా ఆసుపత్రి 1982

# 4 పిల్లి - ఎలుక

తల్లి ఓర్రాంవ్పుడూ – నీ ఎండ్లం ముండమొయ్య
దొంగ ముండ – బద్మాష్ ముండ
దీని పాడెగట – పేడుగొట
దీన్మీద బండ బడ – గుండు పడ
దీని పీనుగెల్ల – దీని పేరార మొదలార

గట్ల సూస్తదేంది బిడ్డ – నీ ఆలి
గట్ల పోతదేంది బిడ్డ – నీ ఆలి
తిటిపోతదేంది బిడ్డ – నీ ఆలి
కొట్టిపోతదేంది బిడ్డ – నీ ఆలి

కొడుకు అమ్మా! రాంలక్ష్మను – తోల్కరానీకి పోతిగంద
దీన్నోట్ల మన్ను పొయ్య – దీన్కండ్ల కారం కొట్ట
దీన్కడుపు కాల – దీనింట్ల పీనిగెల్లని – లచ్చవ్వత్త గిట్ల తిట్నాదే
మరి మా అవ్వ నిన్ను – గిట్ల తిటటేదా?
ఒది ఇన్న మా అయ్య నీ – పక్కటెంక లిరగొట్నాడా?
రాంలక్ష్మను బావ – బరెంక లిరగ్గొట్నాడా?
ఇంట్లకెల్లి ఎల్లగొట్నాడా! ఓర్రాంవుడూ

కొడుకు నీ మాట మీద – నువ్ మెచ్చి తెచ్చ – నీ కోడల్ని
కోడ్తునా – తిడ్తునా? బరెంక బొక్కలిరగ్గొడ్తునా?
ఇంట్లకెల్లి ఎల్లగొడ్తునా?
అయ్యేట్లనో మావట్ల – బావెట్లనో నేనట్ల
అక్కెట్లనో అదిగట్ల – అత్తెట్లనో నువ్వట్ల
అక్కలేక అత్తెట్లనే – అది లేక నువ్వెట్లనే
నువ్వులేక మేమెట్లనే – అది లేక నేనెట్లనే
అదిలేక మనమెట్లనే – నువ్వు లేక మేమెట్లనే
నీ పిల్ల ఒక ఇంటి కోడలే – కొడలు ఎల్ల ఒక తల్లి కూతురే
అత్త కూడ ఒకనాటి కోడలే – కోడండ్లు ముందుతరం అత్తలే
ఎల్లి ఎలక పోరు ఇంక వద్దులే – తల్లి పిల్ల ప్రేమ ఎంతో ముద్దులే

*అంకతం అత్తలకు ఉత్తలు కాబోతున్న కోడండ్లకు*
*అత్త కోడలిక మొదట శత్రువు కాకూడదు బర్తలు జాగ్రత్త పడాలి*
*కొడుకును ఎంచి ఎద్దచేసి కోడలికి అప్పగించవలసినదేనని ప్రతి తల్లి గుమనించాలి*
*ప్రతి కోడలు అత్తను తల్లిగా చూడాలి*

# 5 దిక్కు

పల్లవి అక్కో సారక్కో - ఒక్కో సమ్మక్కో
దిక్కులేకు దిక్కు - తూరుపు దిక్కు
తూరుపు దిక్కుకు - సూరీడు దిక్కు
ఏ దిక్కు లేదక్కో - నేనేదిక్కు పోదక్కో
మగ దిక్కు లేదక్కో - ఏ దిక్కు పోదక్కో - ఒక్కో సారక్కో

చరణం గొప్ప చదువు చదివిండు - ఇదిగా మాస్తే బాగుండు
వెనక ముందు చూసిండు - ముసి ముసిగా నవ్విండు
ఏదో బయటకు తీసిండు - నొక్కి నొక్కి చూసిండు
లెక్కలు సక్కగ చేసిండు - లక్షల కట్నం తెమ్మండు - అక్కో సారక్కో

చరణం పంతులు పని చేస్తుండు - ఇదిగా నన్నే చూసిండు
ఇంటిక నన్నే రమ్మండు - పలక చేతిలో పెట్టిండు
బెత్తం చేతిల పట్టిండు - నీతులు బాగా నేర్పిండు
అ ఆ ఇ ఈ నేర్పిండు - ట్యూషన్ ఫీసు తెమ్మండు - అక్కో సారక్కో

చరణం చూడ చక్కని ఒన్నోడు - పూజారొక్కడు న్నాడు
గుడిక నన్ను రమ్మండు - ఏదో మంత్రం చదివిండు
గంట గణ గణ కొట్టిండు - శరగోపం నెత్తిన బెట్టిండు
హారతి పళ్ళెం పట్టిండు - కానుకలేసి పొమ్మండు - అక్కో సారక్కో

చరణం ఒడ్డుమీద కూసోడు - శాగదేరి ఉన్నాడు
తట్టబుట్ట తెమ్మండు - తనతో కూలికి రమ్మండు
గడ్డపార పట్టిండు - గడ్డ పెగలు తీసిండు
గుడిసెకు నన్నే రమ్మండు - నా మెడలో తాళి కట్టిండు
నా గుండెలో దేవుడు వాడక్క - వాని గుడిసెలో దేవత నేనక్క
ఈ దిక్కు సాలక్కో - ఏ దిక్కు వద్దక్కో
ఏ దిక్కు వద్దక్కో - ఈ దిక్కే సాలక్కో - అక్కో సారక్కో

అంకితం స్త్రీ పాంద వివాహ సంస్థలకు మరియు పునర్ వివాహ సంస్థలకు అంకితం

# 6 నేటి కిట్టయ్య

పల్లవి	అట్టాగంటే ఎట్టాగయ్య కిట్టయ్య
ముద్దు కిట్టయ్యా - మొద్దు కిట్టయ్యా

చరణం	వల్లనమ్మ నేను పోతే కిట్టయ్యా
దారి విడిచి పోతావేంటి కిట్టయ్యా
దాగి దాగి ఉండావేంటి కిట్టయ్యా
దారి గాచి పట్టవెంటి కిట్టయ్యా
కొంగు పట్టి లాగవేంటి కిట్టయ్యా
కొంగు వదిలి ఎడతావేంటి కిట్టయ్యా	- అట్టాగంటే ఎట్ట

చరణం	మొల లోతు నీళ్ళలో కిట్టయ్యా
జలకాలాడుతు నేను ఉంటే కిట్టయ్యా
చీరలెత్తుక పోవు ఎంటి కిట్టయ్యా
చిలిపి చేతలు చేయ్యావెంటి కిట్టయ్యా
కొసరి కొసరి సరసాలాడవు కిట్టయ్యా
కొంటె పనులు చెయ్యావేంటి కిట్టయ్యా	- అట్టాగంటే ఎట్ట

చరణం	అందరిలోన ఇద్దరమొకటై కిట్టయ్యా
మనువాడ రమ్మంటిని కిట్టయ్యా
కట్నాలంటే ఎట్టాగయ్యా కిట్టయ్యా
కానుకలంటే ఎట్టాగయ్యా కిట్టయ్యా
నేను నీవు - నీవు నేను కిట్టయ్యా
మన మీ జగతికి చెరి సగమయ్యా కిట్టయ్యా
యుగనప్పుటందం నేనేనయ్యా కిట్టయ్యా
ఈ జగాని కందం మనమేనయ్యా కిట్టయ్యా	- అట్టాగంటే ఎట్ట

అంకితం	కట్నం వ్యతిరేకించే యువతకు

డబ్బు తీసుకొని వ్యభిచారం చేసే స్త్రీని వేశ్య అంటారు
వరకట్నం డబ్బు పుచ్చుకునే పురుషున్ని మగవేశ్య అనకూడదా?
ఇరువైపుల కమీషన్ పుచ్చుకొని కట్నం ఇప్పించే మధ్యవర్తిని (వారి సంస్థలను) ఏమని పిలవాలి?

# 7 వ్రత విధానం

పల్లవి ఓ అమ్మలారా ఓ అక్కలారా
వ్రతం చేసే విదము తెలియండ
ఓ తమ్ములారా ఓ చెల్లెలారా
ఇలలోన మీరు బుద్ధి చెప్పే విదము తెలియండ

చరణం ఓర చూపులు చూచుచుందురు
ఈల కేకలు వేయుచుందురు
కన్ను సైగలు చేయుచుందురు
రోడ్ల వెంట తిరుగుచుంటూ
వేదించు వెదవల గల్లబట్టి
తన్ని తరిమే వ్రతము తెలియండి – ఓ అమ్మలారా

చరణం బస్సు స్టాపులో నిల్చొనుందురు
వెర్రి చేష్టలు చేయుచుందురు
వరండాలలో కూర్చొనుందురు
వంకర కూతలు కూయుచుందురు
ఈవ్‌టీజాలు చేయుచుందురు
వీరి మూతులు పగలకొట్టె విదము తెలియండి – ఓ అమ్మలారా

చరణం తాగి వచ్చిన మొగడు అయినా
తిరిగి వచ్చిన తనయుడయినా
మత్తు మరిగిన మామ అయినా
బావ అయినా మరిది అయినా
అన్న అయినా తమ్ముడయినా
తన్ని గుద్ది బుద్ధి చెప్పే విదము తెలియండి – ఓ అక్కలారా

*అంకితం ఈవ్ టీజింగ్ ర్యాగింగ్ ను వ్యతిరేకించే వారికి*

# 8 నేటి ఆసుపత్రి

ఎల్లవి — జమ్మురా సమ్మక్క జమ్మురా సారక్క
జమ్మురా సమ్మక్క జమ్మురా సారక్క

సన్నోడు — ఎందిరా ఎద్దోడ ఈడిగిల బడ్డావు ?
ఎందిరా పెద్దోడ సడిగిల బడ్డావు ?

పెద్దోడు — కాళ్ళేమొ లాగబట్టే కండ్లేమొ తిరగబట్టె
కడుపులో ఎసకబట్టె ఎట్టెట్లో కాబట్టె
దవాఖాన పేరు ఎత్తె గుండె గుబుతెత్తిపాయె
ఎట్లరా సన్నోడ నొప్పిరా సిన్నోడ
ఎట్లరా సన్నోడ జల్ది సెప్పురా సన్నోడ
ఆడవాండ్ల దవాఖాండ్ల అమ్మనేమొ సచ్చిపాయె
మగవాండ్ల దవాఖాండ్ల అయ్యనేమొ సచ్చిపాయె
ఎల్లవాండ్ల దవాఖాండ్ల సెల్లెనేమొ సచ్చిపాయె
దవాఖాన పేరుసెప్తె గుండె గుబులెత్తిపాయె — జమ్మురా సమ్మక్క

సిన్నోడు — అట్లగిట్ల దవాఖాన కాదురా పెద్దోడ
ఇప్పుడెట్లాంటి దవాఖాన సూడరా పెద్దోడ
అంబులెన్సు అబ్బాసు గేటుకాడ గోస్‌మియా
జల్దిచలో అంటారు అందర్ చలో అంటారు
ఆయమ్మ వస్తాది అయ్యోపాపం అంటాది
వార్డుబోయ్ వస్తాడు జల్దిబండి తెస్తాడు
సన్న సిస్టరొస్తాది సెల్లెలాగ సూస్తాది
పెద్ద సిస్టరొస్తాది తల్లిలాగ సూస్తాది
చిన్న డాక్టరొస్తాడు తమ్ముడల్లె సూస్తాడు
పెద్ద డాక్టరొస్తాడు దేముడల్లె సూస్తాడు
పానంమంటె పానమని పోతే మల్లిరాదని
కిందమీద బడతారు మంచి మందు లిస్తారు
ఆ యముడితోటి కొట్లాడి ఇంట్ల దీప మెడ్తారు — జమ్మురా సమ్మక్క

ఎద్దేడు గట్టినా ఎన్నోడ వింటిరా ఎన్నోడ
పోదాం పద ఎన్నోడ – జల్ది పోదాం పద ఎన్నోడ
దవాఖానక పోదాము జల్ది పోదాం ఎన్నోడ
జల్ది పోదాము ఎన్నోడ జల్ది పోదాం ఎన్నోడ

*అంకితం దవాఖానల వైద్యులక నర్సులకు తదితర ఆసుపత్రి సిబ్బందికి*
*సందర్భం జాతీయ దినోత్సవం జనవరి 1991 ఉస్మానియా ఆస్పత్రి*

# 9 రిక్షాబండి

పల్లవి
ఒండర బండిర బండిర – బండిర తొక్కుడు బండిర
బండిర బండిర బండిర – బండిర నెత్తురు బండర
బండిర బండిర బండిర – బండిర రిక్షా బండిర

చరణం
తొక్కంగ తొడలు పాయెర – నిక్కంగ మెడలు పాయెర
గుంజంగ గూడలు పాయెర – వంగి నడుమంత పాయెర
తొడులు పాయె మెడలు పాయె – నడుము పాయె గూడలు పాయె
రోజంత తొక్కిన కడుపు నిండకపాయె –బండిర–బండిర

2 చరణం
ఎదురుంగ R T C బస్సుర – ఎనకాల లీలాండు ట్రక్కుర
అటు వైపు చిన కారు – ఇటు వైపు ఎదకారు
చినకారు పెద కారు స్కూటారు మోటారు
ఎది గుద్దిన కాని కుప్పకూలిపాయె
సచ్చింది బతికింది ఇంట తెలియదాయె –బండిర–బండిర

3 చరణం
పయ్యల గాడుపు కొట్టి – పైడిలు కాలితో పట్టి
చేతిలో హ్యాండీలు పట్టి – చైనుకు గుండెను చుట్టి
ఊపిరి గట్టిగ పట్టి – నడుముకు ఉడుమును చుట్టి
ఉరిమినా మెరిసినా – ఎడుగు వలె తిరగబడి
ఎ ఈడువాడైన – ఎక్కాలి తొక్కాలి
ఎదురు గడ్డొచ్చినా – ఎదిరించి తొక్కాలి బండిర – బండిర

4 చరణం  ఓ తల్లి భారతి – మా తల్లి భారతి
ఓ శాంతి చిహ్నమా – మా మాతృ దేశమా
నీ కన్ను బిడ్డలక – నీవు వేసిన శిక్ష
మేము నడిపే రిక్ష – నిలువెల్ల నీకు రక్ష
ఈ శిక్ష మాకు రక్ష – ఈ రిక్ష నీకు రక్ష
నిలువెల్ల నీకు రక్ష – నిలువెల్ల నీకు రక్ష  బండిర – బండిర

*అంకితం  రిక్షా కార్మిక లకు కార్మికసంఘాలకు అంకితం*

*1)) కార్మికసభ – మ్యాడం అంజయ్య హాలు*

*1956లో రెండు రోజులు రిక్షా తొక్కి వ్రాసిన గేయం*

## 10 నాటు తుపాకిలో గుండు

పల్లవి  నాటు తుపాకిలో గుండో – నైజాం గుండెల్లో గుండో
వల్లబాయిక మల్లె దండో – భరతమాతకు పూలచెండో
మన తల్లి సల్లగుండా – మన జిల్లా నల్లగొండ

చరణం  అటువైపు కొదాటి గుట్ట
ఇటువైపు భోనగిరి గుట్ట
నల్గొండ లతిసాబ్ గుట్ట
నడుమ ఎత్తైన అరపెల్లి గుట్ట
గుట్టగ మారిన గుండెలురో
గుండెలు తీసిన బండలురో  – నాటుతుపాకిలో గుండో

చరణం  అటువైపు దురాశ్పల్లి
ఇటువైపు నార్కట్పల్లి
వరసేల ఉండేల మరసింబు బాంబులు
సూర్యపేట నుండ సూటి సూస కొట్టె
నైజాం కింఖోరి బద్దలయ్యింది
రజకారు పోలీసు డెంక పోయింది  – నాటుతుపాకిలో గుండో

చరణం　　మట్టున్న జల్లాల అండ
　　　　ఊరికో లంబాడి తండా
　　　　తండాకు కొట్లాల అండ
　　　　తండాలు కావవి జాతీయ జెండాలు
　　　　దండాలు దండాలు జాతికే దండాలు
　　　　దేశభక్తుల కండ - దేశరక్షణ కండ　　　　- నాటుతుపాకిలో గుండో

చరణం　　ఒక తల్లి పానాలు పాయె　ఒక చెల్లి మానాలు పాయె
　　　　ఒక తండ్రి తల ఎగిరి పాయె　ఒక అన్న కాళ్ళిరిగిపాయె
　　　　పానాలు పోయినా ! మానాలు పోయినా !
　　　　కళ్లూడి పోయినా ! కాళ్ళు తెగిపోయినా
　　　　అన్ని జాతులు కలిసి కదను తొక్కిన జిల్ల
　　　　కాసిం రజ్వీని కాటికంపిన జిల్ల
　　　　నైజాం రాజును తరిమి కొట్టిన జిల్ల
　　　　ఢిల్లీ పట్టణమంత దద్దరిల్లిన జిల్ల
　　　　దేశ దేశాలన్ని మోకరిల్లిన జిల్ల　　　　- నాటుతుపాకిలో గుండో

*అంకితం　నైజాం వ్యతిరేక సాయుధ పోరాటంలో పాల్గొన్న*

*నా తల్లిదండ్రులకు　　నల్లగొండ ప్రజలకు　మరియు　సర్దార్ వల్లభాయి పటేలు గారికి*

# 11 బుడ్డ పరకలు

పల్లవి చింతచెట్టు పుట్టిం దెందుకురా - ఓయ్
ంత పులుసు ఎట్టేటందుకురా?
ఓరి యాద్గిరి రాంగిరి పండరి డింగరి సోంబిరి
బుడ్డ పరక పుట్టిం దెందుకురా?
పులుసుల పడి సచ్చేటందుకురా?
ఓరి యాద్గిరి రాంగిరి పండరి డింగరి సోంబిరి
మరి బీద సాదలు పుట్టే దెందుకురా
బడా బాబులు బలిసేటందుకురా
ఎం సెప్పినవురో రాములన్న
నువు బాగ సెప్పినవురో సోములన్న ॥ చింతచెట్టు॥

చరణం కోడిపుంజు పుట్టే దెందుకురా? ఆహాం - ఆహాం
అటికెలబడి ఉడికేటందుకురా
కోడి గుడ్డు ఎట్టేదెందుకురా - ఆహాం - ఆహాం
ఉల్లిగడ్డతో ఉడికేటందుకురా
మరి బీదసాదలు పుట్టే దెందుకురా?
కోడి బతుకులు బతికేటందుకురా
ఎం సెప్పినవురో రాములన్న
నువు బాగ సెప్పినవురో సోములన్న ॥ చింతచెట్టు॥

చరణం కాపరి ప్రేమంత గొఱ్ఱెమీదరా
ఎంచి ఎంచి ఎద్దచేసి సంత కమ్మెరా
కసాయి ప్రేమంత గొఱ్ఱెమీదరా
ప్రేమతో నీరుతాపి గొంతు కోసెరా
ఉన్న వాన్ని నమ్మేది బీదసాదరా
బీదవాని బతుకంత గొఱ్ఱె బతుకురా
ఎమి సెప్పినవురో రాములన్న
నువు బగా సెప్పినవురో సోములన్న ॥ చింతచెట్టు॥

సంతం బీదంకు

# 12 ఇదేం దేశమురన్నో

పల్లవి ఇది ఏమి దేశము రన్నొ – ఇది ఏమి రాజ్యము రన్నొ
సూడసక్కని దేశ మన్నొ – సూపు సక్కగ లేదు రన్నొ
సక్కనైనా దేశ మన్నొ – సక్కంగ నడపాలి రన్నొ

ఒకటవ చరణం జండాకు ఒక ఒండ్ రన్నొ – గూండాకు ఒక ఒండ్ రన్నొ
పూటకొక్క ఒండ్ రన్నొ – మాటకొక్క ఒండ్ రన్నొ
బండ్ మీద ఒండ్ రన్నొ – బేజారు బతుకాయె రన్నొ ఇది ఏమి దేశమన్నొ

రెండవ చరణం కులాలు విడదీసె రన్నొ – కులతలే నింపేసె రన్నొ
మాతాలు విడదీసె రన్నొ – మమతలె తెంచేసె రన్నొ
గూండాలు జోరాయె రన్నొ – గుండెలదిరిపాయె రన్నొ ఇది ఏమి దేశమన్నొ

చరణం ఉత్తుత్తి పార్టీలు రన్నో – పత్తిత్తు పార్టీలు రన్నొ
ప్రాంతానికొక పార్టీ రన్నో – పుట్టకొక్కులాయె రన్నొ
రంగురంగుల పార్టీ లన్నో – రక్తపాతం తెచ్చె రన్నొ ఇది ఏమి దేశమన్నొ

చరణం గాంధీ పుట్టిన దేశ మన్నొ – గంగలో తొక్కేసె రన్నొ
గాంధీపుట్టిన దేశ మన్నొ – గందరగోళం ఎందు కన్నొ
ప్రేమనే పంచాలి రన్నొ – హింసనే వీడాలి రన్నొ
సహనమే చూపాలి రన్నొ – శాంతిగా బతకాలి రన్నొ
సక్కసక్కని దేశ మన్నో – సక్కంగ నడపాలి రన్నొ
మనం సక్కంగా నడవాలి రన్నో
మనం సక్కంగా నడపాలి రన్నో ఇది ఏమి దేశమన్నొ

*దేశ భక్తులకు అంకితం*

*ఉస్మానియా ఆసుపత్రి వార్షిక దినోత్సవం 1999 సం॥ర లో*

# 13 పూలు - పూలు

పల్లవి సునెజో బోలు బచ్చారే – హమారే లోగ్ జానారే
సునెజో బోలుబచ్చారే – హమారే లోగ్ జానారే

చరణం గులాబి పూలు ఉన్నాయి – పూలల్లో వంద మున్నాది
సామంతి పూలు ఉన్నాయి – పూలల్లో సమత ఉన్నాయి
మల్లియ పూలు ఉన్నాయి – పూలల్లో మమత ఉన్నాయి
లోకాన పూలు ఉన్నాయి – దేశాన్ని ఏలు కున్నాయి
సునెజో బోలు బచ్చారె

చరణం సీరేలు మంచి గున్నాయి – రంగూలు కొంచె మున్నాయి
రైకాలు మంచి గున్నాయి – రంగుల్లో లోప మున్నాది
కళ్ళెము మంచి గున్నాయి – మాపుల్లో మరక ఉన్నాయి
కళ్ళల్లో మంట లున్నాయి – కంటీక తెలియ కన్నాయి
సునెజో బోలుబచ్చారే

చరణం చిన్నాలు చేసిన పనులు – పెద్దాలు మెచ్చ రోరయ్యో
పెద్దాలు చేసిన పనులు – చిన్నాలు నచ్చ రోరయ్యో
అందరూ కలినప్పుడే – దేశాన పూలు పూలయ్యో
కులమతాలు కలిసినప్పుడే – దేశాన పూలు పూలయ్యో
పూలుపూ లయ్యో పూలుపూ లయ్యో పూలుపూ లయ్యో
సునెజో బోలు బచ్చారే

అంకితం అమన్ కమీటీలకు సమ సమానత్వం కోరేవారికి

# 14 బాపు బాట

పల్లవి   తల్లి బయ లెల్లినాదో - నా తల్లి
తల్లి బయ లెల్లినాదో - నా తల్లి
బయ లెల్లినాదో నా తల్లి
నా తల్లి బయ లెల్లినాదో

చరణం   కల్లుసార వదలమన్నదో - నా తల్లి
మత్తుమైక మొదలమన్నదో - నాతల్లి
జీవహింస మానమన్నదో - నాతల్లి
బాపు బాట నడవమన్నదో - నాతల్లి    -తల్లి బయలెల్లినాదో

చరణం   చదువు కాస్త నేర్వమన్నదో - నా తల్లి
చక్కరంగ నడువమన్నదో - నా తల్లి
వరకట్నం వదలమన్నదో - నాతల్లి
గౌరవంగ బతకమన్నదో - నా తల్లి    -తల్లి బయలెల్లినాదో

చరణం   కులమతా లొక్కటన్నదో - నా తల్లి
కలిసిమెలిసి బతకమన్నదో - నా తల్లి
బరత జాతి ఒక్కటన్నదో - నా తల్లి
బరత ఖండ మొక్కటన్నదో - నా తల్లి    -తల్లి బయలెల్లినాదో

*అంకితం   గాంధీయులకు మరియు గాంధీతాతకు*

*ఉస్మానియా ఆస్పత్రి వార్షిక దినోత్సవం 2001 నవంబర్*

## 15 కార్గిల్

పల్లవి రారో రారో రారో - జల్ది వేరో వేరో వేరో
అమ్మకు చెబుదాము - రారో రారో రారో
భారతమ్మకు చెబుదాము - లేరో వేరో వేరో
రారో రారో రారో - జల్ది లేరో లేరో వేరో

చరణం కొండమీద కొక్కిరాయిరో
జండా మీద పావురాయిరో
కార్గిల్ కొండ మీద కొక్కిరాయిరో
జాతీయ జెండామీద పావురాయిరో
గండంలో ఎక్కినాదిరో - సుడి గుండంలో ఎక్కినాదిరో -రారో రారో రారో

చరణం బాపూజీ బాటలో ముళ్ళ కంప మొలిచింది
చాచాజీ గులాబీల గుండె పగిలి పోతుంది
వల్లబాయి దేశభక్తి బక్కచిక్కి పోతుంది
భగత్‌సింగ్ గుండె బలం కృంగి కూలిపోతుంది
చంద్రబోస్ కండబలం ముండమోసి పోతుంది - రారో రారో రారో

చరణం కాషాయపు రంగేమో - కన్నెఱ్ఱ చేస్తుంది
ఆకుపచ్చని రంగేమో - ఆకలి మంట రేపుతుంది
అశోక చక్రమేమో - లుక లుకమంటుంది
తెల్ల మల్లె రంగేమో - రకత ఎకత మౌతుంది -రారో రారో రారో

అంకితం భారత సైనికులకు
కార్గిల్ సభ శ్రీ కృష్ణదేవరాయ భాషా నిలయం

## 16 విశ్వ కార్మికులు

ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కష్ట జీవుల అడ్రస్సెక్కడ ?
ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కష్ట జీవుల అడ్రెస్సెక్కడ ?
పొట్టలు చిట్లిన వేళ్ళను అడుగు - రక్తం తడసిన రాళ్లను అడుగు
చమటతో తడిసిన సిమెంటు నడుగు - ఇక్కట్లనపడె ఇటికల నడుగు

అక్కడ ఉక్కడ ఉక్కడ - కష్ట జీవుల అడ్రస్సక్కడ
అక్కడ అక్కడ అక్కడ - కష్ట జీవుల అడ్రస్సక్కడ

ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కార్మిక జనాల అడ్రస్సెక్కడ ?
ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - విశ్వ కార్మిక జనాల అడ్రస్సెక్కడ?
సలసల మరిగే డాంబరునడుగు - గిరి గిర తిరిగే రోలరు నడుగు
కర కర నలిగే కంకర నడుగు - కరెంటు తీగల నరాల నడుగు
అక్కడ అక్కడ అక్కడ - కార్మిక జనాల అడ్రస్సక్కడ
అక్కడ అక్కడ అక్కడ - కార్మిక జనాల అడ్రస్సక్కడ

ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కార్మిక జనాల అడ్రస్సెక్కడ?
ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కష్ట జీవుల అడ్రస్సెక్కడ?
కొలిమిలో మండే మంటల నడుగు - నింగికి ఎగిసే నిప్పుల నడుగు
సమ్మెట లేసే దెబ్బల నడుగు - దెబ్బకు పగిలిన డాకలి నడుగు
అక్కడ ఉక్కడ అక్కడ - కార్మిక జనాల అడ్రస్సక్కడ
అక్కడ అక్కడ అక్కడ - కష్ట జీవుల అడ్రస్సక్కడ

ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కర్షక జనాల అడ్రస్సెక్కడ?
ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కర్షక జనాల అడ్రస్సెక్కడ?
కాడిని అడుగు మేడిని అడుగు - కఱ్ఱును అడుగు గొఱ్ఱును అడుగు
పారల నడుగు గడ్డ పారల నడుగు - గొడ్డలి నడుగు గండ్రగొడ్డలి నడుగు
అక్కడ అక్కడ అక్కడ - కర్షక జీవుల అడ్రస్సక్కడ
అక్కడ అక్కడ అక్కడ - కర్షక జీవుల అడ్రస్సక్కడ?

ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కష్టజీవుల అడ్రస్సెక్కడ
ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? - కష్టజీవుల అడ్రస్సెక్కడ
ఎఱ్ఱగ మండే ఎండల నడుగు - ఎముకలు కొరికె చలిపులి నడుగు
ఎండిపోయిన డొక్కల నడుగు - అకలి వేసె కేకల నడుగు
అక్కడ అక్కడ ఉక్కడ - కష్టజీవుల అడ్రస్సక్కడ
అక్కడ అక్కడ అక్కడ - కష్ట జీవుల అడ్రస్సక్కడ

*సాహిత్య బ్రహ్మ శ్రీ డా॥ వి వి యల్ నరసింహారావు గారు ఈ గేయాన్ని విని నా స్నేహితుడైన శ్రీశ్రీని మళ్లీ నా కళ్ళ ముందుంచావు ఈ గేయం ద్వారా అంటూ చెమర్చిన కళ్ళను తుడుచుకుంటూ వ్యాఖ్యానించారు శ్రామికుడే దైవంగా బావించిన కార్మిక శక్తిక వక్తుడు మహకవి శ్రీశ్రీకి ఈ గేయం అంకితం*

# 17 చూడర చూడు

పల్లవి మాడర మాడు – చూడూమాడు
చూడర మాడు – తేడా మాడు
మాడర చూడు – మళ్ళీ చూడు
బడుగు వర్గాల బ్రతుకులు మాడు
మావినదెల్ల – మరవకు మల్లా
మరిచిపోతివా – మార్పురాదురా

చరణం కష్టజీవుల కళ్ళను చూడు
కార్మిక జనాల కాళ్ళను చూడు
కర్షక జనాల వేళ్ళను చూడు
కూలిజనాల ఒళ్ళను చూడు
మేడలు మెరిసే తీరును చూడు
మేడల ప్రక్కన గుడిసెలు చూడు

చరణం కుక్కల వలె – నక్కల వలె
సందులలో – పందులవలె
బూడిదలో – గాడిదవలె
బురదలలో – గేదెలవలె
ఎల్లి నోటిలో – ఎట్లలవలె
పులుల నోటిలో – జింకలవలె

చరణం ఎక్కడ చూసిన ఎండమావులే
పూటకు నడవని పాడు బ్రతుకులే
గూడులు లేని ఎముకల గూడులు
నింగీ నేలల అంగ వస్త్రములు
ఆకలి మంటల హారములేరా
చావు బ్రతుకుల సయ్యాటేరా

చరణం  మట్టిచిప్పలో గటకే వేదుర
గతకటా ఇక గంజే లేదుర
పళ్లెం క్రింద పాలరాయిరా
పాలరాతిపై పాయఖానరా
అన్నము తిన్నా - పరమాన్నము తిన్నా
మల మలానికి తేడా వేదుర
నరనరాలకు - నవరంధ్రాలకు
బీద - దనికపు తేడా వేదుర

చరణం  ఎంటు వాసనల గొప్పలు చూడు
చెమట వాసనల తిప్పలు చూడు
అహంకారము  దురహంకారము
దోపిడి దొరల వీర విహారము
రాజకీయ దుర్మదాందకారము
కూరుకుపోయిన తేడా చూడర
కూకటి వేళ్ళతో కూల్చి వేయర

అంకితం  ఆర్థిక సమానత్వం సమాజంలో మార్పు కోరేవారికి
ఉన్నవాళ్ళు ఎదగాలి లేనివాళ్లపైకి తేవాలి అదే ప్రగతి

# 18 కాకి - కోకిల

పల్లవి కాకీకె కాకికి కాక - కాకీకె కోకిల కేల ?
కాకీకె కాకికి కాక - కాకీకె కోకిల కేల ?

చరణం కాకుల గూటిలో - కోకిల గుడ్డేల ?
కాకి ఎల్లను - కోకిల సాకేనా ?
కాకులు కాకులే - కోకిల కోకిలే

చరణం కోకిల వలె - కాకులు కూసేనా ?
కాకుల సేవ - కోకిల చేసేనా ?
కాకులు కాకులే - లోకులు కాకులే

చరణం చావు ఎండము - కోకల ముట్టేనా ?
ఆత్మల శాంతికి - కాకులు దిక్కేరా
కాకుల కోకిల కదలే ఆదారం
లోకుల వ్యదలే - పక్షుల సారాంశం

*అంకితం పక్షలను మూగజీవులను రక్షించేవారికి అంకితం*

# 19 వాన చుక్కమ్మా

పల్లవి మక్కల్లో చుక్కమ్మా - వాన నీటి చుక్కమ్మా
నిస్వార్థపు నీట చుక్కమ్మా - ఆడ బ్రతుకు వాన సుక్కమ్మా

చరణం ఆకాసాన తెల్ల మబ్బులు నల్లబడ్డవి
మబ్బుల్లోని వాన సుక్కలు నేల బడ్డవి
నేల బడ్డ వాన సుక్కలు మైల బడ్డవి
దుక్కిదున్నే దున్నపోతులు సల్ల బడ్డవి
పంటచేలు పైరులన్ని పచ్చబడ్డవి
నింగీ నేలా నీవేనమ్మ సుక్కమ్మా
నీవే లేని నింగీ నేలా ఎలమ్మా -

చరణం నాన్న కడుపులో ఆడుకొని
అమ్మ కడుపులో పడుకొని
పది నెలలా పాపగ నీవు
పదిలంగా రావాలమ్మా -

చరణం అన్నకు తోడుగ రావాలమ్మా
తమ్ముని తోలుకు రావాలమ్మా
అక్కతో ఆడుతూ రావాలమ్మా
చెల్లితో పాడుతూ రావాలమ్మా -

చరణం బగవంతుడికైనా తోడు కావాలమ్మా
బలవంతునికైనా నీడ కావాలమ్మా
ఇలలోనైన కలలోనైనా మక్కమ్మా
ఇల్లాలే ఇలవేల్పమ్మా వాన చుక్కమ్మా -

చరణం మక్కలన్నీ కలువాలమ్మా
ఎకమై పారాలమ్మా
సంద్రంలో చేరాలమ్మా
అలలై ఎగిసి రావాలమ్మా
మనిషిలో మార్పు తేవాలమ్మా
అతివల విలువలు ఎరగాలమ్మా

అంకితం స్త్రీ సంపటిత శక్తికి

# ౨౦ ఓం అల్లా

ప॥ హం ఓం అల్లా యా అల్లా – హరి ఓం అల్లా మాషాల్లా
హరి ఓం హరి ఓం జీసస్ – హరి ఓం అల్లా మోజెస్
అల్లా అల్లా ఇన్షా అల్లా – హరి ఓం అల్లా ఇల్లల్లా

చరణం నీతులు లేని కవితలు రా – బూతులు మెచ్చే రోజులు రా
గజి బిజి గజి బిజి రాగము రా – తిక మక తిక మక తాళము రా
అత్తర బుత్తర చిత్ర మురా – తత్తర బిత్తర నృత్యమురా
ఏందర వందర మేళము రా – అంతా గందర గోళము రా
– అల్ల అల్ల ఓం అల్లా

చరణం నైతిక విలువలు తెలుయుమురా – జాతిక రక్షణ చేయుమురా
అజ్ఞానంలో మునగకురా – విజ్ఞానంతో విర్ర వీగకురా
గొంతులుదాక మెక్కకురా – చిక్కుల్లో పడ వావకురా
చెబితే వింటివ సరే సరే – వినక చెడేవు ఒరే ఒరే
– అల్ల అల్ల ఓం అల్లా

చరణం కుల మత సమతా బావ మిది – ఆర్థిక సమతా ధ్యేయమిది
ప్రజలు మెచ్చిన రాజ్యా మిది – అసలు ప్రజాస్వామ్య మిది
బాపూ వేసిన బాట ఇది – చాచా గీసిన చిత్ర మిది
నీదీ నాదీ ఈ దేశం – మమతల కోవెల మన దేశం
– అల్ల అల్ల ఓం అల్లా

అంకితం మత సామరస్యాన్ని చాటే వారికి మరియు చాచాజీకి

## 21 ఉందీ - ఉందీ

పాపా – మీ నాన్నున్నాడా ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాపా మీ అమ్ముందా ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాపా మీ అన్నున్నాడా ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాపా మీ తమ్ముడున్నాడా ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాప మీ తాతున్నాడా ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాపా మీ నానమ్ముందా ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాపా ఇంతకీ నువ్వు
ఎక్కడున్నావు ?
ఉందీ ఉందీ
ఎక్కడ ?
ఆ ఇంట్లో

పాప మీ అమ్మమ్మ ఉందా?
పోయింది
ఆచ్చి పోయింది
ఇక లాదు
అంది అదోలా చేయి తిప్పుతూ

మా ఆవిడ కంట నీరు కనపడింది
పోయిన తన తల్లి గుర్తొంచ్చింది కాబోలు

ఎన్నో రకాల ఇండ్లుంటాయి అందరిది
ఆ ఇల్లు అనే భగవత్ సాన్నిద్యాన్ని
చెప్పక చెప్పింది మా రెండేండ్ల పాప

అంకితం మా పాప జయశ్రీకి ఇంకా చిన్నారులకు
చిన్న పిల్లల పాప దైవ పాప వెంటనే అర్థం కాదు

# 22 అన్నం పప్పు చారు

పాపా నిన్న తిన్నావా?
తిన్నా తిన్నా
ఏం తిన్నావు?
అన్నం పప్పు చారు

పాపా రాత్రి తిన్నావా?
తిన్నా తిన్నా
ఏం తిన్నావు?
అన్నం పప్పు చారు

పాపా పొద్దున తిన్నావా?
తిన్నా తిన్నా
ఎం తిన్నావు?
అన్నం పప్పు చారు

పాపా మధ్యాహ్నం తిన్నావా?
తిన్నా తిన్నా
ఎం తిన్నావు?
అన్నం పప్పు చారు

పాపా రేపు ఏం తింటావు?
తిన్నా తిన్నా
ఎం తింటావు?
అన్నం పప్పు చారు

*నా గతాన్ని నా గమ్యాన్ని మనిషి మనుగడ రహస్యాన్ని చెప్పింది మా రెండేళ్ళ పాప. పిల్లలు - పాపలు దైవస్వరూపాలు వారికి అంకితం*

## 23 మిర్చి - బజ్జి

పల్లవి ఒజ్జిర ఒజ్జి - ఒజ్జిర ఒజ్జి
బజ్జిర బజ్జి - పచ్చి మిర్చి బజ్జి

చరణం శనగపిండ నీరు కలిపి - కారం ఉప్పు కొస్త వేసి
పచ్చి మిర్చి పగలదీసి - ఎండిపోన ముంచి తీసి
కాతే కాతె నూనెలో - కాల్చుకొని తింటుంటే - అరెరెరెరె -ఒజ్జిర బజ్జి

చరణం ఆలుబజ్జి - అరటి బజ్జి - పాలకూర పప్పు బజ్జి
సమవుజ్జీ లేని బజ్జి - వెజిటేబుల్ మిర్చి బజ్జి
ఊరూర మిర్చి బజ్జి - నోరూరే మిర్చి బజ్జి
మెండైన మేటి బజ్జి - ఆల్ ఇండియా మిర్చి బజ్జి - బజ్జిర బజ్జి

చరణం మోటా మోటా మిర్చి బజ్జి - చోటా చోటా మిర్చి బజ్జి
బుల్లి బుల్లి మిర్చి బజ్జి - గల్లి గల్లి మిర్చి బజ్జి
బలే బలే మిర్చి బజ్జి -బల్ సందైన మిర్చిబజ్జి
తెల్ల వాని గుండెల్లో -క్విట్ ఇండియా మిర్చిబజ్జి - బజ్జిర బజ్జి

చరణం కులం గజ్జి లేని బజ్జి - మతం పిచ్చి లేని బజ్జి
మమతను పంచేటి బజ్జి -సమతను చాటేటి బజ్జి
ప్రజ మెచ్చిన మిర్చిబజ్జి - ప్రజాస్వామ్య మిర్చిబజ్జి
భరత జాతి వోల్టేజి - భరత మాత ప్రేస్టేజి - బజ్జిర బజ్జి

అంకితం క్విట్ ఇండియా ఉద్యమం కు

## 24. విప్లవాల జాడలు

పల్లవి ఉరుముతుంది ఉరుముతుంది విప్లవం
తరుముతుంది తరుముతుంది విప్లవం
ఉరిమి ఉరిమి తరుముతుంది విప్లవం
తరిమి తరిమి ఉరుముతుంది విప్లవం
రగులుతుంది రగులుతుంది విప్లవం
రేయి పగలు రగులుతుంది విప్లవం
విప్లవాల జాడ తెలుపనా చెల్లెమ్మా
పోరు బాట నిన్ను నడపనా చెల్లెమ్మా -ఉరుముతుంది

చరణం విప్లవం అంటే ఏమిటంటవా ! ఓ చెల్లెమ్మా
పోరు బాట చూపమంటవా నా చెల్లెమ్మా
విప్లవాల జాడ తెలుసుకో ఓ చెల్లెమ్మా
వీరవనిత గూడు కట్టుకో నా చెల్లెమ్మా -ఉరుముతుంది

చరణం నట్టనడి రాత్రుల్లో - కొండల్లో కోనల్లో
అర్ధరేతిరి అడవుల్లో - తోడేళ్ల అరుపుల్లో
కీచురాళ్ళ నడమ నీవు - ఒంటరిగా తిరిగి చూడు
గుండు వెనక దాగి చూడు - గుండు యెక్కిపెట్టి చూడు -ఉరుముతుంది

చరణం చెట్టుకొమ్మ ఎక్కిచూడు - పుట్ట వెనక నక్కిచూడు
బుదర అడుగు దాగి చూడు - ఇసుక దిబ్బ ఒదిగి చూడు
విప్లవం యాడుందని యేమి చెప్పను ఓ చెల్లెమ్మా
పోరాటం యెక్కడంటే ఏమి చెప్పను నా చెల్లెమ్మా -ఉరుముతుంది

చరణం మేకవన్నె పులుల చూడు - గోముఖ వ్యాఘ్రాలు చూడు
వెట్టి చాకరి వెతలు చూడు - భూస్వాముల్ల పొగరు చూడు
గుక్కపట్టి లేవమ్మో చెల్లెమ్మా - నడుం కట్టి రావమ్మో చెల్లెమ్మా
ఎక్కుపెట్టి రావమ్మో చెల్లెమ్మా - ముట్టుబెట్టి పోవమ్మో చెల్లెమ్మా
-ఉరుముతుంది

చరణం అండమాన్ జైల్లు చూడు - జైలు గోడల నడుమ చూడు
గోడలపైన నెత్తురు చూడు - నెత్తురు రాసిన రాతలు చూడు
ఉరికొయ్యల నీడల్లు చూడు - ఉరితాడుల ముడుల చూడు
సమరయోధ జాడ తెలుసుకో ఓ చెల్లెమ్మా
సమరంలో నన్ను కలుసుకో నా చెల్లెమ్మా -ఉరుముతుంది

*అంకితం* దేశంలో అండమాన్ దీవుల్లో దేశ స్వాతంత్ర్యం కొరకు బలియైన విప్లవకారులకు

# 25 సూద్దాం రార

పల్లవి పోదాంరార ఎచ్చిగో - సూద్దాం రార బుచ్చిగో
జండా ఎగరేస్తరంట - జనగనమని పాడ్తారంట
పోదాంరార ఎచ్చిగో - సూద్దాం రార బుచ్చిగో

చరణం ఒడగోచి ఎటుకొని - బొచ్చు బాగ ఎంచుకొని
జోలె సంకకేసుకొని - చిప్ప సేత పటుకొని
పోదాంరార ఎచ్చిగో - సూద్దాంరార బుచ్చిగో - పోదాం రార

చరణం కూలివాళ్ళ పేగులన్ని - తోడి తొవ్వి కుప్ప ఎట్టి
కుప్పమీద గద్దెకట్టి - గద్దెమీద జండాబెట్టి
జండా ఎగరేస్తరంట - జల్ది నెల్లిపోతరంట - పోదాం రార

చరణం కోట్లు కూడబెటుకొని - పటుపంచ కటుకొని
సెంటుగట్ట పూసుకొని - సెక్యూరిటి బెట్టుకొని
ఏ.సి. కార్లవస్తరంట - జండా ఎగరేస్తరంట - పోదాం రార

చరణం గుడిసెలు ఏస్తరంట - గుండాలను పిలిపిస్తరంట
గుడిసెలు పీకేస్తరంట - మేడలు కట్టిస్తరంట
అడ్డమొచ్చినోళ్ల సంప - జండా ఎగరేస్తరంట - పోదాం రార

చరణం కాశ్మీరులో కిరికిరి - పంజాబులో కిరికిరి
అస్సాములో గొడవంట - ఆంధ్రాలో జగడమంట
జగడంలో జగడమంట - జండా ఎగరేస్తరంట - పోదాం రార

చరణం తెల్లవాళ్ళు పారిపోయి - ఐదు పదులు దాటింది
నల్ల దనం ఎరిగిపోయి - ఎరుపై పారుతుంది
అడిగినోళ్ల బొంద బెట్టి - జండా ఎగరేస్తరంట - పోదాం రార

చరణం గొర్రెలను ఎంచాలంట - గోదలను సాకాలంట
పాడిపంట పంపాలంట - కడుపు కాలి సావాలంట
సచ్చినోళ్ల గోరి కట్టి - జండా ఎగరేస్తరంట - పోదాం రార

చరణం బుడగోసి పోతేనేంది? - బొచ్చు ఊడిపోతేనేంది ? ఒరేయ్
మన దేశం మన రాజ్యం - మన రాజ్యం మన రాష్ట్రం
ముక్కలు చేస్తరంట - జండాలెగరేస్తరంట
ముక్కలు చేసేటోళ్ల - మక్కెలిరిగ తన్నుదాం - పోదాం రార

అంకితం దేశ సమైక్యతా వాదులకు ఈ రచన కాశ్మీరు వివాద ఆదారితం

## 26 భరతమాతరన్న

పల్లవి జజ్జనకర జన్న - మన భరతమాతరన్న
జనకజనా జన్న - మన భరత జాతిరన్న

చరణం పుండాకోరు నాయకులను - ఎండిపిప్ప చేయమంది
దగాకోరు నాయకులను - దుమ్ము లేవగొట్టమంది
భూకబ్జా దొరలను - బొక్కలిరగ తన్నమంది
లంచగొండ నాయకులను - నాలుక తెగ నరకమంది - జజ్జనకర జన్న

చరణం అటు చూస్తే ఒక పదకం - ఇటు చూస్తే ఒక పదకం
ప్లాను గీసి పదకమేసి - పబ్లిగ్గా దోస్తుండ్రు
కూలివాళ్ళ నోళ్ళు కొట్టి - కోట్లు కూడ బెడ్తుండ్రు
కోట్లు కూడ బెట్టనోళ్ల - కూకటేళ్ల కూల్చమంది - జజ్జనకర జన్న

చరణం మత వాందస పార్టీలను - మక్కెలిరగతన్నమంది
వెన్ను పోటు నాయకులను - తన్ని తరిమి కొట్టమంది
పరదేశపు బ్యాంకుల్లో - ప్రజల దనము మూల్గుతుంది
నీల్గుతున్న నాయకులను - నిలదీసి అడగమంది - జజ్జనకర జన్న

చరణం అల్లూరి బగిత్‌సింగ్ - ప్రాణమిచ్చి నిలిచినారు
వల్లబాయి చంద్రబోసు - మొక్కబోని వీరులన్న
సమరయోదు లెందరో - సమిదలై నిలిచినారు
అంబేడ్కర్ రాజ్యాంగం - అండగ నిలిచినదన్న - జజ్జనకర జన్న

చరణం తల్లి చెల్లి అన్న అక్క - ఆడపడుచు గౌరవం
అసలు సిసలు దేశమన్న - మన ప్రజలు ఎలే రాజ్యమన్న
శాంతి సహన ఆయుదాలు - పునాదులుగా వేసినారు
నిరాహార దీక్ష చేసి - స్వాతంత్ర్యం సాదించినారు - జజ్జనకర జన్న

చరణం జాతిని మేలుకొలిపి - ఖ్యాతిని పెంచమంది
ప్రజాస్వామ్య పద్ధతికే - పరిరక్షణ చేయమంది

ఉగ్రవాద నిర్మూలనకై - నడుము కట్టి నడవమంది
ఉపాంచా విహారాలు - భరతజాతి ఒకటన్నది

చరణం వందెమాతరం అనమంది - వంకర చూపు మానమంది
జనగణమన అనమంది - జెండా ఎగరవెయ్యమంది
భారత సరిహద్దుల్లో - విద్రోహుల గుండెలదుర
వెయ్యర వెయ్యర వెయ్యర - జెండా ఎగర వెయ్యర
వెయ్యర వెయ్యర వెయ్యర - జెండా ఎగర వెయ్యర
వెయ్యర వెయ్యర వెయ్యర - జెండా ఎగర వెయ్యర

అంకితం భరతమాతకు ఆడియో రిపోర్ట్

## 27 ప్రేమ

వాత్సల్యమనే విష వలయంతో
భ్రమ అనే భూబంతి పైన
హృదయమనే ఊహల సౌధంతో
ఆశా మోహాల మిసి మసి ముసుగుల్లో
మనసనే శ్మశానంలో
మమతల సమాధి
ఆహ్లాదపు హలాహలంలో
మృత్యువనే అమృతంలో
క్షణ భంగుర జీవితం
నిరీక్షించి నిరీక్షించి
ప్రేమ అనే పసికందు
ప్రాకులాడు క్షణం క్షణం

అంకితం ప్రేమ మూర్తులకు
పసికందు మాత్రమే ప్రేమ స్వరూపం

# ౨౮ బద్రం దొరో

పల్లవి   జాన్సన్ దొరా – నీ కాళ్ళు మొక్కుతా
బద్రం దొరా – నీ గొంతు నొక్కుతా

చరణం   అరక కట్టి నాగు చేస్తే – రెక్కలిరగ తన్నినావు
సుక్కపొద్దు బండ్లు కడితే – మక్కెలిరిగ తన్నినావు
చెమటోడిచి పని చేస్తే – శ్రమ దోపిడి చేసినావు
నీ గడి గోడలు కూలక ముందే – ఊరిడిచి పో దొరో – బాన్సన్ దొరా

చరణం   సక్కనిది కనపడితే – మానాలు దోచినావు
గిట్లేందని అడిగినోళ్ల – పానాలు దీసినావు
ఊర్లన్ని దోచుకొని – ఉరి కొయ్యలకేసినావు
నీ మెడకు ఉరి పడక ముందే – ఊరిడిసి పోదొరా – బాన్సన్ దొరా

చరణం   బంజరు భూములన్ని – ఖబ్జ ఎట్టుకున్నావు
మాకున్న అర ఎకరం – కుదవ ఎట్టుకున్నావు
జుట్లు జుట్లు ముడిపెట్టి – కొట్లాటలు పెట్టినావు
నీ జుట్టు ఊడి పోకముందే – ఊరిడసి పోదొరా – బాన్సన్ దొరా

చరణం   స్వాతంత్ర్యం వచ్చిందని – సంకలు ఎగరేసినావు
బిర్యాని బీరు మెక్కి – బొర్ర బాగ ఎంచినావు
పిర్ర బలం చూసుకొని – విర్ర వీగి పోయినావు
నీ పుర్రె ఎగిరి పోకముందే – ఊరిడిసి పోదొరా – బాన్సన్ దొరా

చరణం   బత్కనీకి మేమోస్తే – బానిసగ చేసినావు
కూలి పనికి మేమోస్తే – కుక్క బతుకు చేసినావు
గంజి గట్క మాకు బోసి – ఊరి బయట వేసినావు
గట్క బువ్వ తిన్నోళ్లం – గద్దెనెక్కి ఎలుతాము – బాన్సన్ దొరా

*అంకితం   దొరతనానికి ఇది ఆఖరి చరమ గీతం ౧౦ సంవత్సరాల స్వాతంత్ర్యంలో ఈ దేశంలో ఇంకా బాలకార్మికులు బానిస తత్వం వెట్టిచాకిరి దొరల దౌర్జన్యం వేరు వేరు రూపాల్లో ప్రళయ తాండవం చేస్తునే ఉన్నాయి*

*అంకితం   సామ్రాజ్యవాదులకు దొరలకు వ్యతిరేకంగా పోరాడే వారికి*

# 29 నిజ జీవితం

చరణం ఆకాశంలో స్వర్గం లేదు - పాతాళంలో నరకం లేదు
స్వర్గం-నరకం కలిపితేనే - నిజ జీవితం ఈ జీవితం
మాలోకంలోనే అసలు జీవితం - మన జీవితం - ఈ జీవితం

చరణం వేశ్యల వెంట తిరగ బోకురా - వేమన వోలె వగచిపోకురా
జననం - మరణం నిజం నిజం - జయాపజయం దైవాధీనం
కష్టాల్లో కరిగి పోకురా - సుఖాలతోనే తేలిపోకురా
కష్టం - సుఖము కలిపితేనే - నిజం నిజం నిజ జీవితం

చరణం బ్రతుక బాటలు సజీలేరా - నాలుగు ఘడియల నాటకమేరా
నీలో ఉంది నీది కాదురా - నాలో ఉంది నాది కాదురా
నీదంటూ ఏదీ లేదురా - నాదంటూ అసలు లేదురా
నీది నాది కలిపితేనే - నిజ జీవితం - మన జీవితం

చరణం గాలి పీల్చితే గడియ ఉండదు - నీరు తాగితే నిమిషముండదు
కుడిచినదెల్ల కుళ్ళిపోవురా - విడిచినదెల్ల మళ్ళిరాదురా
నూరేళ్ళున్నా వేరు తప్పదు - వెయ్యేళ్ళున్నా చావు తప్పదు
చావు బ్రతుకులు కలిపితేనే - నిజ జీవితం - ఈ జీవితం

చరణం దయ్యం లేదు భూతం లేదు - ఆత్మలేదు అంతరాత్మ లేదు
జీవాత్మ పరమాత్మ అంతం లేదు - భ్రమలో పడి బ్రతుక బోకురా
కాలజ్ఞానం చదువుకొమ్మురా - బ్రహ్మాండాన్ని తెలుసుకొమ్మురా
ఆదిలేద్దురా అంతం లేదురా - ఆది అంతం కలిపితేనే నిజ జీవితం ఈ జీవితం

అంకితం కష్ట సుఖాలను కలబోసి స్వీకరించేవారికి

# ౩౦ ముద్దుర ముద్దు

పల్లవి వద్దుర వద్దు - వద్దుర వద్దు
వద్దుర వద్దు - అసలొద్దుర వద్దు

చరణం కాశ్మీరులో మిలిటెంటు - పంజాబులో టెర్రరిస్టు
ఆంధ్రాలో నక్సలిజం - అస్సాములొ అతివాదం
ఉగ్రాతుల్పా తీవ్రవాదం - ఉసగొలిపే ఉగ్రవాదం - వద్దుర వద్దు

చరణం కుల కలహం మత కలహం - బాషా విబేదం బానిస విదానం
ప్రాంతీయ తత్వాలు - జాతి వర్గ విబేదాలు
ఆర్ధిక అసమానతలు - స్వార్థబరిత పాలనలు - వద్దుర వద్దు

చరణం ఎ కే లో తూటాలు - పోలీసుల లారీలు
ఇన్‌పార్మర్ ఉరుకులాట - ఎన్‌కౌంటర్ పీకులాట
అమానుషపు కృత్యాలు - అమాయకుల హత్యాలు - వద్దుర వద్దు

చరణం సాటుమాటు నాటు బాంబు - హైటెక్ రిమోటు బాంబు
ఆర్డియెక్స్ జిలెటిన్‌స్టిక్స్ - అడుగడుగున ప్రాణ గండం
ప్రజలు ఎలే రాజ్యంలో - ప్రాణాలతో చెలగాటం - వద్దుర వద్దు

చరణం ఈ దేశం మన దేశం - మన దేహం మన ధ్యేయం
సమత మమత సమానత - సమ బావం హితవాదం
గాందీజం బుద్దీజం - ప్రజాస్వామ్య సోషలిజం
గాందీజం బుద్ధీజం - ప్రజాస్వామ్య సోషలిజం
ముద్దుర ముద్దు - ముద్దుర ముద్దు
ముద్దుర ముద్దు - ముద్దుర ముద్దు

*అంకితం ఉగ్రవాదాన్ని వ్యతిరేకించే వారికి*

# 31 ఆకలి మంటలు

పల్లవి ఉయ్యాల ఉయ్యాల ఉయ్యాలో - ఉయ్యాల జంపాల ఊగాలే
ఉయ్యాల జోరుగ ఊగాలే - దేశాన్ని సక్కంగ నడపాలే

చరణం గొరుకొయ్య పొడవంగా లేవాలే - మోట కట్టి నీరు ఎట్టాలే
సుక్క పొద్దుకాడ లేవాలే - మట్టి ఒండ్లు మనం కొట్టాలే
కోడి కూయంగా లేవాలే - తట్ట పార చేత పట్టాలే
పొద్దుపొడవంగా లెవాలే - నాటు పెట్టంగా పోవాలే
పంటలు బాగా పండాలే - ఎండిన డొక్కలు నిండాలే -ఉయ్యాల

చరణం ఎలగటి నాగండ్లు కట్టాలే - దుక్కులు బాగా దున్నాలే
బురద నాగండ్లు కట్టాలే - తరి భూములన్నీ దున్నాలే
నీరు పోసి నారు పెంచాలే - మళ్ళు కట్టి నాటు పెట్టాలే
కరువు తీర సాగు చేయాలే - కడుపు నిండ తిండి పెట్టాలే
అంతట భూములు దున్నాలే - ఆకలి మంటలు ఆపాలే -ఉయ్యాల

చరణం మిట్టమధ్యాహ్నం ఉయ్యాలో - నట్టనడి రాతిరి ఉయ్యాలో
తేడాలు లేకుండ ఉయ్యాలో - కాపలా కాయాలి ఉయ్యాలో
పగలంత పక్షులు ఉయ్యాలో - రాత్రంత పందులు ఉయ్యాలో
ఆపైన దొంగలు ఉయ్యాలో - దోచుకుపోకుండా ఉయ్యాలో
కంటిరెప్పలాగ ఉయ్యాలో - కాపలా కాయాలి ఉయ్యాలో -ఉయ్యాల

చరణం అకాల వర్షాలు ఉయ్యాలో - గాలి దుమారాలు ఉయ్యాలో
ఉరుములు మెరుపులు ఉయ్యాలో - ఎడుగులు రాలంగ ఉయ్యాలో
సావుకు ఎదిరించి ఉయ్యాలో - సాగు చేయ్యాలంట ఉయ్యాలో
చదువు కుంటేనేమి ఉయ్యాలో - సాగుచేసేటోడే గొప్ప ఉయ్యాలో
వ్యవసాయమంటే ఉయ్యాలో - ఎగతాళి చేయ్యకు ఉయ్యాలో -ఉయ్యాల

అంకితం వ్యవసాయదారులకు భూ సంస్కరణ మరియు భూ పరిమితి చట్టానికి

# 32 హోషియార్

పల్లవి హోషియార్ హోషియార్ బంగారక్కో
ఓట్ల కోసం వస్తున్నాడు దొంగ కుక్కో

చరణం కోట్లు కూడబెట్టుకొని – దొంగనోట్లు పట్టుకొని
దొంగ ఓట్లు వేస్తుంటడు – దొరలాగ చూస్తుంటడు
నాటు సార నోట్లే బోసి – ఓట్లు లాగ చూస్తుంటడు – హోషియార్

చరణం పక్కా ఇండ్లు కట్టిస్తనంటు – పరుపులు పరిపిస్తనంటు
బంజరు భూమి పంచిపెట్టి – పట్టాలు ఇప్పిస్తనంటు
గాలి మాటలెన్నో చెప్పి – గాలికి నిన్ను వదిలేస్తడంట – హోషియార్

చరణం నిన్ను నన్ను విడదీసి – నిప్పు నడుమ ఎట్టేడు
దొంగ ఎత్తు లేస్తాడు – దొంగ నాట్యమాడుతాడు
నీ కాళ్ళు మొక్కమొక్కి – నీ తాళ్ళు తెంచుతాడు – హోషియార్

చరణం కిరాయిగాండ్ల తెప్పిస్తడు – కిరాయి బండ్లు తిప్పిస్తడు
జోరు జొన్నలు తొక్కిస్తడు – ఓట్ల ముందె కనిపిస్తడు
ఆ పైన ఐదేండ్ల దాక – కండ్ల బడక పోతుంటడు – హోషియార్

చరణం గద్దె మీద కూకుంటండు – అప్పులెన్నో తెస్తుటండు
నడుములన్ని విరిచేస్తడు – నడిరోడ్డున వదిలేస్తడు
రేషన్ రేట్లు పెంచి పెంచి – కుక్క బతుకు చేస్తుంటడు – హోషియార్

*అంకితం ధైర్యంగా ఓటు వేసువారికి విశ్వాసంతో నీతి నిజాయితీలతో పాలించే నాయకులకు మరియు ప్రజా ప్రతినిధులకు తమ ఓటు హక్కును సద్వినియోగం చేసుకొని దేశాన్ని రక్షించే ప్రజలకు*

*ఓటు ప్రాథమిక హక్కు, దేశ ప్రజల పరమ కర్తవ్యం దేశంలో ఏబది శాతం ప్రజలు ఓటు వేయడం లేదు కారణాలు ఎన్నో అందరూ ధైర్యంగా ఓట్లు వేసినాడే నిజమైన ప్రజాస్వామ్యం అంత వరకు అప్రజాస్వామ్యం*

# 1 తల్లి

సర్జికల్ వార్డు వరండాలో ఓ మంచంలో ఒక ఇరవై ఏండ్ల వయస్సున్న పేషంట్ ఎమర్జెన్సీ ఆపరేషన్ పైనా కాంప్లికేషన్‌తో రోజు రోజుకు క్షీణిస్తూ పడి ఉన్నాడు డాక్టర్లు చూస్తున్నారు రౌండ్స్‌లో పెద్ద డాక్టర్ గారితో పాటు చిన్న డాక్టర్లు నర్సులు అందరు బయలు దేరుతారు ఒక్కొక్క బెడ్‌ను వారికి కావలసిన మందులు తిండి తిప్పలు అన్ని చూడాలి సాప్ పెద్ద డాక్టరు డబ్బిచ్చిన వారిని వి ఐ ఎ లను రికమండేషన్ ఉన్న పేషంట్లను మాత్రమే చూసేవాడు మిగితా డాక్టర్లు తమకు అంతో ఇంతో ఇచ్చుకున్న వారిపట్ల శ్రద్ధ చూపుతూ వైద్యం అందిస్తు ఉండేవారు నర్సుల్లు కూడా ఎంతో కొంత ఇచ్చుకునే వారికి బ్రెడ్డు గ్రుడ్డు పాలు-పండ్లు పంచేవారు ఏ దిక్కులేని ఈ పల్లెటూరి పేషంట్‌ను మాత్రం చిన్న డాక్టర్లు హౌస్ సర్జన్లు స్టూడెంట్ నర్సులు తమకు తోచిన విదంగా సేవ లందించే వారు ఎలాగూ ఈ పేషెంటు బ్రతుకడు కాబట్టి రౌండ్స్‌లో అందరి అంటెండెట్స్‌ని బయటికి వెళ్లగొట్టే వారు 12 గంటల తర్వాత లోనికి వదిలేవారు ఓ పండు ముసలమ్మ వంగిపోయిన నడుము చేతి కర్రతో తన కొడుకు అయిన ఆ పేషెంట్ దగ్గరకు వచ్చేది తను కొనుక్కొచ్చిన పదార్థాలను వానికి తినిపించి స్టూడెంట్ నర్సులు రహస్యంగా తెచ్చి ఇచ్చిన బ్రెడ్డు గ్రుడ్డు తినిపించేది వాచ్‌మెన్ వచ్చినప్పుడు మంచం క్రిందనో తలుపు చాటునో బాత్రూంలోనో నక్కిదాక్కునేది. లేదా ఓ ఆరాణా ఇచ్చుకోవలసిందే ఆసుపత్రిలోకి రావాలంటే అరాణా లేక ఒక రూపాయి సమర్పించుకోవలసిందే వార్డుబాయ్ బెడ్‌పాన్ తెస్తే అయిదు రూపాయలు మూత్రం డబ్బా తెస్తే రెండు రూపాయలు డ్రెసింగ్ చేస్తే డ్రెస్సర్‌కు పది రూపాయలు మామూళ్ళు ముట్టచెప్పవలసిందే తల్లి పండు ముసలమ్మకు తిండే లేదు బయట బిచ్చమెత్తుకొని వీళ్లందరికి పంచుతూ తన కొడుకు బ్రతుకుతాడని ఆశతో పొద్దంతా బిచ్చమెత్తుకొని రాత్రంతా కళ్ళలో వత్తులు వేసుకొని చూస్తుంది కొడుకు రోజు రోజుకు క్షీణిస్తూ ఎముకలు తోలు మిగిలిపోయాయి కళ్ళు అగాదంలోకి వెళ్ళిపోయాయి మల మూత్రాలు మంచంలోనే ఇప్పుడో-రేపో అంటూ రెండు నెలలు దాట వస్తుంది వృద్ధురాలు రోజు ఆసుపత్రి లోనికి బయటకు వస్తు బిక్షమెత్తి సంపాదించిన డబ్బుతో రోజులు దొర్లిస్తుంది కొడుకు తప్పక బ్రతుకుతాడని ఆశతో మామూలుగా రోజూ వచ్చినట్లే తన కొడుక మంచం దగ్గరికి వచ్చి చూసింది. కొడుకు మంచంలో లేడు అమ్మా నా కొడుకు ఏమైండు? చెప్పండమ్మా అని సిస్టర్‌ను అడిగింది వాడా? ఉదయమే సచ్చిపోయిండు శవాల గదికి పంపించామని పెద్ద సిస్టరు చెప్పింది వృద్ధురాలు గొల్లున ఏడుస్తూ శవాల గది దగ్గరకు వెళ్ళింది కుమారుని శవంగాని ఆచూకి గాని తెలియలేదు శవం శవాల గదిలోలేదు తల్లికి గుండె గుబేలుమంది ఒక్కడే కొడుకు భర్త లేడు ఊరిలో తన వారు ఎవ్వరు లేరు ఊరి బయట ఒక గుడిసె తప్ప సర్వం ఆస్తి ఆ కుమారుడే వాడు పోతే ఏ ఆదారమూ లేదు తను

ఒంటరిగానే జీవించాలి ఏమైతేనేమి కుమారుని శవం కనిపించలేదు వెతుకుతూ మళ్ళీ వార్డుకు వచ్చింది నర్సులను డాక్టర్లను వార్డుబాయ్‌లను మళ్లీ మళ్లీ అడిగింది అయినా ఎవ్వరూ పట్టించుకోలేదు కొడుకా కొడుకా అంటూ వార్డు వార్డు మూల మూల అన్ని అంతస్తులు వెతికింది రోజంతా వెతికంది రాత్రైంది కనిపించలేదు తన కొడుకు కొడుకా అంటూ తిండి నీళ్ళు లేకుండా ఎడుస్తునే పరిగెత్త సాగింది వార్డు వార్డు రాత్రంతా వెతుకుతూ

అదే వార్డులో అర్ధరాత్రి రెండు నుండి నాలుగు గంటల ప్రాంతంలో వార్డు మరుగుదొడ్డిలో డాం డాం అంటూ పెద్దగా నాలుగు తుపాకి దెబ్బలు వినిపించాయి నిద్రావస్థలో ఉన్న పేషంట్లు లేచారు అంతా అలజడి పరుగులు ఉరకలు వార్డులో నుండి అంటెండర్లు డ్యూటి నర్సులు చూస్తుండగానే అదే వార్డు నుండ ఓ యాబది సంవత్సరాల వృద్ధుడు పది మంది సహాయంతో చేతులకు బేడీలు గొలుసులు ఉండగానే నెంపాదిగా దీమాతో ఎ అడ్డంకులు లేకుండా ఆసుపత్రి నుండి అర్ధరాత్రి తప్పించుకొని వెళ్ళిపోయాడు అందరు తెల్ల ముఖం వేసి చూస్తూ ఉండిపోయారు అతనితో ఉన్న పోలీసు మాత్రం కనిపించలేదు తుపాకి చప్పుడు వచ్చిన మరుగుదొడ్డి దగ్గరికి అందరు వెళ్ళి చూసినారు ఆ వృద్ధునికి కాపలా పెట్టిన పోలీసు చనిపోయి రక్తం మడుగులో పడి ఉన్నాడు పోలీసును చంపి వృద్ధుణ్ణి తీసుకొని వెళ్ళిపోయారు తీవ్రవాదులు అంతా ఒక క్షణంలో జరిగిపోయింది

కొద్ది నిమిషాల్లో పోలీసులు పోలీసు కుక్కలు ఆసుపత్రి అధికారులు వార్తాపత్రికల వాళ్ళు ఫోటోగ్రాఫర్లతో క్రిక్కిరిసిపోయింది ఆసుపత్రి స ఐ డి.లు మఫ్టీ పోలీసులు ఆచూకి క్లూలు వెదకటం మొదలు ఎట్టారు తెల్లవారుతూ వచ్చింది వార్డు బాయ్‌లు ఆర్ యం ఓ లు హెల్త్ ఇన్స్పెక్టర్లు హడావిడిగా అడ్డదిడ్డంగా పడివున్న ఆసుపత్రి ట్రాలీలను సదరడం మొదలు పెట్టారు గేటు దగ్గర ఒ మూల ఒక ట్రాలీ ఉంది ట్రాలీ బాయ్‌ను ఎలిచి ఎదో ఉంది చూడు జాగ్రత్తగా అన్నాడు అదికారి సార్ ఇక్కడ ఒ డెడ్ బాడీ ఉంది వార్డు నెంబర్ పేరు వ్రాసి ఉంది నిన్నటి ప్రొద్దటి ట్రాలీవాళ్ళు వదలేసి వెళ్ళిపోయింద్రు మద్యాహ్నం డ్యూటి వాండ్లు పట్టలేదు బాడకావుగాండ్లు పైసలు ఇవ్వలేదని ఈన్ని వదిలేసింద్రు సార్ అన్నాడు ట్రాలీబాయ్ వీడెందో నీతుమంతుడిలాగ ఆ సర్లే ఇప్పుడైనా ఆ డెడ్ బాడీని శవాల గదిలో పేరాపో అన్నాడు ఆర్ యం ఓ హెల్త్ ఇన్స్పెక్టర్‌ను తిడుతూ ట్రాలీని తీయబోయాడు దీని క్రింద ఎదో మూట ఉంది అన్నాడు వార్డుబాయ్ అది వాడి తాలుకుదై ఉంటుంది దాన్ని కూడ శవాల గది దగ్గర ఎట్టు వాని తల్లి నిన్నంత వెతికి వెతికి తన కొడుకు గురించి అడిగి అడిగి పోయింది దాన్ని ఆ ముసలిదానికి ఇచ్చేయి అంటూ చెప్పి ఆ హెల్త్ ఇన్స్పెక్టర్ వెళ్ళిపోయాడు మూటలో ఎదైన ఉంటే దొబ్బెయిరా అన్నాడు ఇంకో వార్డుబాయ్ ఆర్ యం ఓ మరి ఇన్స్పెక్టర్ అటూ వెళ్ళగానే మూటలాగా

ముడుచుకున్న మాటను విప్పాడు ట్రాలీబాయ్  సార్ సార్ ఇది మూట కాదు ఇందులో ముడుచుకొని చనిపోయి ఉంది ముసలిది కటె సరుచుకుపోయింది సార్ దీన్ని కూడ నిన్నటోళ్లు ఇక్కడే వదిలేసేంద్రు దీనితాన డెత్ షీటు లేదు ఎ వార్తో ఎమో అన్నాడు వార్డుబాయ్ అప్పుడే డ్యూటికి వస్తున్న పెద్ద నర్సు ఆ ముసలిదే వాని తల్లి అది కూడ చచ్చిందా ' అంటూ వెళ్ళిపోయింది నర్సు దాన్ని కూడ శవాల గదిలో వేసెయ్ దిక్కులేని శవాల రిజిస్టర్‌లో వ్రాసేయి ఉన్నాడు అధికారి వెతికి వెతికి కొడుకు శవాన్ని కనుగొన్నది ఆ ముసలి తల్లి రాత్రంతా ఎడ్చి ఎడ్చి ఎక్కడికి వెళ్లాలో ఎమి చేయాలో తెలియక కుమిలి కుమిలి రోజంతా తిండి లేక నీరు లేక శవాన్ని వదలలేక చలికి తట్టుకోలేక అదే ట్రాలీ క్రింద ముడుచుకొని పడుకొని కొడుకుతో పాటు విశాల విశ్వంలోకి వెళ్ళిపోయింది బ్రతికి బాగు పడాలని తను తన కొడుకుతో మళ్ళీ తన ఊరు తిరిగి వెళ్ళాలని ఎంతో ఆశతో ఓ పెద్ద ఆసుపత్రిలో చేరి క్రూర మృగాలు రాబందులు ఇక్కడా ఉంటాయని పీక్కుతింటాయని ఊహించలేక పోయింది ఆ తల్లి ఊహకందని లోకాలకెళ్ళి పోతామని ఊహించలేకపోయారు తల్లీ కొడుకులు

ఓ వారం రోజుల తర్వాత ఆ గ్రామ సర్పంచ్ ముసలమ్మను వెత్కుంటు వచ్చాడు బుర్ర మీసాలు మీసాలకు రంగు కొద్దిగా అక్కడక్కడ మిగిలిన తల వెంట్రుకలకు నల్లరంగు నీలి రంగు అంచు దోతి వింతగా ఉన్న లాల్చి బుజం మీద ఉన్న ఓ పంచా కుడి వైపుకు చెక్కిన దోతి చింగులు చేతిలో సిగరెట్టు ప్యాకెట్టు తాగుబోతు సెలు సర్పంచ్ డాక్టర్ మా ఊరి నుండి ఒక ముసలిది వచ్చింది ఇక్కడికి దాని కొడుకును నేనే పట్నం పంపించినా నెలకు పైన అయ్యింది దాని సంగతి ఎందో తెలుస్తలేదు ఈ దవాఖాన అంతేదో తెలుస్తలేదు ఎటునుంచి పోవాలో ఎటునుండి రావాలో బయటికి దారేదో తెలుస్తలేదు ఆ ముసలిది ఏమైందో కూడ తెలుస్తలేదు దాని కొడుకు బాగుండాడా? ఎమైయిండు? ఆ ముసలి దాని ఆస్తి అంతా ఓ తల్లి పంది పిల్ల పంది అన్ని ఎల్లలుపోగా ఆ రెండే మిగిలాయి ముసలిది పట్నం వచ్చేటప్పుడు ఆ రెండింటని నాకు అప్పచెప్పి ఇక్కడకు వచ్చింది తల్లి పందిని దొరగాని జీతగాళ్ళు చంపిండ్రు వాళ్ళ పొలంలోకి పోతే ఎల్ల పందిని కుక్కలు చింపి సంపాయి ఆ విషయం చెప్పుదామని వచ్చిన అని అన్నాడు సర్పంచ్ ఇక్కడ కూడా అదే జరిగింది అన్నాను ఉది ఏంటో అర్థం కాలేదు సర్పంచ్ గారికి సరే మంత్రిగారితో పని ఉందంటు వెళ్ళిపోయాడు ఏదో తీరిక లేనట్లు ఎదో మునిగిపోతున్నట్లు తను లేకపోతే దేశం నాశనమైతున్నట్లు మరీ పోజు కొట్టి వెళ్ళిపోయాడు మా వాళ్ళు పోటీ పడి పోజు కొట్టారు మాకిది మామూలే అన్నట్లు

అంకితం దిక్కులేని వారిని తల్లిలా ఆదుకునే వారికీ తల్లి ప్రేమకు

# ౨ తండ్రి

సర్జికల్ వరండాలో ఒక వృద్ధ ముస్లిం పేషంట్ అడ్మిట్ చేయబడి ఇరవై రోజుల నుండి వైద్యం చేయించుకుంటున్నాడు ఎనభై ఎండ్లకు పైనే ఉంటాడు తన వెంట వృద్ధురాలైన తన భార్య డెబ్బయి ఐదు సంవత్సరాలుంటుంది ఇద్దరూ బీద పరిస్థితిలో ఉన్నట్లున్నారు వృద్ధుని జీర్ణకోశానికి క్యాన్సర్‌గా నిర్ధారణ ఆపరేషన్ చేసే పర్స్థితి లేదు ఇంకా టెస్టులు జరుగుతున్నాయి తిండికే లేదు తన ఎల్లలు మెకానిక్‌లుగా పని చేస్తున్నారు రోజూ ఓ గిన్నెలో అన్నం తీసుకొని ఇచ్చి పోయేవారు ఆసుపత్రి నుండి గ్రుడ్డు బ్రెడ్డు పండ్లు అన్నం వారికి దొరికేవి నిరాశ నిస్పృహతో అంతిమ దశలో జబ్బు క్యాన్సర్ అని తెలిసి అన్ని ఆశలు వదులుకొని ఇంటికి పోలేక వృద్ధురాలైన భార్యచేత సేవలు అందించుకుంటు వార్డులో పడివున్నాడు మృత్యువు కొరకు ఎదురుచూస్తు అప్పుడప్పుడు వార్డుబాయ్‌లు వాచ్‌మెన్‌లు ఇతరులు ఐదు పది లంచాలు అడుగుతూనే ఉన్నారు డాక్టర్లకు మాత్రం నిరాశే ఎదురైయింది తమ దగ్గర ఉన్న శాంపుల్స్ మెడిసిన్ ఇచ్చేవారు ఒకటి రెండు నెలలలో ఆ వృద్ధ రోగి మరణిస్తాడు అది ఖాయం అది వారికి వారి కుటుంబీకులకు ఆసుపత్రి సిబ్బందికి తెలుసు డిచ్చార్జి చేసి పంపించే పర్స్థితిలో లేడు ఇంటికి వెళ్ళితే మాత్రం తిండే లేదు వైద్య సహాయం కూడా ఉండదు అంటూ వృద్ధుడైన పెద్ద డాక్టరు వృద్ధునిపై అబిమానంతో వార్డులోనే ఉంచాడు ఆఖరు నిమిషం వరకు ఉండుమన్నాడు ఇలా రోజులు గడుస్తున్నాయి రోగి క్షీణిస్తున్నాడు అన్ని మరిచి పోతున్నాడు ఏవో జ్ఞాపకాలు ఉన్నట్లుగా ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు అస్పష్టంగా ఉండేది అర్థమయ్యేది కాదు భార్యకు కూడా కుచ్ బి బోల్తే మగర్ సమజ్ మే నహీ అతా అనేది భార్య అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుండే వారు డాక్టర్లు పెద్ద డాక్టర్ ముందు ఈ వృద్ధపేషెంట్‌ను చూసి తర్వాత అందరిని చూసేవారు ఆ వృద్ధునిపై అబిమానంతో

ఓ రోజు ఆసుపత్రి మెయిన్ గేటులో నుండి ప్రభుత్వ వాహనం ఒకటి కేకవేసుకుంటు దూసుకు రాసాగింది వెనుక ముందు రెండు పోలీసు ఎస్‌కార్ట్ వాహనాలు ఓ గవర్నమెంటు వాహనం ఎద్ద అట్టహాసం ఎక్యూరిటీతో వచ్చి ఆగింది ఆసుపత్రి ఆవరణలో ఎవరో మంత్రి గారు వచ్చారనుకొన్నాం

ఫుల్ సూట్‌లో ఉన్న ఆజానుబాహుడు వార్డు వైపు రాసాగాడు వెంట ఇద్దరు ట్రాన్స్‌లేటర్లు వాడి బాషను అనువాదం చేయడానికి ముందు ఎక్యూరిటి గార్డ్స్ వారందరి ముందు ఆసుపత్రి అదికారులు చకా చకా వార్డుకొచ్చారు ఏదో అడిగారు ప్రొఫేసర్ అవును

అన్నాడు ఆ పేషంటుని చూపించమన్నాడు వెళ్ళి అంతా ఎక్స్ప్లెయిన్ చేశారు డాక్టర్లు ఆ వచ్చిన వ్యక్తి దుబాయి అబ్బాస్ వృద్ధుణ్ణి చూసి అబ్బు అన్నాడు అంతే ' ఆ వృద్ధుడు అబ్బాస్ బేటా కబ్ ఆయా అని అన్నాడు వృద్ధుడికి కళ్లు కనిపించటం లేదు మాటతోనే గుర్తించాడు అబ్బాస్ అరబ్బీలో ఏదో చెప్పాడు ప్రక్కన ఉన్న వృద్ధురాలు ఏదో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది డాక్టర్లు కూడా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు అబ్బాస్ మాత్రం వెంటనే టై కోటు తీసివేసి వృద్ధుని పాదాలు పట్టుకొన్నాడు వృద్ధుని చేతులు పట్టుకొని అబ్బు అబ్బు అంటూ ముద్దు పెట్టుకున్నాడు వృద్ధురాల్ని అక్కున చేర్చుకున్నాడు బేటా అంటూ ఏడ్చింది వృద్ధురాలు అక్కడ ఉన్న వారికి అర్థం కావేదు కాని ఏదో రక్త సంబధమై ఉంటుంది అనుకొన్నారు అతను వృద్ధుని ప్రక్కనే ఉంటు సేవలు చేస్తున్నాడు అక్కడే ప్రక్కనే పడుకుంటున్నాడు మల మూత్రాలు ఎత్తి పోస్తున్నాడు తిండి తినిపిస్తున్నాడు ఏదో అడుగుతున్నాడు వృద్ధుడు ఒప్పుకోవడం లేదు ట్రాన్స్లేటర్స్ విసిగెత్తిపోయారు వృద్ధుడు మాత్రం ఆసుపత్రి తప్ప ఇంక ఎక్కడికి రానన్నాడు ట్రాన్స్లేటర్స్ ద్వారా ఓ రెండు గంటల సేపు ఏడుస్తూ చెప్పిన నిజం

వృద్ధుడు పాతపట్టణంలో యువకుడిగా ఉన్నప్పుడు రిక్షా త్రొక్కేవాడు ఒక బార్య ఏడుగురు ఎల్లలు ఉండేవారు ఉర్దు మీడియం చదువుకున్నాడు కొంత వరకు మాత్రమే కుటుంబాన్ని సాకడం కష్టంగా ఉండేది బ్రతకడానికి దుబాయ్కి కొందరు వెళ్ళుతుంటే తన కుటుంబాన్ని రక్షించుకోవడానికి వారితో కలిసి ఒక లేబర్గా దుబాయికి వెళ్ళాడు. అక్కడి నుండి డబ్బు ఇంటికి పంపించేవాడు పెద్ద కుటుంబం కాబట్టి తిండికి మాత్రమే సరిపోయేది. వృద్ధుడు దుబాయిలో వయస్సులో ఉన్నవాడు కాబట్టి అక్కడే ఓ స్త్రీతో నిఖా చేసుకున్నాడు వారికి నల్గురు సంతానం కలిగారు అయినా డబ్బు పంపిస్తున్నాడు దుబాయ్లో ఆర్థికంగా పుంజుకొని దనవంతుడైనాడు పిల్లలు చిన్న వయస్సులో ఉండగానే తనకు బార్యకు తరుచు ఘర్షణలు వచ్చేవట అది హైదరాబాదుకు డబ్బు పంపచటం వల్లే తన కృషి వల్లె ఆర్థిక స్థోమత పెరిగిందట దుబాయి బార్య దుర్భాషలాడేదట వారిద్దరి మధ్య దూరం ఎరగసాగింది తనను హీనంగా చూసేదట ఆఖరుగా ఇంటి నుండి గెంటివేసే విధంగా చులకన చేసిన రోజు బరించలేక బారత దేశం తిరిగి వచ్చినాడట వచ్చి కూడా ముప్పై సంవత్సరాల పైన దాటిందని చెప్పాడు హైదరాబాదుకు వచ్చిన తర్వాత ఒక రోజు కూడ ఒక ఉత్తరం కాని ఒక వార్త కాని ఒక విషయం కాని ఇక్కడివి అక్కడ అక్కడివి ఇక్కడ తెలుపలేదట తెలుసుకోలేదట అక్కడ నుండి కూడా ఎ వార్తలు వచ్చేవి కావట అంతే ముప్పది సంవత్సరాలు జరిగిపోయినావి

కాని అబ్బాసు మాత్రం తన తండ్రి వ్యక్తిత్వానికి ఉన్న విలువను తెలుసుకొని తండ్రిని పదే పదే అడిగేవాడట తల్లి చెప్పేది కాదట పూర్తిగా వృద్ధురాలైన తన తల్లిని నలుగురు ఎల్లలు కలిసి తమ తండ్రి గురించి పదే పదే అడిగేవారట అయినా చెప్పేది కాదట ఒక రోజు తన తల్లి బద్రంగా దాచుకున్న తన తండ్రి పోటోను తల్లి తల దిండు క్రింద చూసాడట అబ్బాస్ పోటో వెనకాల తండ్రి అడ్రస్‌లో హైదరాబాద్ అని వ్రాసి ఉందట అంతే తన తండ్రి ఎవ్వరో ఎక్కడుంటాడో వెదకడం మొదలు పెట్టారు పిల్లలు పాకిస్తాన్‌లో ఉన్న హైదరాబాద్ అంతా వెతికారు కాని దొరకలేదు తమ తండ్రి

మరో హైదరాబాద్ ఆంద్రాలో ఉన్నట్టు తెలుసుకొని పాత నగరంలో అంతా వెతికాడు ఆఖరుగా ఆసుపత్రిలో ఉన్నట్టుగా తెలుసుకొని వచ్చానని చెప్పాడు అబ్బాస్ తను తనతోటి సోదరులకు తన తండ్రిని చూడాలని తపన మొదలైంది ఎ విదంగానైనా తమ వాలిద్‌ను చూడాలని నిర్ణయించుకొన్నారు తమ తల్లికి కూడా ఎమాత్రం తన బర్త గురించి తెలిసి ఉన్నట్లు అనిపించలేదు చాలా వృద్ధురాలైంది పండిపోయింది జ్ఞాపకాలు కూడా అంతంత మాత్రమే పోటో మాత్రం అతి జాగ్రత్తగా దాచుకుంది ఉన్నత స్థాయికి పెరిగిన పెద్ద కుమారుడు అబ్బాస్ పోటో ద్వారా అన్వేషణ మొదలుపెట్టాడు ఆఖరుగా తండ్రిని ఆసుపత్రిలో ఉన్నట్టు కనుగొన్నాడు

హమారే వాలిద్‌కో జిందా రఖే ఆప్ లోగ్ ఆప్‌లోగోంకో బహుత్ శుక్రియా అన్నాడు అబ్బాస్ ట్రాన్స్‌లేటర్స్ తెలుగులో ఇంగ్లీష్‌లోకి తర్జుమా చేసి చెప్పారు మీ అందరికి కృతజ్ఞతలు ఎలా తెలుపుకోవాలో నాకు తెలియడం లేదు నేను మళ్లీ నా తండ్రిని చూస్తానని అనుకోలేదు ఆయనకు సేవ చేస్తానని నా జన్మకు పుణ్యం లబిస్తుందని నేనుగాని నా తమ్ముళ్ళు గాని అనుకోలేదు హమ్ బేటే-బేటియా హమారే వాలిద్‌కో నహి దేఖా ఉన్‌కా జిందగీ క్యా జిందగీ హై మాలుమ్ నహీ హమ్‌నే హమారే వాలిద్‌కో దేఖా బస్ ఔర్ క్యా – హమ్ ఖుష్ హై – బస్ హై హమారే లియో ఔర్ కుచ్‌బి నహీ చాహిఎ ఆప్ సబ్ డాక్టర్ లోంగోకా మెహర్బనీ ఆప్‌కో శుక్రయా అన్నాడు అబ్బాస్ ఆ తర్వాత తన తండ్రిని వేరే పెద్ద ఆసుపత్రికి తీసుకు వెళ్తానన్నాడు తండ్రి ససేమిరా ఒప్పుకోలేదు ఇజ్జత్ సే జీనా హై బేటా హమారా హిందూస్తాన్ మే హమారే లోగ్ సహార కరేగా బేటా అని అన్నాడు తండ్రి అబ్బాస్ బేటా చాలా బాద పడ్డాడు వార్డులో ఉంటూ తన తండ్రికి అన్ని రకాల సేవలందిచాడు తల్లిగా తండ్రిగా కొడుకుగా సర్వం తనే మలమూత్రాలు ఎత్తిపోస్తూ తిండి తినిపిస్తూ మంచం ప్రక్కనే పడుకుంటూ బెడ్ పాన్ మూత్రం డబ్బా మోస్తూ బట్టలు ఉతికి బట్టలు మారుస్తూ నిద్రావస్థలు మాని మందులు తెస్తూ తిండి మందులు తినిపిస్తూ

ఆక్సిజన్ వాంటివి తనే ప్రక్కన కూర్చోని అందిస్తు తన సేవతో ఆసుపత్రి సిబ్బందిని ఇతర పేషంట్లను ఆకర్షించాడు సేవ చేస్తే అలా చేయాలి కన్న ఋణం తీరుతుంది అని అందరు అనేవారు తండ్రిపైన ప్రేమ గౌరవం సేవా బావం ఎలా ఉండాలో వార్డు సిబ్బందికే కాదు డాకర్స్ సిబ్బందికి హాస్పిటల్ ఆదిష్టాన వర్గానికి కూడా తెలిసింది కావాలంటే అన్ని సదుపాయాలు చేకూర్చగలడు ఆర్థిక సహాయం అందించగలడు అతను తన దేశం దుబాయిలో తను ఒక మినిష్టర్ కాని తన తండ్రి మాటపైన తండ్రి ఇష్టంపైన తమ తండ్రి ప్రక్కనే ఉండ సేవలు అందించాడు

తండ్రి అంతిమ దశకు చేరుకున్నాడు అబ్బాస్ ఏడ్వసాగాడు చిన్న పిల్లాడిలా తండ్రిని తన ఒడిలోనే పెట్టుకున్నాడు ఆ వృద్ధుడు తన వృద్దురాలైన హిందుస్తాన్ బార్య చేయి పట్టుకున్నాడు దుబాయిలో ఉన్న బార్య పేరుతో పిలిచాడు అబ్బాస్ తుమ్హార వర్డాకోబి పాస్ దేఖ్‌నా అల్లా మేరెకో బులారహా హై అబ్ మేరెకో జానే కా వక్త్ ఆయా హై అంటూ కన్ను మూశాడు తండ్రి ప్రక్కన కుమారులు వృద్దురాలు నిస్సహాయంగా చూడసాగారు ఎడ్వసాగారు డాక్టర్లు తమ ప్రయత్నాలు ఎమర్జెన్సి మందులు ఇచ్చారు లాబం లేకపోయింది వృద్ధుని ప్రాణాలు అనంతంలోకి అల్లాలోకి వెళ్ళిపోయాయి అబ్బాస్ చిన్న పిల్లవానిలా ఎడ్వసాగాడు అరబ్బిలో ఎదో అంటూ వాలిద్ అబీ అబీ మాలుమ్ హువా అబి అల్లా కే పాస్ చలేగయా యా అల్లా అన్నాడు అబ్బాస్ ఆతి కష్టం మీద అబ్బాస్‌ను ఓదార్చాం అబ్బాస్ వృద్ధురాలు తదితర కుమారులు కలిసి వృద్దుని శవాన్ని తీసుకెళ్ళారు అందరు కలిసి అంత్యక్రియలు చేశారు తండ్రి ఆర్థిక బాద్యతలు కుటుంబ సమస్యలు పరిష్కరించాడు అబ్బాస్ దుబాయి వెళ్ళేముందు ఆసుపత్రికి వచ్చాడు కొన్ని పూల దండలు గిఫ్టులు సెంట్‌సీసాలు తీసుకొని మరీ వచ్చాడు అందర్ని పరామర్శించాడు హమారే వాలిద్‌కో జిందా రఖా ఆప్ లోగ్ హమ్ ఆయేతక్ ఆప్ లోగోంకో అల్లాకో ఫిర్ ఏక్‌బార్ శుక్రియా ఆదా కరతా హుం. నహితో హమ్ హమారే జిందాగీమే హమారే వాలిద్‌కో దేఖ్ నహీ సక్తాతా అంటూ పూలు అత్తరు సీసాలు గిఫ్టులు ఉందించాడు అందరికి అబ్బాస్ మాత్రం మా అందరి హృదయాలలో బాద్యత ఎరిగిన కుమారునిగా తల్లి తండ్రి సేవకు ఉదాహరణగా తండ్రి అంటే ప్రాముఖ్యం ఎమిటో తెలిపే ప్రేమ మూర్తిగా తండ్రి లేని ఎల్లల జీవితం ఎలా ఉంటుందో మా అందరికి చెప్పక చెప్పిన పాఠమే అబ్బాస్ దుబాయి అబ్బాస్

బాద్యతను మరవకుండా మరచిపోతాననే బయంతో అబ్బాస్ గిఫ్ట్ సెంట్‌సీసాను ఆనాట నుండి ఈనాటి వరకు దాచిపెట్టుకున్నాను హృదయంలో ఆయన ఇచ్చిన అత్తరు

సీసాలో ఎనాడో అత్తరు ఆరిపోయింది ఉయినా ఈనాటికి దామకున్న ఆ సీసాకోసుండ ఉబ్బాస ఆదర్శం సీసా మూత విప్పగానే తండ్రిపై ప్రేమ గుప్పుమంటుంది - డాక్టర్ సాబ్ ఉప్కా వాల్దా-వాలిద్ కైసా హై ఉంటూ వినిపిస్తూ ఉంటుంది తండ్రి ప్రేమను జ్ఞాపకం చేస్తూ ఉంటుంది

*అంకితం తల్లి తండ్రులను గౌరవించి ఆఖరు నిమిషం వరకు బాధ్యత వహించి వారికి సేవలు ఉందించే వారికి మరియు మా కుమారులకు*

# 3 గురువు

స్కూల్ ఫైనల్ పరీక్షలు పూర్తి అయినాయి రిజల్ట్ కొరకు విద్యార్థులు ఎదురు చూస్తున్నారు వార్త రానే వచ్చింది క్లాసులో అందరు ఉత్తీర్ణులైనారు ఒక్కరు కూడ పెయిల్ కాలేదు సెంట్ పర్సెంట్ రిజల్ట్ ఆ జిల్లాలో ఆ స్కూల్ ప్రదమ స్థానంలో పేరు సంపాదించింది ఉపాధ్యాయులందరికి గొప్ప పేరు వచ్చింది కొందరు ఫస్ట్ క్లాసు వాలా మంది సెకండ్ క్లాసు తక్కువ మంది దర్డ్ క్లాసులో పాసైయ్యారు

ఎవరి సర్టిఫికేట్లు వారు తీసుకొని స్కూలును విడచి వెళ్ళిపోతున్నారు మళ్ళీ రాలేం అంటూ ఇతర విద్యార్థులకు ఉపాధ్యాయులకు నమస్కరించి వీడ్కోలు తీసుకొని వెళ్ళిపోసాగారు

ఒక విద్యార్థి ఆ స్కూల్లో పనిచేసే ఒక ఉపాధ్యాయుని ఇంట్లోనే ఉండి వారి దగ్గరే తిని చదువు పూర్తి చేసుకొని సెకండ్ క్లాసులో పాసై సర్టిఫికేటు తీసుకొని వెళ్ళిపోతు గురువు గారి పాదాలకు నమస్కరించి ఆశీర్వాదము పొందాలని గురువుగారిని వారి సతీమణిని అర్థించాడు ఎ విదముగానైన వారి పాదాలకు నమస్కరించి వీడ్కోలు పొందాలని కోరుకున్నాడు గురువు గారు వద్దన్నాడు ససేమిరా పాదాలకు నమస్కారం వలదన్నాడు పంతులమ్మ గారు కూడా అలాగే అన్నారు ఎందుకు మీ పాదాలకు నమస్కారించకూడదని మరీ మరీ ప్రశ్నించాడు ఆ విద్యార్థి వెంటనే గురువు గారు లేచి ఓరేయి ఇలా రా అంటూ ఆ విద్యార్థిని బయటకు తీసుకెళ్ళి నాలుగు దిక్కులు చూపించాడు వాటి మద్య మరో నాలుగు దిక్కులు చూపించాడు ఎదురుగా సూర్యుడు పైన ఆకాశం క్రింద భూమి కనిపించే చెట్టు పుట్ట చెత్తా అన్ని చూపించాడు ఈ కనిపించే ఈ విశాల విశ్వమే నీకు అసలైన గురువు కనిపించే ప్రతి ఒక్కటి నీకు పాఠాలు చెప్పుతాయి ప్రతి మనిషి ఒక పుస్తకం జాగ్రత్తగా నేర్చుకో

నేనే నీకు అసలైన గురువు అయినట్లైతే నాకో పూర్తి జ్ఞానం ఉన్నట్లైతే నీకు నూటికి నూరు పాళ్ళు మార్కులు అన్ని సబ్జెక్టులలో వచ్చి ఉండేవి నీకు అలా రాకపోవడానికి నీవు సెకండ్ క్లాసులో పాసు కావడానికి కారణం నాలో ఉన్న లోపమే పూర్తిపరిజ్ఞానం లేకపోవడం నేను నిజమైన పూర్తి జ్ఞానం ఉన్న గురువును కాను పాద నమస్కారానికి నేను గాని నా సతీమణి గాని అనర్హులం మాకు నమస్కరించు కాని మా పాదాలకు కాదు ఇక నుండి నీవు నేర్చుకోవలసింది చాలా ఉంది అని నచ్చజెప్పి ఆ విద్యార్థిని పంపించి వేస్తూ ఆ గురువు గారు ఇంకా ఇలా అన్నారు

ఎన్నటికైనా ఒకవేళ నీకు **పూర్తి పరిజ్ఞానము** లబించిందని నీవు తలచినట్లైయితే అప్పుడు నా దగ్గరకు రా **అన్నాడు, అప్పటి వర**కు నా పాదాలు తాకకు నీ చేతులు మలినం చేసుకోకు అన్నాడు **ఆ గురువు గారు** అప్పటి నుండి ఇప్పటి దాకా ముప్పై ఎళ్ళు గడిచి పై అంతస్తులు చేరుకున్నా **ఆ** విద్యార్థి పూర్తి పరిజ్ఞానాన్ని పొందలేక ఏదో ఒక తప్పు ఏదో ఒక లోపం ఏదో ఒక అర్థం కాని సమస్య అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్నట్టు తలుస్తు ఆ విద్యార్థి జీవితం గడిచింది వృద్ధాప్యంలో ఉన్న గురువు గారు ఓ రోజు ఆ విద్యార్థిని కలిశాడు పరామర్శించాడు నీవు పూర్తి జ్ఞానాన్ని సంపాదించావా ? అని ప్రశ్నించాడు గురువు గారు ఆ విద్యార్థి చప్పుడు చేయలేదు ఇంకెప్పుడు పూర్తి జ్ఞానాన్ని సంపాదిస్తావు? వయస్సు దగ్గర పడుతుంది కదా' అన్నాడు గురువు గారు మళ్ళీ విద్యార్థి ఏ సమాదానం చెప్పలేదు మరెప్పుడు ఎవ్వరి పాదాలకు నమస్కరించకు ఒక్క బగవంతుడే పాద నమస్కారానికి అర్హుడు ఇంకెవ్వరు కాదు నీ చేతులు మలినం చేసుకోకు లేదా నీ తల్లిదండ్రుల పాదాలకు మాత్రమే నమస్కరించు నీ పాదాలకు ఇతరులచేత నమస్కరించుకొని వారి చేతులను మలినం చేయకు అంటూ వాచిన కాలుతో నడవలేక నడుస్తు కర్ర సహాయంతో వెళ్ళిపోయాడు తనను తాను తెలుసుకున్న గురువుగారే గొప్ప నిజమైన గురువు గారు అలాంటి గురువు లబించటమే విద్యార్థుల అదృష్టం అలాంటి గురువులను ఆశ్రయించడం విద్యార్థుల బాధ్యత

*అంకితం తనను తాను తెలుసుకొని బాధ్యతనెరిగి బావి తరం విద్యార్థులను తీర్చిదిద్దే ఉపాధ్యాయులకు, మా గురువు గారికి*

# 4. మగ వేశ్యలు

ట్రింగ్ ట్రింగ్ । ట్రింగ్ ట్రింగ్ । ట్రింగ్ ట్రింగ్

హలో ఎవరు?

Female Burns Ward నుండి Staff Nurseను మాట్లాడుతున్నాను సార్

ఏంటి?

కాలిన ఒక పేషెంట్ నుండి డయ్యింగ్ డిక్లరేషన్ స్టేట్మెంట్ తీసుకోవడానికి మెజిస్ట్రేటు వచ్చారు డ్యూటి డాక్టర్ మీరుండాలట రమ్మంటున్నారు – అంది సిస్టర్ అటువైపు నుండ

వెళ్ళాను – సర్టిఫై చేశాను కండిషన్ స్టేబుల్‌గా ఉంది స్టేట్మెంట్ రికార్డు చేసుకోవచ్చని వచ్చిన లేడి మెజిస్ట్రేటు గారికి చెప్పాను

| | |
|---|---|
| మీ పేరు | చెప్పింది |
| అడ్రస్ | చెప్పింది |
| తల్లిదండ్రిపేర్లు | చెప్పింది |
| పిల్లలు | ఇద్దరని చెప్పింది |
| ఎలా కాలింది? | స్టౌ అంటుకుంది అని అంది |

ఎన్ని గంటలకు? రాత్రి 10 గంటలకు అంది ఇంకా కొన్ని వివరాలు అడిగి స్టేట్మెంట్ రాసుకుని నన్ను సంతకం ఎట్టమంది సంతకం చేశాను

ఒక నిమిషం అలాగే నిలబడి ఏదో అడగాలని అడగలేక ఇంకేమీ మాట్లాడక కళ్ళు తుడ్చుకుంటూ వెళ్ళిపోయింది లేడీ మెజిస్ట్రేటుగారు ఈ వార్డులో ముప్పైమంది కాలిన వాళ్ళున్నారు అందరి స్టేట్మెంటు ఇదే? స్టౌ బస్టయ్యింది స్టవ్ కాలిందనే – ఇంక వేరే కారణాలేవీ లేవా ? అని గొణుక్కుంటూ వెళ్ళింది

ఎమ్మా అలా చెప్పావు? నాకేమో కాల్చుకున్నానని చెప్పావు వారికి అలా చెప్పావు అన్నాను అవును అలాగే చెప్పాలి ఏం? నిజం చెప్పాననుకోండి మా వారిని అత్తమామలను ఆడపడుచులను మరిదిని అందరిని వైండ్ అప్ చేస్తారు కాని – శిక్షలు మాత్రం పడవు అంది

వార్డు దగ్గర మా అమ్మ నాన్న అన్నదమ్ములు చెల్లెలు ఇంకా మా వైపు వారే ఉన్నారు కాని మా అత్తవారం వైపు నుండి ఏ ఒక్కరూ చేరుకదా? నిజంగా యాక్సిడెంటే అయితే వాళ్ళందరు ఉంటారు కదా? మీకు తెలియదా? అంది కాలిన పేషంటు

అది సరే - అబద్ధం చెప్పావెందుకు అన్నాను నిజం చెప్తే ఎం లాభం? ఎవ్వరికి లాభం ఈ నిజం వల్ల? అంది పోలీసులకు లాభమా? లాయర్లకు లాభమా? జడ్జిలకా? ఏ లాభమో తెలియదు కాని నిజం చెప్పి ఎం లాభం లేదు - అంది నిజం చెప్పానే అనుకోండి - నా ఇద్దరి పిల్లల గతేం కావాలి?

మా అమ్మనాన్నలు నన్ను పెంచి పెద్దచేసి హైయ్యర్ ఎడ్యుకేషన్ చదివించి ఉద్యోగంలో చేర్పించి ఎద్ద ఎత్తున కట్నాలు ఇచ్చి గ్రాండ్‌గా పెళ్ళిచేసి తరువాత కూడా పండుగలకు కాన్పులకు మా తల్లిదండ్రులే బాగా ఖర్చు పెట్టేసి వీళ్ళు చేసే Dirty Comments హరాస్‌మెంట్స్ భరిస్తూ ఉంటే నన్ను రోజు వేదిస్తుంటే చూసి చూసి విని విని విసిగెత్తి పోయాను ఇప్పటికీ మా అమ్మనాన్నలే మా పిల్లల్ని చూస్తుంటారు

అది సరే నిజం ఎందుకు చెప్పలేదు అంటే ఇవన్నీ చెప్తావెందుకు? - అన్నాను

అదే నేను చెప్పబోయేది - నిజం చెప్తే మళ్ళీ నేను బ్రతికుంటే మా అమ్మనాన్నల పైనే కదా నా బరువు. నేను ఎ విడాకులో పుచ్చుకొని మా స్త్రీ లోకం చేసే కామెంట్లతో మళ్ళీ రోజూ చావాలి ఆఫీసుల్లో అంత కంటే ఘోరంగా ఉంటుంది అది ఆ వచ్చిన లేడీ మెజిస్ట్రేటును చూస్తే తెలుస్తుంది ఆవిడ నేను ఇద్దరం కలిసి చదువుకున్నాం ఆవిడ చరిత్ర కూడా నా చరిత్రే - ఆవిడ భర్త కూడా ఎద్ద ఆఫీసర్ - ఆవిడకు పిల్లలున్నారు - విడాకులు తీసుకొని తల్లిదండ్రులకు అప్పగించి జీవచ్ఛవంలా జీవిస్తుంది - వచ్చిది ఎం లాభం? నా డిపార్టుమెంటులో ఉండి ఎం సాదించింది? అందాల రాశి అంది

అసలు ఎవర్ని అని ఎం లాబం ఇచ్చే వాళ్ళుంటే తీసుకునేవారు కోకొల్లలు - పడేవాళ్ళుంటే కొట్టేవాళ్ళు తిట్టేవాళ్ళు కోకొల్లలు స్త్రీ బస్సయింది అంది అదే స్త్రీ తిరిగి కొడితే బరితెగించిందంటారు అసలు ఆడవాళ్ళదే తప్పు అంది

ఎంటా తప్పు! అన్నాను

కొడుక్కు కట్నం కావాలనే తల్లి స్త్రీయే కదా కూతురికి కట్నం ఇవ్వకపోతే ఎలా అనేది వాళ్ళే కదా అత్త ఆడబిడ్డలు కలిసి భర్తను ఉసికొలిపి ఎగవేసేది స్త్రీయే కదా? ఇంట్లో ఎప్పుడు ఉండేది - గొడవలు పడేది స్త్రీలే కదా - సమాజంలో ఉన్న సర్వం క ళ్ళు కడగాలంటే స్త్రీలు ఏకం కావాలి - స్త్రీకి స్త్రీయే శత్రువు అనడం కొంతవరకు నిజం - సమస్యలు పరిష్కరించుకోక

పోవడానికి కారణం స్త్రీనే అంటూ – అసలు ఈ స్టవును ఎవరు కనిపెట్టారోగాని – దాంతో పాటు ఒక అగ్గిపెట్టె బలే – అవి మాత్రం స్త్రీ సమస్యలే కాదు పురుషుల సమస్యలు బలేగా పరిష్కరిస్తున్నాయి – అగ్గిపుల్ల రకరకాల స్టవులను వంటింటి నుండి గెంటిన్నాడే స్త్రీ శక్తి ఒకటౌతుంది అంతవరకు ఇదింతే అదంతే స్టౌ కాలిందని స్టౌను బదనాం వెయడం తప్ప

కాలేజీలో మేమిద్దరం చాలా గొప్పగా మాట్లాడేవాళ్ళం ఉపన్యాసాలు దంచేసేవాళ్ళం మేము చాలా ధైర్యవంతులమనీ గర్వంగా చెప్పుకునే వాళ్ళం కాలేజీలో ఏ విధంగా సమస్యలను వరకట్నాలను పురుషాధిక్యతను ఎలా ఎదురించాలో ఉదాహరణలిస్తూ స్పీచెస్ ఇచ్చేవాళ్ళం సలహాలు కూడా ఇచ్చేవాళ్ళం స్వంత జీవితంలో దాన్ని ప్రాక్టికల్‌గా ఎదుర్కోలేక పోయాము – అంది

నీకు ఎంతమంది పిల్లలు అని అడిగాను

ఇద్దరు అన్నానుగా!

ఆడా? మగా?

అ ఎవరైతేనేం మగవాడైతే వేదిస్తాడు ఆడ పిల్లైతే వేదించబడుతుంది సమస్యైతే ఒకటేగా దానికి సమాదానం కూడా ఒకటే కదా – అదే ముల్లు + అరిటాకు = ఆడపిల్ల+ అగ్గిపుల్ల అంటూ పేలవంగా నవ్వింది చాలా రాత్రైంది మీరు వెళ్ళండి డాక్టర్ ఉంది అది సరే మీకు పెళ్ళైందా అంది

అయింది

కట్నం తీసుకున్నారా?

నేను సైలెంట్

నవ్వింది – మూల్గుతూ

నాకు బ్రతకడానికి ధైర్యం లేదు – దానికి చావడాని ధైర్యం లేదు పురుషులు ఏ ధైర్యం చేయలేని పిరికిపందలు స్త్రీలు చేసే ధైర్య సాహసాలను పురుషులు ఒప్పుకోరు ఇది ఇలా జరుతూనే ఉంటుంది వేదింపులకు సాదింపులకు ఆడవాళ్ళు తిరగబడనంత కాలం ఇది ఇలానే జరుగుంది

నేను More than 90% కాలాను నాల్గు రోజుల్లో నా పనైపోతుంది నెల తిరక్కముందే నా భర్త మళ్లీ పెండ్లి చేసుకుంటాడు నా పిల్లలు వీదులపాలై పెద్దైనాక పెళ్ళి

తెచ్చుక ంటారు వాళ్ళు ఎప్పుడైనా మీ దగ్గరకు వస్తే సహాయం చేయండి - వారు కూడా ఇదే తరహాగా ఉంటే వదిలెయండి లేడీ జడ్జి మళ్ళీ కనబడితే నానుండి నమస్కారం తెలపండి అవునూ నాకు తెలియక అడుగుతా డబ్బు తీసుకొని పడుపు వృత్తి చేసే స్త్రీని వేశ్య అంటారు కదా? మరి వరకట్నం డబ్బు తీసుకొని కాపురం చేసేవాడిని మగ వేశ్య అనకూడదా? అంటూ కోమాలోకి వెళ్లింది అపస్మారకంగా మాట్లాడుతూ

ఇంతలో వార్డు ఆయా వచ్చింది సార్ ఇంకో కేసొచ్చింది సార్

ఏం కేసు? అన్నాను

కాలిందట

ఎట్లా?

స్టౌ బ్లష్టయిందట - అంది

స్టౌలు బాంబులై పేలుతున్నట్లు ఆ మంటల్లో స్త్రీలు కోడిపిల్లలై కాలిపోతున్నట్టు బర్న్స్ వార్డు కనబడసాగింది ఆ మంటల్లోకి మరొక కోడిపిల్లను వేసినట్లనిపించింది

డ్యూటీ రూముకు వెళ్ళాను - ఏదో తెలియని చికాకుతో

ఇది కథకాదు - స్వానుభవం

స్త్రీల సమస్యల సేకరణకు ద్వారం Female Burn ward అక్కడ నిజమైన కారణాలు లభిస్తాయి ఇది గమనించ దగ్గ విషయం భారత దేశమంతా బర్న్స్ వార్డు కాక ముందే మనందరం జాగ్రత్త పడాలి

*అంకితం ప్రత్యక్షంగా పరోక్షంగా వరకట్నాలను ఎదిరించే వారికి*

*కొడుకుకు కట్నం తీసుకోను అల్లునికి కట్నం ఇవ్వను అంటూ ప్రతి తల్లి గట్టి నిర్ణయం తీసుకున్ననాడే వరకట్న హత్యలు ఆత్మహత్యలు వేధింపులు ఆగిపోతాయి స్త్రీలే ఈ సమస్య పరిష్కారానికి బాధ్యత వహించి తిరుగుబాటు చేయదీయాలి*

# 5 వ్యాపారం

సార్ సార్ డాక్టర్ గారు - బాబ్బాబు రక్షించండి బాబు మా ఆవిడ ప్రమాదంలో ఉందండి. ఎమర్జెన్సి ఆపరేషను చేయాలని ముగ్గురు డాక్టర్లు చెప్పారు చేయకపోతే ఎపెండిక్స్ పగిలిపోతుందట, ప్రాణం పోతుందట ఆరు గంటలలోపే చేయాలని మూడు రోజుల నుండి చెబుతున్నారు డాక్టర్లు ఆపరేషన్ చేసి మా ఆవిడ ప్రాణం రక్షించి పుణ్యం కట్టుకోండి.

అంటూ ఎడుస్తూ విపరీతమైన వేదనతో మెురపెట్టుకోవడం భయపడి అయోమయంలో పడి టెన్షన్‌తొ ఉన్నాడా భర్త

రోగిని పరీక్షించి - మాడండ ఇది ఎప్పెండిక్స్ వాచిపోయిన మాట నిజమే ఆపరేషన్ చేయడం కూడా అవసరమే కాని అంత ఎమర్జెన్సి అయితే కాదు ఇది ఎక్యూట్ కాదు దీన్ని రెకరెంట్ ఎప్పెండిసైటిస్ అంటారు నింపాదిగా ఓ మూడు వారాల తర్వాతనైన చేసుకోవచ్చు అవసరం పడితే చేద్దాం లేదా వదిలేద్దాం అన్నాను

కాదు కాదు సార్ సార్ ఇది ఆపరేషన్ చేయకపోతే ప్రమాదమే సార్ ఎలాగైనా చేయండి అన్నాడు ఆ భర్త నిజమే తరువాతనైనా తప్పదు చేద్దాంలే అన్నాను ఇవ్వాళ్ళో రేపో చేస్తానన్నాను కాదు ఇవ్వాళ్ళే ఇప్పుడే చేయమన్నాడు భర్త - మంచిది అన్నాను ఎంత ఖర్చు వస్తుంది? అన్నాడు ఓ ఐదు లేదా ఆరు వేలు ఖర్చు రావచ్చు అన్నాను అదేంటి సార్ ఐదు ఆరు ఎంటి పది పదిహేనువేలైనా పరవాలేదు చేయండి ఇంకా ఎక్కువే అవుతుందని చాలా మంది డాక్టర్లు చెప్పారు ఖర్చుదేముంది? ముందు ఆపరేషన్ చేయండి. ఆ తరువాత డబ్బుదేముంది ! ఓ పది అటో ఇటో అంటూ అడక్కముందే మొత్తం ఆరు వేలు అడ్వాన్సు కట్టేశాడు

ఆపరేషన్ చేశాను పేషంటు క్షేమంగా ఉంది ఎడురోజులైంది కుట్లుతీసి డిశ్చార్జి చేశాను బిల్లు ఇవ్వమన్నాడు ఆరు వేలకు బిల్లు ఇచ్చాను కాదు కాదు నేను చెప్పాను కదా పదిహేను వేలు అయినా ఇస్తామని పదిహేను వేలకే బిల్లు ఇవ్వండి అన్నాడు ఆ భర్త ఆరువేలే అవుతుంది అంతకే బిల్లు ఇస్తానని చెప్పాను కావాలంటే ఇంకో వేయి ఇస్తాను గాని పదిహేను వేలకే బిల్లు ఇవ్వమని వేదించడం ఎందుకు ఇవ్వరు? అని వాదించడం అతని అత్తగారు బావమరుదులను ఎవరితోను మాట్లాడనివ్వడం లేదు లోనికి రానివ్వడం లేదు వారి ముందు డబ్బు వ్యయం చర్చించడం లేదు కాని పదిహేను వేలు అవుతుందట - అంటూ తగ్గించడానికి డాక్టరు గారితో మాట్లాడుతున్నాను పోట్లాడుతున్నాను అంటూ వారికి చెప్పసాగాడు వారిని బయటకు పంపించి సార్ మీరు - పదిహేను వేలకు బిల్లిచ్చి మొత్తం పదిహేను వేలు మా అత్తగారి నుండి తీసుకోండి నేను తరువాత వస్తాను ఆరువేలు పోగా మిగతా డబ్బు తొమ్మిది వేలు నాకివ్వండి అన్నాడు భర్త

అదేంటి అలా అంటావు అంతప్రేమ వలకబోసి తొందరపెట్టి నీవు ఇవ్వకుండా అత్తగారితో డబ్బు ఇప్పించి తిరిగి డబ్బు ఇవ్వమంటున్నావా? అదేమిటని నిలదీసి అడిగాను అదంతా అనవసరం మీ డబ్బు మీకిచ్చాను నేను చెప్పినట్లు చేసి నా డబ్బు నాకివ్వమన్నాడు అలా జరగదని ఖచ్చితంగా చెప్పాను ముందు ఆరువేలు అని ఇప్పుడు

పదిహేను వేలు డిమాండు చేస్తున్నాడని బైటవాళ్ళు వినేటట్టుగా అరవడం మొదలు పెట్టాడు జబర్దస్తీగా వాదె తప్పే నట్లుగా నటిస్తూ పదిహేను వేలు అత్తగారి చేత టేబుల్ పై పెట్టించి ఉందరు ఒయటక వెళ్ళారు బిల్లు రేపు చేసి పెట్టండి సాయంత్రం వస్తాను అంటూ తన భార్యను తీసుకొని వెళ్తాన్నాడు

ఈలోగా నా మనస్సు పరిపరి విధాల ఆలోచనలోకి వెళ్ళింది ఇదేంటి ఇలా జరిగింది భర్త గొప్పగా ప్రేమ నటించి భార్యపై ఇదోరకమైన వ్యాపారం చేస్తున్నాడు ఇదంతా అతని భార్యకు గాని తల్లిదండ్రులకు గాని అత్తగారికి గాని తెలియదు ఆడవాళ్ళపై ఎన్నోరకాల వ్యాపారాలు చేస్తున్నారు పురుషలోకం వైద్యం ఆసరాగా ఇదో రకమైన వ్యాపారం ఎలాగైనా ఆ భార్యకు న్యాయం జరగాలి నిజం తెలియాలి భర్తకు బుద్ధి చెప్పాలి మళ్ళీ ఇలాంటి వేదింపులు వాదింపులు జరగకుండా చూడాలి ఏం చేస్తేబా గుంటుందని నేను నా భార్య ఆలోచించాం ఒక నిర్ణయానికి వచ్చాం

సాయంత్రం ఆవిడ భర్త వచ్చేలోగా అంతా సంగతి ఆపరేషన్ చేయించుకున్న భార్యకు అత్తగారికి వివరించాం మిగతా తొమ్మిది వేలు అతని భార్య ముందు అతడి అత్తగారికి ఇచ్చి ఇద్దరి సంతకాలతో రసీదు తీసుకున్నాను వారిని తీసుకెళ్ళడానికి సాయంత్రం వచ్చాడు భర్త వారందరి సమక్షంలో ఆ రసీదును ఆ భర్త చేతిలో పెట్టాను నన్ను చంపేటంత కోపంతో నావైపు చూసాడు - అందరూ అతని వైపు చూశారు ఆ తర్వాత వెళ్ళిపోయారు

అన్యాయం చేసినా అన్యాయం జరుగుతుంటే చూస్తూ ఊరుకోవడం కూడా అన్యాయమే కాదా? ఇదో రకమైన వేదింపు

*అంకితం స్త్రీకి సమానత్వం కోరే వారికి స్త్రీకి అన్యాయం జరుగుతుంటే ప్రతిఘటించే వారికి*

*వరకట్న నిషేద చట్టం జటిలంగా కఠినంగా ఉన్నప్పటికీ నేరాలు ఘోరాలు జరుగుతూనే ఉన్నాయి స్త్రీ చంపబడుతూనే ఉంది స్త్రీకి అన్యాయం జరుగుతూనే ఉంది*

# ౬ మూన కల్నం

ఓరోజు క్లినిక్‌లో పేషంట్లను చూస్తున్నాను ఒకరి తరువాత ఒకరు నెక్స్ట్ అన్నాను ఒక వృద్ధురాలు వెంట ఇద్దరు యువకులు - చెరోచేయి పట్టుకొని లోనికి వచ్చారు కూర్చోమన్నాను కూర్చుంది బాగున్నవా బాబు అంది నాకర్థం కాలేదు మీ అమ్మా-నాన్న బాగున్నారా? ఆ బాగున్నారు ఎదో పట్టించుకోనట్లుగా క్లినిక్‌లో పేషంట్లు ఎక్కువగా ఉండటంచేత అలా అన్నాను పక్కకు వారి వైపు తిరిగి ఈ డాకరు చిన్నప్పుడు నెక్కరు చిరిగిపోయిన చొక్కవేసుకొని సీతయ్య గారింట్లో ఉండేవాడు మనింట ముందు నుండే బడకపోయేవాడు వారి ఇంట్లోనే తిని చదువుకొనేవాడు ఆయన చనిపోయిన తరువాత ఎక్కడ కెళ్ళాడో తెలియదు ఈ రోజు 40 సంవత్సరాల తరువాత చూస్తున్నాను అన్నది ఆయన బార్య రాదమ్మకూడా క్యాన్సర్‌తో నీ చేతిలోనే చనిపోయిదంటగా? అంది జానమ్మ

వెంటనే మీది ఏ వూరు అన్నాను నేను చదువుకున్న బడ ఉన్న ఊరు పేరు చెప్పింది వెంటనే జానమ్మ కదా అన్నాను అవును పేరు జ్ఞాపకం ఉందా? అంది ఎందుకు లేదు? ఎలిచి పెసరకాయలు వేరు శనగకాయలు ఎటేదానివిగా అన్నాను అవీ ఇవీ కాసేపు మాట్లాడ రిపోర్టులు చూశాను అందరు డాక్టర్లు ఇచ్చిన రిపోర్లు మళ్ళీ-మళ్ళీ చూశాను అవి Advanced Cancer అని చెబుతున్నాయి ఇంకా రెండు నెలల కంటే ఎక్కువ బ్రతుకదు అని ఆవిడకు చెప్పకూడదు ఈ ఇద్దరు ఎవరన్నాను మా ఆయన కొడుకులు అంది ఏ ఆయన అదే నేను వదిలివేసిన మొదటాయన అంది మరి రెండవ ఆయన ఏడ అన్నాను రెండవ ఆయనలు చాలా మంది లేండ అంది

ఆ మొదటాయన నా కళ్ల ముందు కనపడ్డాడు నిలవెడు మనిషి అమాయకుడు బార్య తప్ప మరో లోకం లేదు ఆయనకు ఈవిడ అందాల బరిణె నిజంగా అందాల బంగారు బరిశే ఊళ్ళో అప్పుడప్పుడే వయసొచ్చిన యువకుల నుండ వృద్ధుల వరకు ప్రతి ఒక్కరి హృదయాలకు గిలిగింత ఈవిడే ఈవిడ గురించి తెలియని వారులేరు ఉండేవారు కాదు ఓ కుగ్రామంలో అన్ని వర్గాల వారి హృదయాలు కదిలించి వేసే అందాల రాశి ఉండడం అరుదు అందులో కొంత చదువుకుంది 4వ తరగతి పెయిల్ బర్త చదువురాని వాడు ఆజానుబాహుడు వ్యవసాయదారుడు అంతే ఇంటికి పొలానికి తిరగడం బార్య తప్ప వేరే ఏ విషయం ఆయనకు తెలిసేది కాదు వారిక ఒక కూతురు ఉండేది చాలా అందంగా ఉండేది తల్లి కూతుళ్ళు ఇద్దరు రోజూ శివుని గుడికి వెళ్ళేవారు సాయంత్రం అందరు బక్తులు వెళ్ళిపోయేవరకు గుడిలో ఉండేవారు పాప గుడి చుట్టు తిరుగుతూ ఆడుతూ పాడుతూ గెంతుతూ ఉండేది ఆవిడ మాత్రం బక్తితో

నిమగ్నమై పొద్దు పోయేవరకు గుడలోనే ఉండేది భక్తులందరిక అనుమానం వచ్చేది పూజారి శీలాన్ని శంకించేవారు అదే నిజమైంది పూజారిక ఒక కొడుకు బార్య చనిపోయింది ఆజానుబాహుడు ఉందగాడు బాగా చదువుకున్న పండితుడు అన్ని వ్యసనాలు ఉన్న వ్యక్త భక్తులందరికి అతనంటే ఒబిమానం ఆయన గుడికి వచ్చే వరకు బక్తులు అక్కడే కూర్చునేవారు నియమ నిబంధనలు పాటించేవాడు అందరికి అప్పుడు దానం దర్మం శివుని గుడ కార్యక్రమాలు బ్రహ్మాండంగా నిర్వర్తించేవాడు ఆవిడచేత తిరస్కరించబడ్డ కొందరు వారిద్దరిపై ఓ కన్నేసి ఉంచారు అంతే పట్టుపడ్డారు గుడిలో శివలింగం వెనుకాల అంతే దొరికిపోయారు లైంగిక దురహంకారం నిండి ఉన్న మగ పురుషులు చేసే గడబిడ గందరగోళం ఆజానుబాహుడైన వ్యవసాయదారునికి ఒక్కించి చెప్పారు

రచ్చ ఎండ - పంచాయితీ తర్జన బర్జన కొందరు అటు కొందరు ఇటు ఆడవాళ్ళ ముక్కుపైన వేళ్ళు కొందరు ముక్కు విరుపులు విరవడం తన్ను-తన్ను అనే వాళ్ళు కొందరు గుద్దు-గుద్దు అనే వాళ్ళు కొందరు కంట్రోల్‌లో ఎట్టనేని బర్తను తన్నాలని కొందరు కాదు బాగా బలిసి ఉన్నది దాన్నే తన్నాలని కొందరు కాదు కాదు ఆ పూజారి గాడ్ని తన్నాలని కొందరు అసలు తీర్మానం ఏం చేయాలో తెలియక ఎద్ద మనుషులు అందరూ పెద మనుషులే ఈ ముగ్గురూ మూడు వైపుల నిశ్శబ్దరంగా ఒకరి వైపు ఒకరు చూస్తూ అందరి వైపు చూస్తున్నారు ఏం చేయాలో వారిక అర్థం కావడం లేదు ఎం నిర్ణయం చేయాలో అయోమయం

ఇంతలో జానమ్మ బర్త లేచి నిలబడ్డాడు బీకరంగా కనిపించాడు అందరికి ఎదో చేస్తాడని అనుకున్నారు అయ్యిందేదో అయ్యింది మనం ఇంటిక వెళ్ళుదాం రా జానమ్మా అన్నాడు బర్త అందరు నివ్వెరపోయి చూస్తున్నారు బార్యను వదిలేస్తాడనుకొన్నారు అదే మాట మళ్ళీ అన్నాడు అంతా నిశ్శబ్దంగా ఎం జరుగుతుందో చూద్దాం అని చూచేవాళ్ళు కొందరు ఇంతలో కుల ఎద్ద లేచి చెడిపోయినదాన్ని వదిలేయ్ అంటు బర్తను లాక్కుని వెళ్ళాడు ఇంకా కొందరు అదే న్యాయమని జానమ్మను చెలివేసి వెళ్ళిపోయారు మరి కొంతమంది అన్యాయమూర్తులు లేచి వెళ్ళిపోయారు పూజారి జానమ్మ అలాగే కూర్చున్నారు ఇంకా ఎవరైనా ఏ న్యాయం చెబుతారోనని అందరు చూస్తున్నారు ఒకడన్నాడు పూజారై ఉండి అన్ని తెలిసే దాన్ని చెడకొట్టాడు బర్త వదలేసి వెళ్ళాడు దాన్ని ఇక చూసుకునే బాధ్యత పూజారిదే అన్నా డొకడు అక్కడే తొక్కుబిళ్ళ ఆడుకుంటున్న తన బిడ్డను ఎలిచింది జానమ్మ పూజారి వెంట నడుచుకుంటూ వెళ్ళారు తల్లి ఎల్ల పూజారి ఇంట్లోకి కాదు ఆయన ఇంటి వెనుకాలున్న గుడిసెలోకి ఆ గుడిసె మా బడ దారిలోనే

ఉంది జానమ్మ బర్త ఊరు విడచి వెళ్ళిపోయాడు పూజారి మళ్ళీ పూజ మొదలెట్టాడు యదావిదిగా గంటలు మ్రోగాయి 16 సంవత్సరాలు గడుచాయి

జానమ్మ కూతురు ఎళ్ళీడుకొచ్చింది కూతురుకి పెళ్ళి చేయాలి పూజారి తరపు వాళ్ళు ఎవరు ముందుకు రావేదు వదిలేసిన బర్త తాలూకు మనుషులు ఎవరూ రావేదు ముందుకు ఎళ్ళి కావేదు ఎంతో మంది కాళ్ళా వేళ్ళా పడింది తల్లి కూతురు ఒకేలాగ అందంగా ఉన్నారు మళ్ళీ ఊళ్ళో వాళ్ళ కళ్ళు ఆ ఇద్దరి మీదే పూజారి జానమ్మను మనువాడలేదు కూతురు ఎళ్ళి విషయం వదిలేశాడు తల్లికి విసిగెత్తింది అంతే వాళ్ళిద్దరు ఓ వారం రోజులు గ్రామంలో కనిపించలేదు ఎవరికీ తెలియదు ఏమయ్యారో - అందరు వెతకడం ప్రారంబించారు ఎక్కడ కనిపించలేదు ఆత్మహత్య చేసుకున్నారనుకున్నారు

దగర్లో ఉన్న టౌనులో చదువుకుంటున్న ఈ ఊరి ఆనాడు వీడదీసిన కుల పెద్ద ఈనాటి కామందుగారిబ్బాయికి అన్ని అవ లక్షణాలున్నాయ్ వ్యసనాల బానిస మిసమిసలాడే వయస్సు సినిమా సెలు వాడి ఎండ్ల నిశ్చయమైంది ఎవ్వరితో? జానమ్మ కూతురుతో అంతా ఆశ్చర్యము వాడి తల్లి తండ్రికి ఇష్టం లేదు అయినా వాడికి ఇష్టమైంది పెండ్లి పోయింది అల్లుడు కూతురు జానమ్మ అల్లుడి గారింట్లోనే కాపురం పూజారి రావడం మానేశాడు ఎందుకో? పూజారిని జానమ్మ వదిలేసిందా? జానమ్మను పూజారి వదిలేశాడా? ఎవరికి తెలియదు జానమ్మ కూతురు పెళ్ళి ఎలా జరిగింది? పూజారికి తెలియదు నియమ నిబందనలు కట్టు దిట్టాలు కట్నకానుకలు ఒప్పందం ఎమిటో ఎవరికీ తెలియదు ముగ్గురూ ఒకే దగ్గరుంటున్నారు మూడు సంవత్సరాలు దాటింది కూతురు నెల తప్పింది ఊళ్ళో వాళ్ళందరికి అత్తా అల్లునిపై అనుమానం ముక్కుమీద వేళ్ళు గుస గుసలు కూతురుని వింతగా చూడడం - కూతురు రాగానే గుసగుసలు ఆపేయడం

కూతురుకి తల్లిపై కోపం అనుమానం అసహ్యం మనుమరాలు పుట్టింది తల్లిని కూతురు ఇంట్లో నుండి వెళ్ళకొట్టింది బర్తను వెళ్ళకొట్ట లేక పోయింది తప్పు పట్టలేక పోయింది తనకు విముక్తి కలిగిందని కూతురుకు న్యాయం జరిగిందని అంతరంగంలో సంతోషిస్తూ కూతురుకు కృతజ్ఞత తెలుపుతూ నమస్కరిస్తూ కూతురికి ఈడు కాని మొగడుకి వీడ్కోలు పలికింది జానమ్మ దిక్కులేనిదై పోయింది ఊరు విడిచి వెళ్ళిపోయింది అంతే ఎక్కడికెళ్ళిందో తెలియదు

ఈ కదంతా కళ్ళ ముందు కనబడింది ఒక్క క్షణంలో ఇంతలో ఆ ఇద్దరు బాబులు అదేంటీ జమీలా బీ కదా నీ పేరు జానమ్మ అంటాడు? అన్నారు తెలుగులో జానమ్మ ఉర్దులో జమీలా తేడా ఏముంది? ఎలా పిలుస్తే ఏం? అంది మాకు రకరకాల పేర్లుంటాయి అని అంది

అదిపరే ఈ ఇద్దరు బాలులు మీ అయిన కొడుకులున్నావు మీ ఆయన బాగున్నాడా అన్నాను ఆ ఆయన అంది ఇద్దరూ పోయారట ఎవరు చెప్పారు? మా ఆయన బార్య వీళ్ళ తల్లి ఆవిడ నీకు ముందే తెలుసా? ఎలా తెలియదు? నేనే ఆవిడకు తెలుసు ఎలా వెతుక్కుంటూ వచ్చింది ఎందుకు? మొదట కూతురును కన్న తల్లే అసలు తల్లంట మా ఆయనకు నే కన్న నా కూతురే తన కూతురట అందుకే నేను ఆవిడ ఒకటేనట తన ఇద్దరు కొడుకులు నా కొడుకులంది నా అదృష్టం బాగుంది డాక్టరు తల కొరివి ఎట్టాడానికి నా కిద్దరు కొడుకులు - నాకు ఇంకా ఏమి కావాలి? అంది జానమ్మ ఓ అయితే నీ జబ్బు నీకు తెలిసిందా? అన్నాను నేనే సంపూనిక ఓ క్యాన్సరులాంటిదాన్ని నాకు క్యాన్సరే వస్తుందని నాకు బాగా తెలుసు వేశ్యకు క్యాన్సరు అంటువ్యాధి రాక ఇంకేమొస్తుంది? అంటు వ్యాధులు క్యాన్సరు స్పృశిస్తు దగ్గరికొచ్చి నా జబ్బేమిటని అడగాలా? నాకొచ్చే జబ్బు మరొకరికి రాకుండా ఉండాలనే ప్రయత్నమే ఈ ఇద్దరు ఎల్లల తల్లి ఒకనాడు వేశ్య గృహానికి అమ్మబడ్డ అమయాకురాలు ఈవిడే నేను పంపించిన వీళ్ళ తల్లి మా ఆయన బార్యకు తప్ప నా కూతురుకు గాని మా ఆయనకు గాని పూజారిగారికి గాని మా ఊరి వాళ్ళకు గాని నేను బ్రతికి ఉన్నట్లు ఇంతవరకు తెలియదు ఈ ఒక్క తల్లికే తప్ప నేను ఏనాడో గతంలోనే గతించానంది జానమ్మ మరోసారి మరణించాలా? అంటూ కొద్ది రోజుల్లోనే మరణించింది క్యాన్సరుతో మరణించిన జానమ్మకు తన తమ్ముళ్ళు తలకొరివి ఎడ్తుంటే తన తల్లి ఇప్పటి వరకు బ్రతికుందని తెలుసుకుంది చెడిన తన తల్లి మరో తల్లిని సృష్టించి తన తండ్రి దగ్గరకు చేర్చింది తన మానాన్ని కట్నంగా చేసి తన ఎండ్లి చేసింది తన తల్లేనని ఇప్పుడే తెలుసుకుంది జానమ్మ కూతురు అమ్మను చూడాలని పరుగెత్తింది అప్పటికే జానమ్మ కాలి బూడిదగా నిలిచింది శ్మశానంలో బూడిదను చూస్తు నిలబడ్డాను నావెనకాల కొన్ని మాటలు వినపడ్డాయి ఆడదానికి ఆడదే శత్రువు ఆడదాన్ని రక్షించేది ఆడదే మగవాన్ని రక్షించేది ఆడదే ఎందుకంటే ఆడ - మగకు జన్మ ఇచ్చేది ఆడదే ఆడది అనుకుంటే సాధ్యం కానిది ఏమిటో? అనటం వినబడింది ఇది జరిగింది జరిగినట్టుగా చెప్పిన కద ఇందులోని పాత్రల పేర్లు వ్రాయలేదు ముఖ్యపాత్ర పేరుతో ఒక అక్షరం తీసివేసి జానమ్మ అని పేరు పెట్టాను జానమ్మ ఆత్మకు శాంతి కలగదేమో - కాలుగుకాక

స్త్రీ వేశ్యగా మారడానికి ఎన్నో కారణాలు మగవారే కొంతవరకు బాధ్యులు

*అంకితం వేశ్య వృత్తి నుండి విముక్తి పొందేవారికి విముక్తి కొరకు పోరాటం చేసేవారికి స్త్రీని గౌరవించే స్తైలుకు*

*వరకట్నం వికృత రూపం దాల్చుతుంది - ప్రతి వస్తువు వరకట్నంగా మారుతుంది ఈ విషయంలో మానవత జాగ్రత్త వహించాలి*

*వేశ్యా వృత్తి నుండి స్త్రీని రక్షించేది స్త్రీ - పురుషుడు కాదేమో?*

# 7 మరోజన్మ

మానవుడు తెలివి మీరి ఈ భూగోళాన్ని కాలుష్యంతో నింపేసి తనకు తానే నాశనమైపోతాడని ఊహించే భగవంతుడు వృక్షాలను వన సంపదను కవచంగా సృష్టించాడు అది తెలుసుకోక అభివృద్ధి అనే మైకంతో తోటి ప్రాణి అయిన వృక్షాలను నిర్దాక్షిణ్యంగా హత్య చేస్తున్నాడు కానీ వృక్షం మాత్రం మానవుని మనుగడకు ప్రతిప్రాణి రక్షణకు ప్రతి క్షణం తన జీవితాన్నే అంకితం చేసి నిరంతరంగా సేవ అందిస్తూనే ఉంది

పసిపాపలను తన ఒడిలో ఊయలలూపే తల్లిగా వ్యవసాయంలో నాగలిరూపంతో తండ్రిగా బడిలో బెత్తమై భయభక్తులు నేర్పే గురువుగా వృద్ధాప్యంలో క్రుంగుతున్న వెన్నెముకకు చేతికర్రగా తోడు నిలిచి ధైర్యానిస్తోంది వృక్షం

కనువిందైన కట్టడాలు చిత్రాలు కళా ఖండాల నుండి కాటిలో కర్రపేడు వాడే వరకు కూటి నుండి కాటి వరకు వైద్యునిగా రోగికి వైద్యాన్ని ప్రసాదించి సహకరించి మొలక నుండి మహావృక్షాల వరకూ కాలుష్యాన్ని జీర్ణించుకుని పశువుకు శిశువుకు ప్రతి ప్రాణికి ప్రాణవాయువును ప్రసాదిస్తోంది వృక్షం

వేడి నుండి మనిషిని కాపాడి వర్షాలను రప్పించి ప్రతి ప్రాణికి ఆహారాన్ని సమకూరుస్తోంది తన శరీరాన్ని అర్పించి సప్తస్వరాలు పలికించి మానవుణ్ణి సంగీత విద్యాంసులుగా తీర్చిదిద్ది సకల కళలకు ఆధారమై కళాపోషణ చేస్తోంది రాయి విసిరితే పండు విసురుతుంది గూడు గూడుకు ఆధారంగా నిలుస్తుంది కొమ్మ విరిచితే కొంప నిచ్చింది వృక్షం మన ఒక్క దేశంలోనే చెట్టు పూజింపబడుతుంది మరో జన్మంటు ఉంటే ఈ పవిత్ర భారతదేశంలోనే మళ్లీ మళ్లీ పుట్టించమని భగవంతుని కోరుకుంటాను అది ఎదో ఒక చెట్టుగానో లేక వృక్షాన్ని ఆశ్రయించే ప్రాణులుగానో

మంచి గంధపుచెక్కలతోనే తమ అంత్య క్రియలు జరుపాలనే జాతి నేతల విపరీతపు కోరికలను మౌనంతో స్వీకరించి వారితో సహగమనం చేస్తుంది వారి చివరి కోరికలను తీరుస్తుంది భారత స్వాతంత్ర్య పోరాటంలో మహాత్మునికి చేతి కర్రగా ఉద్యమంలో పాల్గొన్నది జాతీయ జెండా ఉవ్వెత్తున ఎగరడానికి ఉపయోగపడింది

ఇంతటి నిస్వార్థజీవి వృక్షం - వృక్షాన్ని రక్షిద్దాం - పర్యావరణాన్ని పరిరక్షిద్దాం - తోటిప్రాణి రక్షణే ప్రపంచ శాంతికి మూలం వృక్ష్యాన్ని మనం రక్షిస్తే - వృక్షం మనని రక్షిస్తుంది ధర్మో రక్షతి రక్షిత - వృక్షో రక్షతి రక్షిత

**నినాదాలు**

చెట్టు మనిషికి ఆయువు పట్టు వృక్షం ఒక కళాఖండం

వన రక్షణే జన రక్షణ చెట్టు ప్రగతికి మెట్టు

అన్ని సంపదలకన్నా - వన సంపదే మిన్న
వనాలు కాలుష్యానికి సమాదానాలు
మనిషి చస్తే మట్టి - మాను చస్తే మృదంగం
వృక్షమే వర్షాదారం వృక్షం కళాస్వరూపం
మానుకు మతం లేదు చెట్లు అంతుపట్టని నిజాలు
నాగరికతా చిహ్నం చెట్టు చెట్లను హత్యచేయకండి
ఆకుపచ్చదం - ఆహ్లాదకరం కొబ్బరి చెట్టు కొడుకుతో సమానం
విష వాయును అస్వాదించి - ప్రాణవాయువును ప్రసాదిస్తుంది చెట్టు
వృక్షాన్ని రక్షించడం ఒక లక్ష్యం వృక్షమే లక్ష్మి
చెట్లు సంస్కారానికి మెట్లు చెట్లు సంస్కృతికి మెట్లు
వనాలే మన ప్రాణాలు వృక్షాలు - వర్షాలు కురిపిస్తాయి
వృక్షాలు ప్రకృతి సౌందర్యాలు వేప చెట్టు అమృత వర్షిణి
వృక్షో రక్షతి రక్షిత - వృక్షాన్ని రక్షిస్తే వృక్షం మనను రక్షిస్తుంది
నిస్వార్ధ జీవి వృక్షం వృక్షాలు దైవ స్వరూపాలు
వృక్షం ఒక శృంగారం వృక్షం ఒక చిత్రం వన లక్ష్మే దనలక్ష్మి
నిర్మల మనసుకు పట్టు - నిస్వార్ధ జీవి చెట్టు
చింత చచ్చినా పులుపు చావదు - పులుపు చచ్చిన పురుషుడెందుకు
చెట్టు నీడే తల్లి ఒడి రాయిని విసిరితే పండును విసురుతుంది వృక్షం
వృక్షం ఒక ఖజురహో చిత్రం కొమ్మ విరిచితే కొంప అవుతుంది
The tree is the Answer to the Global pollusion
Love the trees and save the trees
He who saves the trees is the civilised
The Tree is the symbol of Civilization
Trees are lungs of the Nature
Trees breath for us

*వనాలను రక్షించేవారికి, ఆకుపచ్చ దనాన్ని సంరక్షించే వారికి అంకితం*

*ప్రపంచంలోనే మొదటి ప్రయోగం వృక్షకళ చాయా చిత్ర ప్రదర్శన (రవీంద్రభారతి)*
*శ్రీ కె.వి. రమణాచారి ఐ.ఎ.ఎస్. (కల్చరల్ సెక్రటరీ ఆం.ప్ర.) సౌజన్యంతో వారికి*
*ప్రత్యేకమైన కృతజ్ఞతలతో వెయ్యి కరపత్రాల పంపిణి*
*కార్యక్రమానికి అతిధులు శ్రీ ఎ. మాధవరెడ్డి ఆరోగ్య శాఖామాత్యులు*
*శ్రీ రామసుబ్బారెడ్డి అటవీ శాఖామాత్యులు శ్రీ రాజన్‌బాబు ప్రముఖ చాయాచిత్ర కళాకారుల*
*సమక్షంలో ప్రభుత్వమే చేపట్టిన మూడు రోజుల ప్రదర్శన ప్రభుత్వం నుండి రూ॥ 1000/- ల*
*పారితోషికం పొందిన కళ జనవరి 1994 చెట్టుతో శృంగారం చాలా ఉంది - ఎనారె*

# 8 కళలు కల్లలైన వేళ ! - శిల్పలు శిలలైన వేళ !!

తరం తరం నిరంతరం జీవించే నిర్జీవులు శిలలు వజ్ర వైడూర్య మరకత మాణిక్య పగడాలు శిలలే ఒక్కొక్క శిలకు ఒక విలువుంది నిర్జీవ శిలల కోసం యుద్ధాలు జరిగాయి చరిత్రకు ప్రేమకు చిహ్నాలుగా నిదర్శనాలుగా శిలలు శిల్పాలై నిలబడ్డాయి రకరకాల రంగుల శిలలు అదృష్టాలను తెలుపుతూ జాతకాలను దురదృష్టాలను మారుస్తున్నాయి భవిష్యత్తును మెరిపిస్తూ మురిపిస్తున్నాయి యుగయుగాల చరిత్రకు నిదర్శనాలుగా నిలబడ్డాయి జీవించే క్షణిక జీవుల చరిత్రను సజీవులుగా చిరంజీవులుగా బ్రతికిస్తున్నాయి పురాణాలకు పునాదులై భూమిలో దాగివున్నాయి నిర్జీవులే చిరంజీవులని శిలలు నిరంతరం చాటుతున్నాయి

ఏ శిలలో ఏ శిల్పం దాగివుందో ఎవరికి తెలుసు? ఎండకు ఎండి వానకు తడిసే ఏ బండలో ఏ గుండె దాగి వుందో ఎవరికి తెలుసు ఏ శిల్పిలో ఏ కళ వుందో ఒక శిలకు మాత్రమే తెలుసు శిలలు లేక శిల్పులు ఉందురా? శిల్పి లేక శిల్పం వుండునా ! శిల్ప కళలు లేక భారతీయ సంస్కృతి చరిత్రలు భద్రపరచబడ ఉండునా?

శిలలకు కూడ లింగ భేదం వుంది స్త్రీ లింగ శిలలు స్త్రీ విగ్రహానికి పుం లింగ శిలలు పురుష విగ్రహానికి పనికవస్తాయి నపుంసక శిలలు పునాదులకు కట్టడాలకు మాత్రమే పనికి వస్తాయి అని శిలా శాస్త్రం తెలుపుతుంది భారతదేశంలో రమించుకునే రాళ్ళు వున్నాయని ఖజురహో కోణార్క్ సూర్య మందిరాలు ఆధారాలుగా నిలబడ్డాయి ఈ శిలలు ఏఏ జాతికి చెందినవో శిలా శాస్త్రానికే అంతుపట్టని నిదర్శనాలు అదే విధంగా నిరంతర రతి భంగిమలో చిత్రించబడి పూజింపబడుతున్న దైవ స్వరూపం శివ లింగం ఏకశిలతో చెక్కబడింది ఇది కూడా శిలా శాస్త్రానికి అంతుబట్టని మరొక నిదర్శనం

రాతి ధ్వజ స్తంభాలు శిలా శాసనాలు రాజుల ఎలికను తెలుపుతున్నాయి రాతిలో నాతి వుందని ఒక రాతి గర్భంలో అందాల మండోదరి దాగి వుందని రామాయణం చెపుతుంది రాళ్ళు సప్తస్వరాలు పలికిస్తాయి నవరసా లొలికిస్తాయి

భారతీయ సంస్కృతికి సాంప్రదాయాలకు శిల్ప సంపదనే శిల్పుల చాతుర్యమే మన చరిత్రకు ఆధారాలు ప్రకృతిలో కళాకృతులు గల శిలాకృతులు ఎన్నెన్నో ఉన్నాయి శిలలో నుండి వ్యర్థాన్ని తొలగిస్తే శిల్పం అవుతుంది వ్యర్థాన్ని సమకూర్చి సందిస్తే మరో శిల్పం అవుతుంది ప్రకృతిలో వ్యర్థం అనేది లేదని ఈ వ్యర్థ శిలలు సందేశాన్ని అందిస్తున్నాయి కాలం కన్న కలలే కళాకృతులలో వున్న శిలలు శిల్పలు చెక్కిన శిల్పాలు నిజాలు చెప్పే నిర్జీవులు శిధిలాలుగా మారిన మన శిల్పాలు కాలం కార్చిన కన్నీళ్ళు

ప్రస్తుతం శిల్పానికి ఆదరణ లేక శిల్పకళ అడుగున పడిపోయింది. భారతీయ సంస్కృతి కనుమరుగైపోయే ప్రమాదం వుంది. అందుకే శిలా సంపదను శిల్పులకు అందిద్దాం. వారి శ్రమకు ఆరాధిద్దాం. కళలు కష్టమైపోకముందే శిల్పులు శిలలుగా మారకముందే శిల్పుల మనుగడను కాపాడుదాం. సమతలకు మమతలకు మతాలకు నిలయమైన మన భారత ప్రజాస్వామ్యంలో వ్యర్థాలు కూడా కళలు ప్రదర్శిస్తాయి. వ్యర్థశిలల కళా ప్రదర్శన ఏర్పాటుచేద్దాం. సమైక్యతను చాటుద్దాం. **వ్యర్థానికి అర్థం ఉందని** సందేశాన్ని అందిద్దాం.

*అంకితం – శిల్పకళ రూపంలో భారతీయ సంప్రదాయాన్ని పరిరక్షించిన శిల్పులకు*

*Rocks of India* ***Rocks of Democracy*** *అనే అంశంపై*

*నా చేత రూపొందించబడ్డ **భారత సమైక్యతను చాటే** యాభై వ్యర్థశిలల కళాప్రదర్శన*

*తేది 1 డిసెంబర్ 2001 హస్తకళా ప్రదర్శన ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో వేయి కరపత్రాల పంపిణీ చేయబడినవి.*

# 9 పద చికిత్స

పద్మశ్రీ పద్మభూషణ్ జ్ఞానపీఠం అవార్డు గ్రహీత రాజ్యసభ మెంబర్ పలుచోట్ల డాక్టరేట్ పొందిన శ్రీ డా॥ సినారె గురించి చెప్పితే చాలా ఉంది. వింటే ఎంతో ఉంది.

భూనభోంతరాలను అష్ట దిగ్గజాలను సాహితీ మేరు పర్వతాలను యుగన గగన రసరమ్య రంగస్థలాలను కలిపి కూర్చోబెట్టి బయోడేటా చెప్పమంటే ఏం చెబుతాం? వారంటే తెలియనివారెవరూ లేరు. సినారె గారి బయోడేటా – సి. నారాయణరెడ్డిగారే.

స్పష్టంగా చెప్పాలంటే

| | |
|---|---|
| వారి జన్మస్థలం | భారత దేశంలో – ఆంధ్రప్రదేశం అనే కుగ్రామం |
| ఆయన పుట్టిన తేది | ఈ యుగం |
| ఆయన వయస్సు | ముందు రానున్న మరికొన్ని యుగాలు |
| ఆయన తల్లి | మన తల్లి భరతమాత |
| ఆయన తండ్రి | వ్యవసాయం |
| వారి సతీమణి | ప్రణయ శృంగార రస సాహిత్యాన్ని గ్రహాంతరాల నుండి నిరంతరం వారికందిస్తూ వారి నుండి మనకందిస్తూంది |
| వారి సంతానం | మూడు వేల గేయాలు ఎన్నో గ్రంథాలు |
| ఆయన దేశం | శాంతి సందేశం మన భారత దేశం |
| వారి ఆస్తి | ప్రజాభిమానం |
| విద్యాభ్యాసం | విశ్వకర్మ ధర్మ నిర్మితమైన ఈ సువిశాల విశ్వం ఆయన విశ్వ విద్యాలయం |

| | |
|---|---|
| ఆయన ప్రస్తుత నివాసం | ప్రజల హృదయం |
| ఆయన కీర్తి ప్రతిష్ఠ | అంతర్జాతీయం |
| ఆయన దేహం | ఐదుపు లేని నాహిత్య తరంగం |
| వారి అంతరంగం | నిరంతర అంతర్వేద సముద్రమదనం |
| ఆయన ధ్యేయం | బరత జాతి గౌరవం |
| వారి ప్రస్తుత జీవితం | బరతమాత కను కొనలనుండి రాలిన ఒక కన్నీటి బిందువు |

కూడబలుక్కునో లేక దారి తప్పో ఒక ఐదుగురు వ్యక్తులు ఆంధ్రప్రదేశంలో ఒకేసారి జన్మించారు అందులో ఒకరు సినారే గారు ఈ ఐదుగురి కలయిక యుగ యుగాల తెలుగు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది మిగిలిన ఆ నలుగురు వ్యక్తులు శ్రీ ఘంటసాల శ్రీ యన్ టి ఆర్ శ్రీ ఎ యన్ ఆర్ మరియు శ్రీమతి ప సుశీల గారలు ఈ నలుగురిని మహాశక్తులుగా తీర్చిదిద్దింది శ్రీ సినారే గారి సినీ సాహిత్యం

ఈ చిత్రం – చిత్ర విచిత్రం – బళారే విచిత్రం – సినారే సినీ చిత్ర సాహిత్య చిత్రం చిత్ర విచిత్రం వారు కుల మత జాతి వర్గ వర్ణ ప్రాంతీయ బాషా విబేద తత్వాలక అతీతులు ఒక నేషనలిష్టు వారు రచించిన గ్రందం గదిలో సముద్రం ఈ నిజాన్ని తెలియజేస్తుంది అంతటి మహా సాహితీ శక్తి పరులు శ్రీ సినారే గారు

ఈనాటి మన సబకు ముఖ్య అతిదిగా వచ్చిన సందర్భంగా అందరు నిలబడి కరతాళ ధ్వనులతో వారిని అబినందింపవలసినదిగా మనవి చేస్తున్నాము

ఈనాటి ప్రపంచం అజ్ఞానాందకారంలో నుండి విజ్ఞాన దుర్మదాందకారంలోక పరుగెడుతోందనే తపన బాద వీరిని మనందరిని వేదిస్తుంది ఈ అంశంపై కనువిప్పు సందేశం అందించబోతున్న సందర్భంగా వారికి సబాముఖంగా కృతజ్ఞత తెలుపుతూ సెలవు.

**రచన మరియు సమర్పణ డా॥ అమరవాది ప్రభాకరాచారి**

*తేది 4-11-2000* సర్జన్

*రాష్ట్ర ప్రబుత్వ వైద్యుల వార్షిక సబ ఉస్మానియ మెడికల్ కాలేజి*

*ఈ పరిచయ పత్రాన్ని విని ఎన్నో వేల సన్మానాలు చూసాను ఎన్నో ఎందల సన్మానాలు చేయించుకున్నాను కాని పరిచయ పత్రాన్ని కొత్త పందాలో ఇదె మొదటిసారి చేసి వినడం ఈ రోజు ఎద చిత్ర జరిగింది అని వ్యాఖ్యానించారు సి నా రె గారు*

*ఈ పదం తెలుగు నిఘంటువులో లేని పదం ఈరోజే పుట్టింది ఈ పదం అని వ్యాఖ్యానించారు సాహిత్య బ్రహ్మ డా॥ శ్రీ వి వి యల్ నరసింహారావు గారు*

*తెలుగు బాష తీయని బాష ఈ బాషకు అర్థం అనంతం ఈ బాషను రక్షించే వారిక. ఈ బాషపై సత్ ప్రయోగాలు చేసువారిక ఈ బాషను కలుషపరచకుండా జాగ్రత్త పడేవారిక అంకితం*

# 10 ఎయిడ్స్ వొడిలోకి

ఆమె పేరు లక్ష్మి వృత్తి కూలిపని భర్తకు కూడా కూలిపనే అతనికి కడుపులో నొప్పి వచ్చి నాలుగేళ్ళు ఎల్లలు లేరు దానిక బాధ లేదు కడుపులో నొప్పి విపరీతమైన బాధ దానికి తోడు జ్వరం అందుబాటులో ఉన్న డాక్టర్లు చూశారు ఎండొస్కోపు మూడు సార్లు చేశారు మందు లిస్తున్నారు ఆరు నెలలైనా తగ్గలేదు అటువైపు ఇటువైపు తల్లిదండ్రులు అసలు సమస్య తెలుసుకోవాలనుకున్నారు అందులో పిల్లలు లేకపోనందుకు పెద్ద సమస్య ఇరు వర్గాల వారు పూర్తిగా కూడా పదేపదే పడుతూనే ఉన్నారు ఏదైతేనేం? పట్నం డాక్టరును సంప్రదిద్దాం అని వచ్చారు

పాత రిపోర్టులు మందు చీటీలు అంతా చూశాడు డాక్టర్ కాని అదో ఆపరేషన్ కేసు జీర్ణకోశంలో పుండు ఆపరేషన్ తప్పదు అని చెప్పాడు సరే చేయమన్నారు తగు పరీక్షలు చేయించాడు కాని ఒక పరీక్ష తప్పకుండా చేయించాలి అదే ఎయిడ్స్ టెస్టు ప్రతి పేషెంటుకు తప్పని సరిగా చేయించాలి చేశారు ఇతనికి హైలీ రియాక్టివ్ అంటే ఎయిడ్స్ ఉధృత్తంగా ఉన్నట్లు నిర్ధారణ జరిగింది ఈ విషయం తల్లిదండ్రులకు అత్తమామలకు తెలపకూడదు గోప్యంగా ఉంచాలి అతని బార్య లక్ష్మికి కూడా ఎయిడ్స్ టెస్టు చేయాలి అందుకే పిలిపించమన్నాడు డాక్టర్ ఆవిడ కెందుకు టెస్టులు? అన్నారు. అనుమానం వ్యక్తం చేశాడు భర్త అయినా తప్పదని చెప్పాడు ఆమెకు కూడా ఎయిడ్స్ పాజిటివ్ అని తేలింది అంతటితో ఆపరేషన్ పక్కన పెట్టాల్సి వచ్చింది అదే ఆపరేషన్ ఖర్చుతో మందులు వాడండని చెప్పాడు ఆపరేషన్ చేసి కూడా లాభం అంతగా ఉండకపోవచ్చు అని చెప్పాడు వాళ్ళు కొద్ది కాలంలో కొద్ది మాసాలలో ఇద్దరు మరణిస్తారు అనే రహస్యాన్ని తెలుపకూడదు

అంతా విన్నారు అందరు ఇంటికి వెళ్ళాలని నిర్ణయించుకొన్నారు లక్ష్మి తల్లి లక్ష్మిని ఇంటికి రమ్మన్నది లక్ష్మి తల్లితో నేను ఇంటికి రాను అంది ఇద్దరం కలిసి ఇక్కడే ఓ దగ్గరుండి కూలిపని చేసుకుంటాం అన్నారు కాదు నీ నగలు తీసుకొని మనింటికి వచ్చేయ్ అంది లక్ష్మి తల్లి అత్తా భర్త ఏమనలేదు అయ్యో ఈ జబ్బు ఎలా వచ్చింది? అన్నారు డాక్టర్ ఇద్దరి వైపు చూశాడు ఇద్దరు తల వంచుకొన్నారు ఒక్కసారిగా

అమ్మా ఏనాడైతే నగలు పెట్టి నా పెళ్ళి చేశావో ఆరోజు నుండి నాపైన నీకు అధికారం పోయింది నా నగలపైన కూడా నీకు అధికారం లేదు నేను భర్తతోనే ఉంటాను కానీ అత్తగారింటికి కూడా పోను నేను ఆయన ఇక్కడే ఒక్కకాడ బ్రతుకుతాం మా అత్తగారింట్లో ఇంకా ముగ్గురు ఆడపిల్లలు పెండ్లీడుకున్నారు వాళ్ళకు అన్యాయం జరుగుతుంది అంది లక్ష్మి

అంతె ఉన్నాడు బర్త ఇక మా గురించి మర్చిపోండి ఉన్నారు బార్య బర్తలు మాకు ఈ జబ్బు ఎలా వచ్చిందని మళ్ళీ మళ్ళీ అడగవద్దు ఎవ్వరినీ అడగవద్దు ఉన్నారు బార్యాబర్తలు ఉదయం నుండి సాయంత్రం వరకు వాదోపవాదాలు అయినా తీర్మానం నిర్ణయం మాత్రం మారలేదు తల్లిదండ్రులు అత్తమామలు ఏడుస్తూ వాళ్ళ వాళ్ళ గ్రామాలకు వెళ్ళారు వాళ్ళవైపే చూస్తూ ఏడుస్తూ నిలబడ్డారు లక్ష్మి లక్ష్మ బర్త

అయ్యా డాకరు గారు మేము మా వంశం మా ముందు తరాల వారు ఈ తరం వారు అందరి వృత్తి కూలిపనే – కూలిపని ఎక్కడైనా ఉంటుంది రెక్కాడితే డొక్కాడుతుంది ఈ రోడ్డు ప్రక్కన ఉన్న గుడిసెల్లో ఓ గుడిస వేసుకుంటాం వాళ్ళతోనే ఉంటాం వాళ్ళతోనే కలిసిపోయి కూలి చేస్తాం అప్పుడప్పుడు మాత్రం మీ దగ్గరకొస్తాం మాకు సాయం చేయండి అంది లక్ష్మి మావాళ్ళు ఎవరైన వస్తే మా గురించి తెలవదని చెప్పమంది మా జబ్బు గురించి ఇంకెవ్వరికి గుడిస వాసులకు చెప్పకండి అంటూ అన్ని రిపోర్టులు డాకర్ ముందే రోడ్డు ప్రక్కన చింపి కాల్చి వెళ్ళారు కూలిజనంతో కలిసి అడ్డ మీదికి వెళ్ళిపోయారు డాకర్ వైపే చూస్తూ

ఓ మూడు మాసాల తరువాత లక్ష్మి వచ్చింది అయ్యా మా ఆయన లేస్తలేడు ఒకసారి వచ్చి సూస్తవా? అంది అంతే మరేమీ మాట్లాడకుండా గుడిసకు వెళ్ళాడు డాకర్ లక్ష్మి బర్త ఆఖరి నిమిషాల్లో కొట్టుమిట్టాడుతున్నాడు ఆసుపత్రికి తీసుకెళ్తానన్నాడు వద్దు ఇక్కడే ఏదైన వైద్యం చేయమంది ఓ గ్లూకోస్ గుడిస కొయ్యకు వేలాడ దీసి స్టార్టు చేశాడు తూట్లు పడ్డ పాత బస్తా ముక్కలతో 24 సంవత్సరాల చిన్న వయస్సు గల ఎముకల గూడు తన బర్తకు అతి జాగ్రత్తగా సేవ ఎందించింది అతని తలను తన ఒళ్లో బజ్జోపెట్టుకొని దీనంగా చూస్తుంది అతను చనిపోయాడని లక్ష్మికి తెలియదు మీ వాళ్ళకు తెలుపాలా అన్నాడు లక్ష్మి వద్దన్నది గుడిసవాసులకు తెలిపాడు అందరు వచ్చారు ఏదో సాయం చేశారు శవాన్ని తరిలించారు ఎవ్వరికీ వాళ్ల జబ్బు గురించి తెలియదు ఆఖరున గుడిసెలో లక్ష్మి మాత్రం ఒంటరిదైపోయింది తను కూడా ఎముకల గూడులాగా మారిపోయింది. కళ్ళలో ఏ ఆశలేదు కూలీ చేసే శక్తికూడా పోయింది ఏడవడానికి కూడా శక్తి లేదు అయినా ఏడ్వడానికి ప్రయత్నించింది నీరెండిపోయిన కళ్లతో

రోడ్డు ప్రక్కన పడుకొని అడుక్కుంటూ కనబడింది ఓరోజు లక్ష్మమ్మా ఎలా ఉన్నావని అడిగాడు దేవుడు ఎలుస్తున్నాడు అంది లక్ష్మి ఏ దేవుడు అన్నాడు ఇంకెవ్వరు? మా ఆయన అంది మా అయ్య అమ్మ అత్తమామలు అచ్చిండ్రా? అంది. ఆ వచ్చారు మీ గురించి అడిగారు తెలియదని చెప్పాను అన్నాడు డాక్టర్ దండం పెడ్తా ఉంది ఇంతలో ఎవరో ఎలుస్తునట్లు ఆ – ఆ వస్తున్నాను ఎందయ్యా అప్పుడే వస్తానంటే నువ్వుండాలే

# 11 చిప్ప

ఒకరోజు జూనియర్ నర్సరక క్లాసు తీసుకుంటున్నాను అందరు దాదాపు 17-18 సంవత్సరాల వయస్సు మధ్యలో ఉన్నారు అదే వాళ్ళక మొదటి క్లాసు ఎదో కొంత నీతి చెప్పాలి ముందు చూపుగా కొన్ని సలహాలు జీవితంలో మోసాలు ఎగుడు దిగుడు వ్యవహారాలు కొన్ని చెప్పాలి పర్సనల్ విషయాలలో తగు జాగ్రత్తలు ఎలా తీసుకోవాలో చెప్పాలి అలా చెబుతూ మనమందరం వచ్చేటప్పుడు ఎమి తెచ్చుకోలేదు వెళ్ళేటప్పుడు ఎమి తీసుకొనిపోము మన వృత్తే మానవ సేవ మానవ సేవయే మన వృత్తి రోగి ఒక దైవం ప్రతి నర్సు ఒక తల్లి వైద్య వృత్తిలో నర్సింగ్ వృత్తిలో చేరిన వారు అదృష్టవంతులు అని కొంత ఆధ్యాత్మిక బావాన్ని వల్లించాను ప్రగల్బాలు పలికాను

ఆఖరున మా నాన్న అమ్మలు మాకేమీ ఇవ్వలేదు వాళ్ళ అమ్మానాన్నలు వారికేమి ఇవ్వలేదు చిప్ప ఇచ్చి ఈ ప్రపంచములోకి నెటేసారు నన్ను కూడా అలాగే నా చేతికి చిప్ప ఇచ్చి వెళ్ళగొట్టారు ఆ తరువాత ఇలా కష్టపడి పైకొచ్చాం అంటూ నా గొప్ప కొంత చెప్పుకోసాగాను అలాగే మీరు అంటు ఎదో నీతి బోద చేస్తున్నాను అన్న గర్వంతో ఇంకా ఎదో చెప్పబోయే లోగా వెనుక బెంచి నుండ ఓ సన్న గొంతుతో మాకు కూడా అదే చిప్ప ఇవ్వండి అదే పదివేలు అందుకే వచ్చాం అంతే చాలు మాకు అంది అందరు గొల్లున నవ్వారు నేను నవ్వాను నవ్వి నివ్వెరపోయాను అప్పు డర్థమైంది నేనేం మాట్లాడానో గతాన్ని మరిచి పుర్వీకులను అగౌరవపరిచి పూర్తిగా బాధ్యత లెరుగక వాగినట్లనిపించింది ఇక ముందు కూడా నా పిల్లలు నన్ను నాలాగే నిందిస్తూ మాట్లాడుతారేమో! తప్పక మాట్లాడుతారనిపించింది ఇంటికి వచ్చిన తరువాత కూడా పదే పదే అదే ఆలోచన

౬0 సంవత్సరాల జీవింతంలో నడచిన నడకంతా అందకారంలోనే జరిగినట్లు అనిపించింది గ్రుడ్డిగా ప్రవర్తించినట్లు అనిపించింది ఆ ఒక మాటతో కనువిప్పు జరిగినట్లు అనిపించింది చిప్పలంటే దానిలో దాగి ఉన్న అంతరార్థం ఒక వైడ్స్పెక్ట్రం అంత చిన్నతనంలోనే అర్థం చేసుకొని సమయోచితంగా సమయస్ఫూర్తితో అనడం అభినందించలేకుండా ఉండలేకపోయాను చిప్ప అన్నది ఒక సంప్రదాయమని ఒక గౌరవమని వంశపారంపర్య గౌరవ మర్యాదలని ఒక తరం నుండి మరో తరానికి అదొక వారధి సంధి అని అప్పటిదాకా ఊహించుకోలేక పోయాను మమతలను కుటుంబ గౌరవాలను మట్టిలో కలిపి చిప్పగా చేసి గతాన్నంతా చిప్పరూపంలో ముందు తరానికి అందించే ఓ గొప్ప కానుక బారతీయ సంప్రదాయమైన చిప్ప గొప్ప చిప్ప అని ఇప్పుడే తెలిసింది

*అంకితం కుటుంబ సంప్రదాయాన్ని బారతీయ సంప్రదాయాన్ని కాపాడే వారికి, ఆచరించే వారికి, అనుసరించే వారికి*

# 12 మత కల్లోలం

కష్టమెరుగని వైద్యులారా కరుణకు ప్రతిరూపమైన వైద్య ఉద్యోగులారా కమ్మని కలలు నిజాలను చవిచూడబోయే బావి భారత వైద్య విద్యార్థులారా కలియుగ దేవతలారా ఉదికారులారా ఉనదికారులారా

డిసెంబర్ 1990 రెండవ వారం మత కల్లోలాలలో గాయపడ్డ వారికి మీరు ఉందించిన వైద్య సేవలు అతి ప్రశంసనీయం హైదరాబాద్ నగర వీదుల్లో రక్తం ప్రవహిస్తుంటే క్షతగాత్రుల శరీర నరనరాలలో రక్తాన్ని ప్రవహింపచేసి ప్రతి గుండెకు అండగా నిలిచి ప్రతి ప్రాణికి ప్రాణం పోసింది ఉస్మానియా ఆస్పత్రి సిబ్బంది – వైద్య సిబ్బంది

డైరెకరు అడిషనల్ డైరెకరు సూపరింటెండెంట్ ప్రిన్సిపాల్ RMO CMOలు సివిల్ సరన్‌లు అసిస్టెంట్ సరన్‌లు పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థినీ విద్యార్థులు హౌస్ సర్జనులు ఉస్మానియా మెడికల్ కాలేజి విద్యార్థులు నర్సులు నాల్గవ తరగతి సిబ్బంది ఆఫీసు సిబ్బంది Anaesthesia Surgical Medical విభాగాలు బాధ్యత నెరిగి అన్ని రోజులు అన్ని రాత్రులు శ్రమించి ప్రాణాలు రక్షించి శత్రువునైనా వృత్తిగా సమసమానత్వాన్ని చాటి శాంతి స్థాపనకు దేశ సమైక్యానికి పాటు పడింది ఆస్పత్రి ఆస్పత్రి సిబ్బంది ఆ మూడు రోజులు క్షత గాత్రులు రోగులే దైవ రూపాలుగా తలచి సేవలందించింది సిబ్బంది

కుల మత జాతి వర్గ విబేదాలకు ప్రభుత్వానికి రాజకీయాలకు వైద్యరంగానికే అంతుపటని రీతిలో ఊహించలేని స్థాయిలో వైద్యాన్నందించి చెదిరిన హృదయాలను ఆదుకొని ఊరడించి జాతీయ – అంతర్జాతీయంగా ఎన్నో విధాలుగా మెప్పు పొందింది ఆస్పత్రి సిబ్బంది మరెన్నో రకాల ఇబ్బందుల నెదురుకొని

ప్రతి హిందూ ఒక మహాత్మాగాంధీ కావాలని ప్రతి ముసాల్మాన్ ఒక ఆజాద్ అబ్దుల్ కలామ్ కావాలని సిక్కు-క్రైస్తవ-బౌద్ధ-జైనులు చిత్త శుద్ధులై మత సామరస్యానికి బద్ధులై మనోధైర్య సైర్యాలతో దేశాభివృద్ధికి అందరు పాటుపడాలని సంఘటిత వైద్య సేవలో చూపించగలిగింది ఉస్మానియా ఆస్పత్రి సిబ్బంది

ఆ రోజు ఆస్పత్రి సిబ్బంది అందించిన సేవలు సదా సర్వదా ఆదర్శప్రాయమై నిలిచి ముందు తరాలవారికి అందేటట్లుగా కుల-మత-జాతి-వర్గ శాంతి సామరస్యాన్ని తెలిపేటట్లుగా ప్రపంచ శాంతి నెలకొనేటట్లుగా శాంతి సంపూర్ణ సంఘటితత్వంతో రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖ ఆశీస్సులతో విద్యార్థినీ విద్యార్థుల కృషితో కాలేజి ఆస్పత్రి సిబ్బంది సంపూర్ణ శ్రమతో ఆనాటి సేవలకు నిదర్శనంగా ఆస్పత్రి ఆవరణలో ఒక మహత్తరమైన శిలా ఫలక స్తూపావిష్కరణ జరగాలని ఆశించింది

ప్రతి కంటి నీటిని తుడిచేద్దాం ప్రతి ప్రాణి హృదయంలో కలకాలం జీవిద్దాం

*అంకితం ఉస్మానియా వైద్యశాల ఆనాటి సిబ్బందికి*

*తేది (–1–1991 జాతీయ దినోత్సవం రోజు వేయి కరపత్రాలు పంచబడ్డాయి*

# 13 మహాత్ముడు చెప్పని రహస్యం

నేను 2వ సంవత్సరం యం బి బి యస్ చదువుతున్న రోజు లవి ఒక రోజు మా గ్రామం నుండి కొంత మంది పేషంట్లు హైదరాబాదుకు చూపించుకోవడానికి వస్తారని మా నాయన గారు వార్త పంపారు వారికి పరీక్ష చేయించి పంపించమని పురాన సత్రం దగ్గర సాయంత్రం 4 గంటల ప్రాంత్రంలో వేచి ఉన్నట్లైతే వారిని కలుసుకోవచ్చునని అన్నారు వారి కోసం సత్రం ముందు చెట్టు క్రింద కూర్చొని వారి రాక కొరకు ఎదిరి చూస్తున్నాను ఆ చెట్టు క్రిందే ఓ నాలుగు చక్రాల బండి బండి పైన అరటి పండ్లు అమ్మకానికి బండ ప్రక్కనే కూర్చున్న ఒక వృద్ధుడు ఆ పండ్లను అమ్మాలి తన బ్రతుకు తనే బ్రతకాలనే ధ్యేయంతో వాటిని రకరకాలుగా అమర్చాడు మంచివి అన్నింటిని ఒక ప్రక్క పెట్టాడు కొంచెం చెడిపోయిన అరటి పండ్లను మరో ప్రక్కపెట్టాడు ఇంకా చెడిపోయినవి మరో కుప్ప బాగా కుళ్ళినవి అదే బండిపైన అమ్మకానికి ఓ మూల అమర్చాడు ఆ వృద్ధుడు మురిగిపోయిన పండ్లపైన విపరీతమైన ఈగలు ముసిరి జిబ్బుమంటున్నాయి ఆ బండికి అంత దూరాన రోడ్డు ప్రక్కన ఒక మున్సిపల్ చెత్తకుండి ఆ కుండ ప్రక్కన పుట్‌పాత్ వెంట మురికి నీరు ప్రవహిస్తుంది ఓ చిన్న కాలువలా గ్రామం నుండి పేషంట్లు రావడం ఆలస్యం అయ్యింది అలాగే చెట్టుక్రింద కూర్చొని ఆలోచిస్తూ అటు ఇటు చూస్తున్నాను ఇంతలో

ఓ వృద్ధుడు బండి దగ్గరకు వచ్చాడు చేతి కర్రసహాయంతో అతి కష్టంగా బేరమాడి అతి తక్కువ దరకు ఆ మురిగి ఈగలు ముసురుతున్న అరటిపండ్లను బిక్షమెత్తి సంపాదించిన ఐదు పైసలకు కొన్నాడు నల్లగా చీకిపోయిన అరటి తొక్కలను ప్రక్కనే వేసి మురిగిన అరటి పండ్ల గుజ్జును ఆత్రంగా తినేసి చేతిని నాకుతు బుజానికి వేలాడుతున్న మూటను అతి కష్టంగా మోస్తు ఇంకా ఎదో చేయాల్సి ఉంది అన్నట్లుగా వేగంగా వెళ్ళలేక వెళ్ళిపోయాడు

అంత దూరాన చెట్టుక్రింద కూర్చున మరో వృద్ధురాలు వంగిపోయిన నడుము కాయలుకాచిన కళ్లు పండిపోయిన జుట్టు కాలం తీరిన ఒళ్ళు నడవలేని కాళ్ళతో నేలపై దేకుతూ ఆ మురిగిన అరటి తొక్కలవైపు వాటి కొరకే వస్తున్న మేకతో పోటిపడి బండి దగ్గరకు వచ్చి ఆ అరటి తొక్కలను ఒక్కసారిగా వశం చేసుకుంది ఒక్కొక్క అరటి తొక్కను జాగ్రత్తగా తన నోట్లో ఎట్టుకొని తొక్క లోపటి బాగాన్ని గీక్కొని తిని వట్టి తొక్కలను వదిలివేసి నేలపైన దేకుతూ సుదీర్ఘ ప్రయాణంలో మునిగింది ఆ మేక నిరాశతో కుండివైపు వెళ్ళింది.

ఇంతలో బట్టలు లేని ఒక భారతీయుడు ఎచ్చి చూపులతో అంబరమే అంగ వస్త్రాలుగా ఎండిన డొక్క ఎముకల గూడు దిగంబరుడు గీకి చీకి వేసిన అరటి తొక్కల

వైపు తెగ ఆకలితొ రాసాగాడు ఆతని నడక ప్రయత్నం ఓలింపిక్స్ లో గోల్డు మెడల్ కొరకు పరుగు పందెంలాగ కొనసాగింది ఆతని ఆకలి చూపు మాత్రం ఆ చీకేసిన తొక్కలపైనె కేంద్రీకృతమై ఉంది - జాతిపిత మహాత్మాగాంధి నిరాహార దీక్ష దృష్టి దేశ స్వాతంత్ర్యంపైనే ఉన్నట్లుగా ఎదైతేనేమి మరొక మేక ఆ తొక్కలను అందుకోక ముందె వాటిని కైవసం చేసుకున్నాడు ఎన్నాళ్ల గానో ఆకలి గొన్నట్లున్నాడు చీకేసి నాకేసి పళ్ళతో గీకేసిన మురిగిన నల్లటి అరటి తొక్కలను అమాంతం పకపక నములుతు మింగేశాడు అన్ని తినేశాడు మళ్ళి వెనక్కి తిరిగి వెళ్ళుతూ ఆ రోడ్డు ప్రక్కనే పారుతున్న మురుగు కాల్వలోని నీటిని నోటితో జంతువు త్రాగినట్లుగా త్రాగ వేసి ఆ నగ్న వీరుడు బలం పుంజుకొని ఓ విప్లవ వీరునిలా ఓ ఉగ్రవాదిలా నిజమైన బారతీయునిలా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు చెత్తకుండి ప్రక్కగా జనారణ్యంలోకి ఆ చెత్తకుండి దగ్గర అప్పుడె పారవేసిన ఇస్తారాకులలో మెతుకులు ఏరుతూ ఆకులను చేతులను నాకుతు కనిపించారు కొంతమంది ఎల్లు కుక్కలు పందులు కాకులు మేకలు పశువులు వారితొ సహపంక్తి బోజనం చేస్తు నిజమైన ప్రజాస్వామ్యాన్ని సమానత్వాన్ని కాపాడడానికి కంకణం కట్టుకొన్నట్లు కృషి చేస్తున్నట్లు కనిపించసాగాయి అప్పటి నుండి ఇప్పటి వరకు కూడా రోజూ అక్కడక్కడ ఇవే దృశ్యాలు కనిపిస్తున్నాయి బారతీయులు అందరు కలిసి సహపంక్తిలో సంతోషంగా తినే రోజు ఎలా ఎప్పుడొస్తుందో ఆ రహస్యం చెప్పవా? మహాత్మా స్వాతంత్ర్యం సంపాదించే రహస్యాన్ని చూపావేగాని స్వాతంత్ర్యంలో సమానత్వం అనే రహస్యాన్ని తెలపడానికి నీవు మరోసారి జన్మించావా? అంత వరకు మేము ఇలా కొట్టుకొని చావాలా?

అంకితం సమసమాన సమాజ స్థాపనకు కృషి చేసువారికి

## 14 ఓ జాతిపిత

ప్రపంచంలో చాలా పెద్ద ప్రజాస్వామ్య దేశం శాంతి సందేశం మన బారత దేశం మన పందాలో నడవడానికి ప్రపంచ దేశాలే పరవళ్ళు తొక్కుతున్నాయి ఉవ్విళ్ళూరుతున్నాయి గాంది పుట్టిన మన దేశంలో ప్రస్తుతం జరుగుతున్నదేమిటి? మనం చూస్తున్నదేమిటి? మనం చేయవలసిందేమిటి?

ప్రపంచ దేశాలకే ఆదర్శమూర్తివైన నీవు ఓ మహాత్మా మా ఆత్మలు అతలాకుతలం పోతున్నాయి ఓ జాతిపితా మానవ జాతినే మంట కలప చూస్తున్నాం ఓ ఒంటి వస్త్రదారి మా ఆరాచకాలు మిన్నంటిపోతున్నాయి ఓ శాకాహారి మా ఈ జీవకోటి కాలుష్యంలో హరించుకుపోతుంది ఓ ఆయుదం లేని మహాయోదుడా నీ దేశంలో మారణాయుదాలు విలయతాండవం చేస్తున్నాయి తుపాకి తూటాలు నాటు బాంబులు రిమోట్ బాంబులు

ఎగిరెగిరి పడుతున్నాయి నీకు కోపం వస్తే నిరహార దీక్షకే చేశావు మాకు కోపం వస్తే ఎదుటి వారి మానాలు దోచేసి ప్రాణాలు తీసేస్తున్నాం ఎందుకీ మార్పు ఓ అహింసావాది మాకో ఎందుకీ హింసా ప్రవృత్తి? భూస్థాపితమైన ముప్పది కోట్ల నీ ఆనాటి జనం నుండే ఈనాటి ఈ వంద కోట్ల జనం మేము పుట్టాం మాకో ఎందుక దురాగతం దురాలోచన ఈ స్వాతంత్ర్యాన్ని దక్కించుకోగలమా? అన్న అనుమానం

పోతూనే పొడుచుకుంటున్నాం నడుస్తూనే నరికేసుకుంటున్నాం కుల మత జాతి వర్గ వర్ణ బాషా విబేదాలకు వైషమ్యాలకు కొదవేలేదు పర్యాలకు అంతే లేదు చదువుకు సభ్యతకు సంస్కారానికి సంబంధమే లేదు కుల పాలనకు మత పర్గణలకు అడ్డులేదు స్వార్థ రాజకీయాలతో కూడన సమ్మెలకు బంద్‌లకు నిరాహార దీక్షలకు అంతులేదు అర్థం లేదు విలువే లేదు జండాల అండతో గూండాయిజం పేట్రేగిపోయింది గూండాల అండలో రంగు వెలసిన జండాలు బిక్కుబిక్కుమంటున్నాయి మసీదు కో పార్టీ మందిరాని కో పార్టీ మనిషి కో పార్టీ మాటకో పార్టీ పూట కో పార్టీ రకరకాల రంగు రంగుల పార్టీలు వెలసి రాం రహీంను విడదీస్తున్నాయి రక్తపాతాన్ని సృష్టిస్తున్నాయి కర్ఫ్యూల రూపంతో కరువులు చూపిస్తున్నాయి నవ యువతరాన్ని విద్యార్థి లోకాన్ని నిర్వీర్యం చేస్తున్నాయి బారత బావి తరాన్ని ఎడ దారికి నెట్టేస్తున్నాయి విచ్చిన్న శక్తులను పుట్టిస్తున్నాయి మేదావులు విదేశాల పాలవుతున్నారు ఇక పేదల మాట దేవుడెరుగు? విద్యావంతులు అదోగతి పాలవుతున్నారు వీదుల పాలవుతున్నారు శాంతి అహింస స్వాతంత్ర్యాలు సమాది కాక ముందే మేము నిస్సహాయతతో నీవు ఎటు నుండి వచ్చి ఎటువైపు వెళ్లావో మళ్ళీ ఎవైపు నుండో వస్తావోనని మా వైపే రావాలని వెఱ్ఱిగా ఎదిరి చూస్తున్నాం పిరిక వాళ్ళం మరియు మురికి వాళ్ళం మాత్రం కాము

తెల్లవాని గుండెల్లో ఎకు మేకు బాకు వాకువైన నీవు మా దేశంలోనే పుట్టు ప్రతి రోజూ పుట్టు ప్రతి నిమిషం పుట్టు ప్రతి క్షణం పుట్టు ప్రతి నరం నుండి ప్రతి కణం నుండి ప్రతి హృదయం నుండి చెట్టు – గాలి – నీరు ప్రతి ప్రాణి నుండి మళ్ళీ మళ్లీ పుట్టు పుడుతూనే ఉండు మళ్ళీ మరణించకు ఓ మహాత్మా మరణించకు ఓ జాతిపితా నశించకు ఓ మహాత్మా మమ్ము రక్షించు మమ్ము రక్షించు శాంతిని పరిరక్షించు

*అంకితం శాంతికాముకులకు*
*1990 డిసెంబర్ పాతనగరంలో మత కల్లోలం షా–ఇనాయత్ గంజ్ పోలీస్ స్టేషన్ పరిదిలో*
*శాంతి సంఘాన్ని స్థాపించి 30 రోజులు రాత్రి ఎట్రోలింగ్ చేసి*
*వేయి కరపత్రాలు ముద్రించి పంచిపెట్టడం జరిగింది*

# 15 పిల్లి - పులి అయిన వేళ

యాడయే యాడియో ఉంటూ ఆడ-మగ కొంత మంది లంబాడులు ఒక నులక మంచంపై ఒక మనిషిని వేసుకొని ఏడ్చుకుంటు మొత్తుకుంటు పరుగెత్తుకుంటు మా యింటివైపు వస్తున్నారు వారిని చూసి వెంటనే వెళ్ళి చూశాను మంచంపై ఉన్న వ్యక్తిని పరీక్ష చేశాను మెడ గొంతు దగ్గర పళ్ళు దిగిన గుర్తులు ఉన్నాయి మనిషి మరణించి ఉన్నాడు మరణించి ఓ నాలుగు గంటలకుపైనే అయ్యి ఉంటుంది వెంటనే మరణించాడని చెప్పలేదు విషయం ఏమిటో తెలుసుకోవాలని అసలు ఏమి జరిగిందని అడిగాను అందరు కలిసి ఇలా చెప్పసాగారు

"సూడ అయ్యా ! ఎమైయింది అంటే ఈడు ఈని ఎండ్లాం ఒక గుడిస్ల ఉంటుండ్రయ్యా దానికి ఒక్కటే తల్పు ఇంట్ల పని జేసి ఇద్దరు పనికి పోతర్ ఒక ఎల్లి రోజు అ ఇంట్ల జొరపడతది ఈల్లు పోయినంకా వండుకున్నదంత తింటది ఇంకా వెళ్ళిపోతది ఇట్ల నెలా రోజులుంచి సతాయించుతుంది ఈ ఎల్లి దీన్ని ఎట్లనైనా పట్టాల - కొట్టాల - సంపాల అని మా రామ్యాగాడు పట్టుబట్టిండు - ఇంక కాప్లా కాసిండు మెము గూడ కాప్లా గాసినై ఎల్లి రానే వచ్చింది గుడిసెల జొరబడింది అంతే ! మా వాడు దాని వెనుకాల గుడిసెల దూరిండు తలుపు ఎట్కొండు ఇగ కొట్టిండు ఎల్లిని అది అరస్త బోయింది ఈడు కొడ్తాబోయిండు - ఈడు కొడ్తాబోయిండు అది అర్స్తబోయింది మేము బయట ఉండ కొట్టు బాగా కొట్టు సావకొట్టు ఎల్లిని అని మేము అరవబట్టినం ఎల్లి అర్సి అర్సి ఒక్కసారిగా అగిపోయింది - ఎల్లి జచ్చింది అని ఒక్కొక్కరం ఇంగా అక్కడ్నుంచి వెల్లిపోయినై అరె రామ్యా ఎల్లిని దీస్కురారా అన్నాం వాని కొరకు ఎదురు చూస్తున్నాం - ఎంతకు గుడిసె తల్పు తెర్సుకోదు రామ్యా గాడు బయట రాడు గంట అయ్యింది రెండు గంట అయ్యింది వాడు రాడు బయట మాకు బయమైంది రామ్యా అని ఎల్సినై చప్పుడు లేదు అయ్యా సడి లేదు అయ్యా ఇంక లాబం లేదు అని తల్పు పగులా గొట్టినం లోపల జూస్తే - రామ్యా గాడు సందపడి రగతంలో తడిసి పడి ఉండు ఎల్లి పులిలాగా ఎదురుగా కూసుంది వాని తల కాడ మమ్మల్ని జూసి ఎద్దగా అర్సింది పిల్లి దాన్ని జూసి బయపడి అందరం బయటకు పారిపోయినై అది ఎల్లి గుడిసెల నుండి బయటకు దూకి జొన్న సెన్లా వెళ్లిపోయింది దాని వెంట బడ్డాం - అంత అడవి - అడవిల గుట్టల్ల పోయింది మేము మా రామ్యా గాన్ని ఎలిస్తే కదలడు పలుకడు ఇగ మంచంల ఏసుకొని ఇక్కడ వచ్చినామయ్యా - ఎమైంది జెప్పు అయ్యా జెప్పు అయ్యా అన్నారు లంబాడీలు

రామ్యాను ఎల్లి జంపేసింది అన్నాను వాడు చచ్చిపోయి మూడు నాలుగు గంటలు ఉయ్యింది అన్నాను అందరు గొల్లు మన్నారు గిట్లా ఎట్లా అయ్యిందయ్యా ఉన్నారు ఎల్లి ఎక్కడున్న మనిసిని సంపుతదా ? అంటూ ఎల్లి దిరుగబడింది ఎల్లి కాడ దిరుగబడితే మనిస జస్తడు గట్లానే మన రామ్యాగాడు సచ్చిండు యాడయే యాడయే అంటు శవాన్ని తీసుకొని వెళ్ళిపోయారు

జంతువుకు తిండి తినే హక్కు ఉంటుంది దాచుకునె హక్కు ఉండదు ఒకవేళ తిండిని దాచి పెట్టినట్లయితే తిండ ఎక్కడ ఉంటుందో జంతువు ఉక్కడికి చేరుకుంటుంది కడుపు నిండా తింటుంది మిగిలింది వదిలివేసి వెళ్ళి పోతుంది మళ్ళి ఆకలైనప్పుడే తినడానికి బయలుదేరుతుంది వాట ప్రాణాలను విసిగించే వాళ్ళను ఎదురుపడ్డవాళ్ళను ఎదిరిస్తుంది కాకపోతే తిరుగబడుతుంది చంపేస్తుంది లేదా చస్తుంది అదే ఎల్లి ఇక్కడ పులిగా మారింది ఎ ప్రాణినైనా వాంసిస్తే నోటి దగ్గర తిండని దాచి వేస్తే దాని హక్కులను కాలరాచి వేస్తే ఇంతే జరుగుతుంది అని తెలిపింది ఈ ఎల్లి 1968లో మా వూళ్ళో ఇది నేను ఆనాడు నా కళ్ళారా చూసిన నిజం – ఇప్పుడు ప్రతిచోటా కనిపిస్తుంది ఇదే వాతావరణం – ఇదే విదానం – దొరతనానికి అంతం ప్రజాస్వామ్యంలో ఇంకా మిగిలి ఉన్న ఎత్తం దొరి విదానానికి బూర్జువ విదానాలకు తిరుగుబాటు

*అంకితం హక్కుల కొరకు పోరాడే వారికి*

# 16 తృప్తి

దూరపు బందువు – గొప్ప శిల్పి – ఎరాయినైనా సునాయాసంగా గొప్ప కళాఖండాలుగా చెక్కగలిసే శక్తి సామర్థ్యం – దేని మీది ఆశ లేదు – ఎంత తక్కువకైన ఉమ్మివేస్తాడు – ఉన్న చాలా కొద్ది ఆస్తి హరించుక పోయింది ఒక ఉర ఎకరం తప్ప – అందులో అన్ని తాడి చెట్లే అది మాత్రం ఎందుకు ఉంచాడో ఉర్థం కాలేదు తను ఉండే ఇల్లు ఒక పూరి గుడిసె – చుట్టు ముళ్ళ కంప ప్రహరీ దానికి ఒక ద్వారం కాని తలుపులు లేవు – గుడిసె పక్కన ఒక చింతచెట్టు చెట్టు కింద కుక్కిమంచం మంచంలో ఆ శిల్పి – ఆ శిల్పికి పక్షవాతం కాళ్ళీడ్చుకుంటు కర్ర సహాయంతో గుడిసెలోకి వెళ్ళుతాడు మాట కూడ పడిపోయింది తన వృద్దురాలైన బార్యకే అర్థమౌతుంది అయిన బాష వాద ఇద్దరు ఎన్న వయస్కులైన కుమారులు ఎక్కడికో వెళ్లి నాలుగు రోజులకొక్కసారి ఇంటికి వస్తారు ఎదో తెస్తారు తల్లికి ఇస్తారు – తల్లి కూలీకి వెళ్లి రోజు ఎదో తెస్తుంది వారు నలుగురు అం[illegible]

ఆప్తుం ఎమి ఎవరిని అడగరు ఇస్తె తీసుకోరు సంతోషంగా బ్రతుకుతున్నాం అంటారు
సంతృప్తకరంగా ఉంది ఉంటారు ఉందరితో కలిసిపోయి అందరితో నవ్వుతూ ఆప్యాయంగా మాట్లాడుతారు - ఇంటికి వెళ్ళితే మంచినీళ్ళు ఇస్తారు గుడిసెలో ఎ వస్తువులు ఉండవు ఉన్నట్లు కనిపించవు నీ కోరిక ఎమిటి అని అడిగితే అది అంటే ఏమిటి అంటాడు - జీవితం సంతోషంగా గడచింది ఇప్పుడు కూడ సంతోషంగానే నడుస్తుంది అంటాడు - ఎమీ కోరిక లేదు అంటాడు - మళ్ళీకూడ ఎదో కోరిక ఉంటుంది కదా ! చివరి కోరిక అది చెప్పు అంటే నా మరణాంతరం నా అంత్యక్రియలకు వచ్చేవారు నా బార్య పిల్లలు శ్మశానానికి వచ్చేవారు నవ్వుతు రావాలి నిష్కల్మషమైన మనస్సుతో చిరునవ్వులతో నన్ను ఖననం వేయడం ఉదే నా అఖరు కోరిక అంటాడు అది ఎలా సాధ్యం ? కొందరైనా ఎడుస్తారు కదా? తప్పకుండా అన్నాను - ఉదే నేనూ ఆలోచిస్తున్నాను అన్నాడు - నేను మరణించి కూడా అందర్ని నవ్వించాలి - ఆలోచించాను కూడా అన్నాడు - ఆయన బార్య ఆయన పక్షవాతపు బాషను తర్జుమా చేసి చెప్పింది

ఆ తర్వాత కొద్ది రోజులకే ఆయన మరణ వార్త - ఉందరు వెళ్ళారు నేను వెళ్ళాను ఓ వంద కలో మీటర్లు ఆయనను చూడటానికి అనుకున్నట్టుగానే ఎడ్వ సాగారు - అంతిమ యాత్రకు ఎద్ధం చేస్తున్నారు బట్టలు తీసి కొత్త దోవతి కట్టాలి చిరిగినషర్టు తీసారు జేబులన్ని వెతికారు అందులో ఒక కాగితం ఉంది అందులో ఇలా వ్రాసి ఉంది నా జేబులో రెండు పొట్లాలు ఉన్నాయి ఒకటి రెండు అని గుర్తులు ఎటినాను - నన్ను పాడెపై పెట్టిన తర్వాత ఒకటవ పొట్లం విప్పమని ఉంది శ్మశానానికి వెళ్ళిన తర్వాత రెండవ పొట్లం విప్పి చదవండి అని ఉంది అందరికి చూపించి అందరికి వినిపించమని వ్రాసి ఉంది అదే మాదిరిగా చేశారు ఒకటవపొట్లం విప్పి చూసి అందరు నవ్వ సాగారు బార్యకి చూపించారు ఎడుస్తున్న బార్య కూడ నవ్వసాగింది అందరి నవ్వులకు కారణం ఆ కవరులో ఉన్న ఒక పోటో ఆ పోటో వెనుకాల నా అబిమాన అందాల తార అని వ్రాసి ఉంది ఆ పోటో అందాల ఎనీతార రమ్యక్రిష్ణ ది శత వృద్దుడు రమ్యక్రిష్ణ అబిమాని అని నవ్వుకుంటు అనుకుంటు పాడె వెంట శ్మశానాకి వెళ్ళారు రావద్దనుకున్న కొంత మంది కూడా వచ్చారు రెండవ పొట్లంలో ఎమి ఉందో చూద్దామని దాదాపు ఊరు మొత్తం కదిలింది అందరు శ్మశానానికి చేరుకున్నారు దింపుడు కల్లం దగ్గర రెండవ పొట్లం విప్పారు అందులో ఒక పోటో ఉంది అది చూసి అందరు నవ్వడం ఆపేసి ఒక్కసారిగా నిశ్శబ్దం పాటించారు ఆయన పాదాలకు నమస్కరించారు ఆ పోటోను ఆయన తల దగర ఉంచి అందరు కలిసి రెండు దేశ బక్తి గీతాలు చదివి ఆ పెట్ల మద్య ఆయన శవాన్ని ఖననం చేసి మళ్ళీ నవ్వలేక గద్గద స్వరాలతో తిరుగు ముఖం పటారు ఆ పోటో ఎవరిదో కాదు అది జాతిపిత మహాత్మగాంది పోటో ఆ పోటో వెనుకాల తన బార్య పోటో అతికించి ఉంది దాని క్రింద ఇలా వ్రాసి ఉంది

భారత స్వాతంత్ర్యం కంటే ముందు ఎంత భయంకరంగా జీవించానో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత అంత స్వేచ్ఛతో జీవించాను ఆ మహాత్ముని పాదాలకు నమస్కారం నేను పోషించవలసిన నా భార్య కూలీ చేసి నన్ను తిట్టికొట్టి తిండి పెట్టి తినిపించి కన్న తల్లి కంటే ఎక్కువగా నన్ను కాపాడింది మరో జన్మంటు ఉంటే ఆమె కడుపులోనే పుట్టి ఆవిడకు సేవలు చేసి ఆవిడ ఋణం తీర్చుకుంటాను - నాతో సహ జీవనం గడిపి నాతో ఇద్దరు బిడ్డలను కని నా అంతిమ క్రియలు జరిపిన నా భార్య పాదాలకు నమస్కారం అని ఉంది అందరూ అది చదివి తమకు తెలియకుండానే లోలోన జాతీయ గీతం పాడుతూ ఇల్లు చేరుకున్నారు - మళ్లీ మళ్లీ వెనక్కి తిరిగి శ్మశానాన్ని చూస్తూ

*అంకితం అత్యాశ లేని వారికి సంతృప్తి స్వాతంత్ర్యం కోరుకునేవారికి మాత్రమే*

# 17 సలీం భయ్యా

ఓ పది మంది పిల్లలు మధ్య వయస్సున్న ఓ పురుషుడు కలిసి ట్రాలి నెట్టుకుంటు ఎమర్జెన్సీ వార్డుకు రాసాగారు ట్రాలిపైన ఓ మధ్య వయస్సు స్త్రీ విపరీతంగా బాదపడుతు మెలికలు తిరిగిపోతుంది వెంటనే రోగ నిర్దారణ చేసి ఎమర్జెన్సీ ఆపరేషన్ చేయాలని చెప్పాం వెంటనే వారు అల్లాను ప్రార్థించి జో కర్నా హై కరో హమారి అమ్మికొ బచావో అన్నారు పిల్లలు కొంత రక్తం కావాలన్నాను ఇంకా ఎవరైనా ఉంటే ఎలువమని అన్నాను వారిని రక్తం ఇవ్వమని అన్నాను హమ్ ఛ్చా జిత్తా ఖూన్ హోనా ఛ్చా ఉత్న ఖూన్ లేలో అన్నారు ఔర్ తో కుచ్ నహి హైనా? అన్నారు వారి బీద పరిస్థితి చూసి బ్లడ్ బ్యాంకు నుండి బ్లడ్ తెప్పించి ఆపరేషన్ చేశాం ఆ తర్వాత ఓ నెల రోజుల పాటు ఆసుపత్రిలోనే తిండి తిప్పలు మందులు అందజేసి బ్రతికించి చేయవలసిన సహాయం చేసి డిచ్చార్జి చేశాం ఆప్ కా మెహర్బాని బౌత్ బౌత్ శుక్రీయా - ఆప్ కా బచ్చోంకో అల్లా అచ్చా రఖేగా అంటూ వెళ్లిపోయారు

ఆ తర్వాత ఓ నాలుగు నెలల పాటు వారు కనిపించ లేదు ఓ రోజు సాయంత్రం ఇద్దరు పిల్లలు ఆ స్త్రీ ఆవిడ భర్త వెతుక్కుంటు మా ఇంటికి వచ్చారు నేను పూర్తిగా మరిచి పోయాను గుర్తించలేదు వారి విషయం తెలియచెప్పుకున్నారు మంచిది మందులేమైన కావాలా అన్నాను నహీ హమ్ ఆయా హై ఐసీ ఆప్కో బులానే అన్నారు ఎక్కడికి అన్నాను హమారే ఘర్‌కో అన్నారు కల్ రంజాన్ హైనా ఆప్ హమారే మెహమాన్ హై అంటూ మరీ మరీ ప్రాదేయ పడ్డారు డాకరమ్మకోబి లేఖే అనా హై అన్నారు అడ్రసు చెప్పారు కల్ శ్యామ్‌కో చార్ బజే పలాన బస్ స్టాప్ ఛ్చానా వాహపే ఖడే హోనా హమ్

ఆకే చేకేజాయేంగే అని అన్నారు సరే అన్నాను ఓల్డ్ ఎటి కొత్త అందుకే ఒక్కణ్ణి వెళ్ళాను
బస్ షాప్ దగ్గర నిలబడ్డాను ఆ ఇద్దరు పిల్లలు వచ్చారు నన్ను వెంట తీసుకొని వెళ్ళసాగారు
అంతా గల్లీలు సందులు తిరుగుతూ తిరుగుతూ అఖరుగా ఓ శ్మశానాన్ని చేరుకొన్నాం
ఆ శ్మశానంలో కొన్ని గుడిసెలు ఆ గుడిసెల్లో వీరిది ఒక గుడిసె అందులో సలీం బయ్యా
అతని బార్య మా కొరకు ఎదురు చూస్తున్నారు నన్ను చూడగానే నమస్కరించి మిగితా
వాళ్ళు ఎందుకు రాలేదని ప్రశ్నించాడు వీలు పడలేదని చెప్పాను ఇంతలో సలీం బార్య
మిగతా ఎనిమిది మంది పిల్లలు బయటక పరగెత్తుకుంటు వచ్చారు డాక్టర్ సాబ్ ఆయా
హై అంటూ ఎంతో ఆప్యాయత చూపారు వారి గుడిసె చూడగానే మేము చిన్ననాడు ఉన్న
మా గుడిసె జ్ఞాపకం వచ్చింది అంత కంటే బయంకరంగా ఉండేది ఆనాటి అప్యాయతలు
జ్ఞాపకం వచ్చాయి గుడిసెకు తలుపుగా ఉన్న తట్టును తొలగించి నన్ను గుడిసెలోకి వంగి
రమ్మన్నారు లోనికి వెళ్ళాను ఒక బెడ్‌షీటు వేసి వుంది కూర్చోమన్నారు రంజాన్ వంటకాలు
అన్నీ ముందు పెట్టారు యే సబ్ ఆప్ ఖావో అన్నారు ఇదంతా తినలేను అన్నాను కుచ్ తోబి
ఖావో అన్నారు మగర్ ఆప్ ఖానా హై అన్నారు నేను తినేంత వరకు వారందరు తినకుండ
నిల్చోని ఉన్నారు తిన్న తర్వాత యేతో ఖానా హై ఎర్ బోల్నా హై ఇస్కో కహతే హై షీర్‌ఖుర్మ
అన్నారు తిన్నాను బ్రహ్మాండంగా చెప్పలేనంత రుచిగా ఉంది కప్పు ఖాలి చేసి ఇంకా
కావాలంటు చూశాను మరో కప్పు ఇచ్చారు తిన్నాను ఇక చాలు అన్నాను ఇంకా
తినబుద్దేస్తున్నా

అప్పటి నుండి ప్రతి సంవత్సరం రంజాన్ రోజు ఒక క్యాన్ నిండా షీర్‌ఖుర్మ
తేవడం మేము మా పిల్లలు అందరం ఆ మదురమైన షీర్‌ఖుర్మాను తిని సలీం బయ్యా
మదుర స్మృతిగా వారి పిల్లలు కూడా ఓ రంజాన్ పండుగగా రంజాన్ పండుగే వారి
కుటుంబంగా మా హృదయాలలో నిలిచిపోయారు ఓ రోజు సలీం బయ్యను ట్రాలిపైన
వేసుకొని బార్య పిల్లలు ఆదర బాదరాగా ట్రాలిని నెట్టుకుంటు ఎమర్జెన్సీ వార్డు వైపు
పరగెత్తుకుంటు రాసాగారు డాక్టర్ చాచా బాబా కైసేకి కర్ రహాహై ఉన్నా దమ్ గుట్
రహాహై బాత్ కర్నా నహీ ఆరా – హమారీ అమ్మకో ఆప్ వా బచాయా బాబాకో బచావో
అంటూ చెప్తుతూ ఏడ్వ సాగారు

నిజంగా సలీం బయ్యా సీరియస్‌గా ఉన్నాడు బాగుకాని సేజీలో ఊపిరితిత్తుల
జబ్బు అందులో గుండె పని చేయడం లేదు అఖరు నిమిషాలతో పోరాడుతున్నాడు
ఏమి చేసినా లాబం లేకపోయింది సలీం బయ్యా కాలగర్భంలో కలిసిపోయాడు అల్లా
దగ్గరికి వెళ్లిపోయాడు అందరు యాల్లు మన్నారు నాకు ఏడ్వాలనిపించింది ఎందుకో

విషయం మీకు అర్ధమై ఉంటుంది మా ఎల్లలకు చెప్పాపె కాని ఓ గుడుసె శ్మానం ప్రక్కన జీవిస్తూ అప్యాయతను పంచె నా మిత్రుడు సలీం నా చేతుల మీదే పోవడం చాలా బాదాకరంగా తోచింది ఈ విషయం విన్న నా బార్య ఎల్లలు ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ ఈ సంవత్సరం మన ఇంట్లో రంజాన్ పండుగ లేదు కదా డాడీ అన్నారు ఈ సంవత్సరమే కాదు ఇక ముందు కూడా మన ఇంట్లో రంజాన్ పండుగ ఉండదేమో అంది మా ఆవిడ రంజాన్ పండుగ ఉంటుంది కాని సలీం బయ్యా రాడు కాబోలు అన్నాను

రంజాన్ పండగ రానే వచ్చింది ఇంట్లో సలీం బయ్యా గురించి జ్ఞాపకం చేసుకున్నాం ఎమి చేయాలో అర్ధం కాలేదు ఎక్కడైనా షీర్‌ఖుర్మ దొరుకుతుందేమో నని పాత పట్టణం అంతా కొనాలని అన్ని హోటల్లో వెతికాం అన్ని రకాల రంజాన్ వంటలు ఉన్నాయి అలీమ్ బిర్యాని కబాబ్ కుర్మ పాయ అంటూ ఎమోమో వంటకాలు ఉన్నాయి షిర్‌ఖుర్మ మాత్రం లబించలేదు అది దొరికితే సలీం బయ్యా దొరికనట్లే మేము అందరం రంజాన్ పండగ చేసుకున్నట్లే అయినా షీర్‌ఖుర్మ లబించలేదు నేను మా ఆవిడ మా ఎల్లలు ఎదో పోగోట్టుకున్న వాళ్ళలా సాయంత్రం అందరం కూర్చోని బోజనం చేస్తున్నాం ఇంతలో

టక్ టక్ మంటూ దర్వాజ చప్పుడు అయ్యింది కోన్ హై? అంది మా అమ్మాయి సలీం బయ్యా అంటూ ఓ చిన్నవాని గొంతు వినపడింది చాలా మదురమైన చాలా చిన్న ఎల్లవాని గొంతు తలుపు దగ్గరకు అందరూ మా ఎల్లలు పరుగెత్తారు తలుపు తీసారు అక్కడ ఓ చిన్న బాబు వాడ చేతిలో ఓ క్యాన్ అదే ఆ షీర్‌ఖుర్మ క్యాన్ ప్రతి సంవత్సరం మా ఇంటికి వచ్చే సలీం బయ్యా తెచ్చే షీర్‌ఖుర్మ క్యాన్ మై చోటా సలీం హు దాదిమా దీయానా మేరా దాదా బడా సలీం అల్లాకే పాస్ గయానా దాదిమా వహి నామ్ మేరేకో లాగాయా అంటూ క్యాన్‌తో లోపలికి రాసాగాడు జంక బయ్యం లేకుండా వాడి వెంట వాడి తండ్రి వచ్చి కైసే హై ఆప్ సబ్ అన్నాడు రంజాన్ ముబారక్ అని అందరం అన్నాం కాని ఎదో చెప్పలేని విషాదం చోటా సలీమ్‌ను చూస్తూనే అలా నిల్చున్నాం మీరా ఖావోనా అన్నాడు చోటా సలీం వాడు వాడే ఓ షీర్‌ఖుర్మలా కనిపించాడు వానిలో బడా సలీం కనిపించాడు షీర్‌ఖుర్మ తినాలనిపించినా ఎదో చెప్పలే అర్ధం కాని బాద - చోటా సలీంపైన అప్యాయత - వాడికి కొద్దిగా షిర్‌ఖుర్మ తినిపించి మేము కొద్దిగా తిన్నాం మాలో ఉన్న బాదను అప్యాయతను ఎలా తెలుపుకోవాలో అర్ధం కాక అలానే చూస్తూనే నిలబడి ఉన్నాం చోటా సలీం టాటా చెప్పుతూ వెళ్ళిపోయాడు అదే సాయంత్రం వారి గుడిసెక మేము వెళ్ళకుండా ఉండలేక పోయాం వారి గుడిసెకు వెళ్ళాం మమ్ముల్ని చూసి బడా సలీం కా బీబీ ఖాల్లుమని ఎడ్చింది మా కళ్ళ వెంటకూడ మాకు తెలియకుండానే నీళ్ళు

రానాగాయి చేటా సలీం మా మధ్యనే తిరగ సాగాడు మా వాడలా అదే రోజు ఆగర్భ శ్రీమంతుడు శ్రీ హఫీజ్‌ఖాన్ మా దోస్తు రంజాన్ బోజనానికి రమ్మన్నాడు ఆయన బవనం పాలరాతితో నిర్మించబడింది వారి ఇల్లు ముట్టుకుంటే మాసిపోయేలా ఉన్నారు బోజనానంతరం షీర్‌ఖుర్మాను అందించారు అది తినగానే ఆగర్భ దరిద్రుడైన సలీంబయ్యా కళ్ళ ముందు కనిపించాడు ప్రేమకు తారతమ్యాలు లేవని చెప్పక చెప్పారు సలీంబయ్యా మరియు హఫీజ్‌ఖాన్

ప్రేమ అప్యాయతలు **రంజాన్‌తో** కాదు **మతంలో** కాదు గుడిసెలో కాదు షీర్‌ఖుర్మాతో కాదు మనిషి **సలీంలోనే** ప్రతి రంజాన్ రోజు సలీం గుర్తుకు వస్తాడు ఎక్కడైన ఎవరైనా సలీం అని పిలిచినప్పుడు **రంజాన్ గుర్తుకు** వస్తుంది మనిషిలోని మమతలే మతంలోని మాదుర్యం అని మరీ మరీ గుర్తొస్తుంటాయి షీర్ ఖుర్మాలాగ మతంలో ఏముంది? మనిషిలోనే ఉంది మతం అని అనుకుంటుంటాం ఈ రోజు కూడా రంజాన్ వచ్చినప్పుడల్లా

*అంకితం సలీం బయ్యాకు వారి కుటుంబానికి*

# 18 బీదవాని తాజ్‌మహల్

ఈ ప్రకృతిలో ఎవరికి ఎవరు ఏది దైవ రూపంగా కన్పిస్తుందో తెలియదు ఒక వ్యక్తి మాత్రం తన బార్యే తన దైవంగా బావిస్తాడు రోజు పూజిస్తాడు నేను ఎప్పుడు వారి ఇంటికి వెళ్ళినా పూజలో ఉన్నారు కాసేపాగండి అంటారు పూజ మాత్రం తన బార్య పటానికి మాత్రమే చేస్తుంటాడు రోజు ఎన్నిసార్లైనా పూజ చేస్తాడు ఆయన చేతిలో ఎప్పుడూ ఒక పుస్తకం ఉంటుంది అందులో తన బార్య ఫోటో ఒకటి ఉంటుంది మనసు కలత పడగానే పుస్తకం తెరచి పదేండ్ల క్రితం మరణించిన తన బార్య ఫోటోకు పూజ చేసి కళ్ళకు అద్దుకుంటాడు ఏదో జ్ఞాపకం చేసుకుంటాడు కళ్ళవెంట నీరు తెచ్చుకుంటాడు ఒకసారి తన బార్య అన్నదట నీకు జ్ఞాపకం ఉందా ఈ రోజే మన పెండ్లి రోజు నీవు తొందరగా ఇంటికి రా అందట ఇదేమిటి ఇన్ని సంవత్సరాల తర్వాత మన పెండ్లి జ్ఞాపకమొచ్చింది అని అనుకొని తను పని చేస్తున్న ప్రెస్ నుండి తొందరగా కొంచెం డబ్బుతో ఇల్లు చేరుకున్నాడట ఆ రోజు సాయంత్రం హోటల్లో బోజనం ఆ సాయంత్రం మల్లె పూలు అంతే పెండ్లి రోజు అయిపోయింది మరుసటి రోజు ఓ డాక్టర్ గారు కలిసి తన బార్యతో అన్నారు నీ బర్తగారు బాగున్నారా? నిన్న మా ఆసుపత్రిలో రక్తం దానం చేసి ముప్పయి రూపాయలు సంపాదించాడు అని అన్నాడు ఆ డాకరు అది విన్న తన బార్య ఎంత పని చేశావయ్యా? అని అందట అంతే తన బార్య బ్రతికి ఉన్నంత కాలం తన పుట్టిన రోజు

పండుగ కాని ఎండ్లరోజు గాని మళ్లి మాటెత్తలేదట ఉంటు కళ్ళు తుడుచుకున్నాడు ఫోటోకు మరొక్కసారి నమస్కరించాడు ఈ రోజు వరకు తన బార్య బ్రతికి ఉంటే ఇద్దరం కుంటు ఎడ్చేవాళ్ళం మా ఇద్దరు కుమారులు ఒకే నెలలో పోయినందుకు అంటాడు కంట రాలిన కన్నీటి బిందువుల్లో ఒక పేదవాని తాజ్‌మహల్ కనిపించింది ఇంకెన్ని కన్నీటి బిందువుల్లో ఎన్ని తాజ్‌మహల్స్ కట్టుకున్నాడో ఎవరికి తెలుసు? అంటాయి ఈ షాజహాన్ కంటి నుండి బయలు దేరిన రెండు కన్నీటి బిందువులు

మరోసారి వెళ్ళితే తను జాగ్రత్తగా దాచుకొన్న పాత కళ్ళద్దాలు చూపించాడు అవి పగిలిపోయి విరిగిపోయి ఉన్నాయి ఇవి నాకు ముగ్గురు వేశ్యలు తలా రెండు రూపాయలు చందాలు వేసుకొని కొనిచ్చారు నాకు జబ్బు వచ్చినప్పుడు ఆ విన్నారులు ఎంతో సేవ చేశారు తమ శరీరాలను అమ్ముకొని వారు మరీ నాకు ఓ తండ్రి ప్రేమతో ఇది కొనిచ్చారు ఆ ముగ్గురి పేర్లు వారిపై కృతజ్ఞతతో నా కూతుళ్ళకి నామకరణం చేశాను అన్నాడు ఆ పేర్లతోనే మా అమ్మాయిలను ఎలుస్తుంటానని అంటాడు అందులో ముగ్గుర కాల గర్భంలో కలిసిపోయారు ఒక్కరి జీవితం మాత్రం నేను రచించిన గ్రందమే ప్రజాదరణ లబించిన పాకుడు రాళ్ళు ఆ గ్రంద రచనకు మా ఆవిడ ఎంతో సహకరించింది అంటూ తన బార్య ఫోటోకు నమస్కరించాడు తప్పు చేయని పురుషులు ఉండరు ఈ పురుషుడు చేసే ప్రతి తప్పును క్షమించడానికే స్త్రీని సృష్ఠించాడు ఆ దేవుడు అందుకే స్త్రీని పూజించాలి అందులో ముఖ్యంగా తనకు తన సతీమణియే దైవం అంటాడు ఇతరుల విషయం నాకు అనవసరం వారి వారి ఇష్టా అయిష్టాలు ఎవరి సతీమణులను వారు పూజించినా పూజించకపోయినా నేను మాత్రం నా సతీమణిని నేను సచ్చే వరకు పూజిస్తూనే ఉంటాను అని అంటాడు యమ బటులు ఈ మద్య నన్ను పలకరించి పోతున్నారు కల్లోకి వచ్చి అయినా వారిక ఒక్కటే చెబుతున్నాను మీరు మీ నరకానికో స్వర్గానికో నన్ను తీసుకొని వెళ్ళండ కాని ఒక సారి మాత్రం నా బార్య దగ్గరకు తీసుకెళ్ళి ఆమె దర్శనం చేసుకొన్నాకే మీ ఇష్టం వచ్చిన లోకానికి తీసుకెళ్ళండి అని మరీ మరీ వారిని ప్రార్ధిస్తున్నాను వాగ్దానం చేస్తేనే నేను మీతో వచ్చేది అన్నానని అంటాడు అంటూనే తన టేబుల్ పైన ఉన్న తన బార్య ఫోటోకు నమస్కరించాడు నూర్‌జహాన్ జ్ఞాపకార్థం తాజ్‌మహాల్‌ను కట్టించి అది చూస్తూ షాజాహన్ మరణించాడట కాని తన బార్యను పూజించాడా? అంటాడు సలీం - అనార్కలి రోమియో - జూలియట్ లాంటి కదలు ఎన్నో విన్నాం పురాణ కదలు కూడా చాలా విన్నాం ప్రేమించడమే కాని పూజించలేదుగా? పతితో సహగమనం చేయమన్నవారే గాని పురుషున్ని సతితో సహగమనం చేయమనేవారున్నారా? చేసిన వారు ఉన్నారా? స్త్రీక ప్రాదాన్యం కాని కల్పించినట్లు కనబడుతుందా? బర్తకు పాద పూజలే తప్ప పురుషుల ఆదిక్యమే తప్ప ప్రాతివ్రత్య పరీక్షలు ఎట్టే మగ ఆదిక్యత తప్ప బార్యకు నమస్కరించడానిక మనస్కరించదు ఎందుకో? అంటాడు ఎంత మంది షాజాహనులైనా ప్రేమ మందిరాలే

కట్టస్తారు హృదయంతో బార్య అనే దైవ మందిరం కట్టుకునే వారెందరు? స్త్రీని ఆడుకొనే ఆటబొమ్మగా చూచే సమాజం స్త్రీని బానిసగా చూసే పురుషనైజం స్త్రీని తగిలేసే గడ్డిబొమ్మగా చూసే తరం తరం స్త్రీని గర్భంలోనే మట్టుబెట్టే ఈ మానవత్వం బార్యను దేవతగా పూజించే బర్తలు ఎంతమంది? బూత వర్తమాన కాలాలలో కూడా అసలు ఉన్నారా? అంటూనే తన బార్య ఫోటోక సాష్టాంగ నమస్కారం ఎట్టాడు బరద్వాజ మరే స్త్రీనైనా పూజించారా? అన్నాను ఓరి నాయనో అదేం ప్రశ్న **అంటూ ఎద్దగా నవ్వాడు**

ఈ మద్య ఓ రెండు **కన్నీటి చుక్కలు మా ఇంటికొచ్చాయ్** మీరు ఆగ్రా నుండి వచ్చారా? అన్నాను అవును **ఎలా గుర్తు పటారు అన్నాయ్** ఆ నీటి చుక్కలు మీలో తాజ్‌మహల్ కనిపిస్తుంది అన్నాను **అవును షాజహాన్ మరణం** తర్వాత మేము దాక్కోవడానికి మరో రెండు కళ్లు వెతుకుతున్నాం **ఆనాటి నుండి ఈనాటి** వరకు మీకు ఆ కళ్ల అడ్రసు తెలుసని వచ్చాం అన్నాయ్ ఆ షాజహాన్ కన్నీళ్లు బరద్వాజ గారి అడ్రసు చెప్పాను ఓ రెండు రోజుల తర్వాత ఆ కన్నీళ్లు ఇలా అన్నాయి మేం చాలా గొప్ప అదృష్టవంతులం షాజహాన్ కళ్ల కంటె గొప్ప కళ్లు దొరికాయి తల దాచుకోవడానికి ఈ కళ్లలో ప్రేమ మందిరం కాదు కాని బార్యకు దైవ మందిరం చూశాం మా జన్మకిది చాలు ఆ ఎండిన కళ్లకు సేవ చేసే బాగ్యం మాకు కలిగింది వారితోనే ఉండిపోతాం వారితోనే వెళ్ళిపోతాం మాకు దారి చూపినందుకు మీకు కృతజ్ఞతలు ఇక ఎలవు అంటూ ఆ కన్నీళ్లు సంతోషాన్ని తెలియజేస్తూ మరో రెండు ఆనందాశృవులు వదులుతూ వీడ్కోలు తీసుకొని వెళ్లాయి

నాకు ఈనాడు కనిపించిన బగవంతుడు బక్తుడు బార్యా బక్తుడు కాంతమ్మ గారి బక్తుడు బరద్వాజ గారు – శ్రీ రావూరి బరద్వాజ గారు స్త్రీకి అపారమైన గౌరవాన్ని ప్రసాదించే గొప్ప మనిషి హావం – బావం అనే శీర్షికపై నేను తీసిన వారి చాయాచిత్రాలలో వారి బావాలను పోలి కనిపించే సోక్రటీస్ కారల్ మార్క్స్ హిపోక్రేట్స్ రవీంద్రుడు రజనీష్ పోలికలే కాక బార్యను పూజించే బగవంతుడు కనిపిస్తాడు వారిపై ఈ ప్రయోగం చేసే బాగ్యం కలిగినందుకు వారిక ప్రత్యేకమైన కృతజ్ఞతలు వారి అనుమతితో

*అంకితం కలియుగ బార్యా బక్తుడు శ్రీ రావూరి బరద్వాజ గారికి బార్యను గౌరవించే వారికి*

# 19 ఆత్మ - పరమాత్మ

ఆత్మ అంటే ఏమిటి? దాని ఆకారం దాని అవతారం ఎలా ఉంటుంది? ఆత్మ ఏ యుగంలో ఏ ఏ పరిస్థితులలో సృష్టించబడింది? దీని వల్ల ఏ ప్రాణికి ఏ లాభం ఉంటుంది? వీటికి ఒక్కొక్కరు ఒక్కొక్క తరహాలో సమాధానం చెప్తుతుంటారు అన్నీ తప్పే అనిపిస్తుంది? సందర్భాన్ని బట్టి పరిస్థితిని బట్టి అవి అన్ని నిజమే అనిపిస్తుంది

ఇప్పటి వరకు సృష్టిలో ఎన్ని ప్రాణులు జన్మించి మరణించాయో ఇంకా ఎంత మంది పుట్టనున్నారో అంతు పట్టని విషయం ఈ విశాల విశ్వం వీటన్నిటిని మాత్రం ఆత్మ విధానం గీతా సారాంశాన్ని బట్టి నమ్మవలసి వస్తుంది

జీవాత్మ జీవం వరకే పరిమితం ఆత్మ తన వరకే సంబందితం అంతరాత్మ ఒక రహస్యం పరమాత్మ అనేదే అంతుబట్టనిది ప్రేతాత్మ అనేది పరమాత్మతో ప్రవేశించలేని జీవాత్మ అటు ఇటు కాక కొట్టుమిట్టాడుతు కనబడకుండా తిరిగే ఈ ఆత్మలు కోకొల్లలు మంచివి చెడువి ఆడవి మగవి వీటినే దయ్యాలు భూతాలు అనటానికి వీలుంది

పరమాత్మ అంతట వ్యాపించి ఉంటాడని అంటే ఒంట – బయట నీటిలో – ఆకాశంలో ప్రతి ప్రాణి శరీరంపైన ఒక కవచంలా అవరించి ఉంటుంది జీవాత్మను పరమాత్మ నుండి వేరు చేసినట్లయితే జీవుడు మరణిస్తాడు జీవాత్మ పరమాత్మలో లీనమౌతుందని అంటారు ఇది నిజం అలాగే ప్రాణ వాయువును ఒక ప్రాణి నుండి వేరు చేస్తే ప్రాణి మరణిస్తుంది అనేది సైన్సు ఆదారం

ఒక కప్పను సీసాలో వేసి మూత ఎట్టినట్లయితే కొద్ది నిమిషాలలో అది మరణిస్తుంది అలాగే వెలుగుతున్న దీపాన్ని ఒక సీసాలో పెట్టి మూత ఎట్టినట్లయితే అది ఆరిపోతుంది నిప్పు మండాలన్నా దీపం వెలగాలన్నా కప్ప బ్రతకాలన్నా ప్రాణ వాయువు అవసరం ప్రాణవాయువే పరమాత్మ అది కనిపించదు అంతట ఆవరించి ఉంటుంది ప్రాణ వాయువు లేని చోట ప్రాణికి మనుగడ లేదు ప్రాణ వాయువుతో వేడి జనిస్తూ ఉంటుంది జీవకణంలో జీవం ఉంటుంది చలనం జరుగుతుంది గుడిలో కూడా దేవతా విగ్రహాలకు దీపార్చన చేస్తారు నిర్జీవంగా ఉండే విగ్రహాలకు దూప దీప నైవేద్యం హారతి ద్వారా వేడిని ప్రసాదిస్తారు విగ్రహానికి ప్రాణం వస్తుందని అప్పుడే ఆ దేవుడు అందరు భక్తులను చూస్తాడని నిద్రావస్థ నుండి లేస్తాడని కనికరిస్తాడని ప్రతీతి ఇక్కడ కూడా దేవతలకు ప్రాణ వాయువే అవసరం అందుకే ప్రాణ వాయువే పరమాత్మ అంతట పరమాత్ముడు

ఉపయించి యున్నాడని అనటానికి ఆధార కారణం ప్రాణ వాయువు వెంట లేకుండ శూన్యంలోక ప్రవేశిస్తే ప్రాణులు మరణిస్తాయి ప్రాణ వాయువు పరమాత్మ అనడానికి ఇది కూడా ఒక ఆధారమే

గుండెలో యస్ ఎ నోడ్ (సైనో ఎట్రియల్ నోడ్) అనేది కణాల కండరాల సముదాయం దీని ఒండు నిమిషానికి 72 సార్లు (0 8 సెకండ్‌కు ఒక్కసారి) విద్యుత్ పుడుతుంది ఇది ఎలా జరుగుతుందో ఇంత వరక అంతు పట్టని రహస్యం ఆ విద్యుత్ గుండె కండరానికే కాక శరీరం మొత్తం బాగాలకు ఒక క్షణంలో చేరుకుంటుంది ప్రాణ వాయువు ఈ కణ జాలానికి అందడంలో ఏ మాత్రం లోపం జాప్యం జరిగినా విద్యుత్ జననం ఆగిపోతుంది గుండె ఆగిపోతుంది రక్త ప్రసరణ ఆగిపోతుంది మనిషి మరణిస్తాడు అందుకే యస్ ఎ నోడ్ జీవాత్మ అనడానికి వీలుంది జీవుడు జీవించాలంటే యస్ ఎ నోడ్ (జీవాత్మ)కు పరమాత్మ (ప్రాణవాయువు) ముఖ్యఅవసరం ఇక్కడ కూడా ప్రాణ వాయువే పరమాత్మ అనడానికి వీలుంది

వాతావరణం అనేది భూమి చుట్టు ఆక్రమించి ఉన్న వాయు చక్రం దీనిలో ఎన్నో రకాల వాయువులు వాయువు మిశ్రమాలు అందులో ప్రాణ వాయువు (ఆక్సీజన్) ఒకటి ఒక పీడనంలో ఒక శాతంలో మిళితం చెంది భూగ్రహాన్ని ఆవరించి ఉన్నాయి వాతా వరణంలో ఎన్ని మార్పులు వచ్చినా ఎన్ని మరణాలు జరిగినా ఎన్నో ప్రాణులు ఈ వాయువును ఎన్నో సంవత్సరాలుగా వాడినా ఈ శాతం పడిపోదు నీటిలో కూడా కలిసి ఉంటుంది నీటిలో జీవులు జీవిస్తుంటాయి అసలు నీరే రెండు వాయువుల (ఆక్సిజన్-హైడ్రోజన్) మిశ్రమం

ప్రాణ వాయువే పరమాత్మ అనడానికి ఇవన్నీ ఆధారాలు పరమాత్మ అంతట ఆవరించి యుంటాడని నీలోను నాలోను ఉన్నాడని అనడానికి నిదర్శనాలు అయినా ఈ ఆక్సీజన్ ప్రాణవాయువు ఎక్కడి నుండి పుట్టుకొచ్చింది? అనేది అందరిని ఆలోచింపచేస్తుంది ఈ అంతుపట్టని రహస్యం బగవంతునికే తెలియాలి

అంకితం తత్వాలు వెదాలు సైన్సు ఆధారపూరితం అని నమ్మేవారికి

# ౨౦ శూన్యం నవ్వుతుంది

అండం పిండం అండాండం పిండాండం బ్రహ్మాండం ఉంతా శూన్యం ఓ హూన్యం ఆకారం సున్న శూన్యం ఆకారం చక్రం సున్న విలువ అనంతం అంటే ఉర్ధం కాదు అర్ధం అంతే లేదు

ఈ విశాల విశ్వంలో ఎ ఒక్కటి తీసుకొని పరిశీలించినా శూన్యాకారం సున్న ఆకృతిని పోలి ఉంటాయి భూమి చంద్రుడు సూర్యుడు నక్షత్రాలు ఇతర గ్రహాల గుండ్రంగా సున్న ఆకృతిలో ఉంటాయి కణం అణువు శరీరంలో ఎ బాగాన్ని తీసుకున్నా ఎ అవయవాన్ని తీసుకున్నా సూక్ష్మాకృతితో గుండ్రంగానే ఉంటాయి ఉండకోశం ఎండకోశం వృషణం పురుషాంగం శరీర అంగాంగాన్ని చేదించి చూసినా వృత్తాకారంలోనే ఉంటాయి మరి ఇంకా ఎ ప్రాణితోనైన ఇదే కనిపిస్తుంది నిర్జీవులైన ప్రతి వస్తువుకూడా ఇదే ఆకృతిని పోలి ఉంటాయి

రోజులు గంటలు నిమిషాలు వారాలు నెలలు సంవత్సరాలు యుగాలు ఎక్కడైతె మొదలౌతాయో అక్కడే అంతంమొందుతాయి ఎక్క డయితేఅంతమొందుతాయో అక్కడే మొదలౌతాయి జననం మరణం ఆకలి దప్పుయి నిద్రావస్థలు ఆస్తి- అంతస్థులు కీర్తి ప్రతిష్ట అలలు ఉప్పెనలు కష్టసుఖాలు నిరంతరం వృత్తాకారముతో పయనిస్తుంటాయి కామం క్రోదం మోహం శతృత్వం మిత్రుత్వం ప్రేమ ఆప్యాయత అసహ్యం ఒక దాని వెంట ఒకటి వృత్తాకారంలో ఇమిడి పరిగెడుతూ ఉంటాయి అదికారం ఆలోచనలు కూడా అంతే చివరకు మిగిలేది ఏమి ఉండదు సంపాదన దూది ఎంజాలై పోతుంది శరీరం కుళ్ళి నీరు నీరులో గాలి గాలిలో మటి మటిలో కలిసి కనబడకుండా పోతుంది వీటి మిశ్రమాతే మళ్ళి ప్రాణిగా పుడుతుంది ఎ ఒక్కరు ఈ విశాల విశ్వాన్ని స్వంతం చేసుకోలేక పోయారు నాది అన్న ప్రతి ఒక్కరు నాశనమైనారు నామ రూపాలు లేకుండా పోయారు విశ్వాన్ని శాశించాలనుకున్న ప్రతి ఒక్కరు వినాశానానికి గురైనారు శూన్యం(సున్న)తో పోరాడిన ప్రతి ఒక్కరు ఓడిపోయారు శూన్యం నిరంతరం గెలుస్తుంది గెలుపు కారణం శూన్యం సర్వాన్ని తనలో జీర్ణించుకుంటుంది దాని ఆకృతి అణువు అణువులో కణ కణంలో దాగి ఉంది అందుకేనేమో శూన్యం ఎమి లేదు సున్నాకు సున్న హళ్ళికి హళ్ళి అని హేళన చేసేవాళ్ళను చూసి విజయ గర్వంతో దరహాసం మందహాసం అటహాసం వికటఅట్టహాసం చేస్తుంది నిరంతరం అదే సున్నలో ఉన్న అంతరార్థం దాని విలువ అనంతం అఖరగా సున్నకు సున్న హళ్ళికి హళ్ళి అంటే ఎమి లేదని ఒక అర్ధం అంతా అందులోనే ఇమిడి ఉందని అదే సర్వస్వం అనేదే మరో అర్ధం

*అంకితం సృష్టి జీవిత రహస్యాన్ని తెలుసుకునే వారికి*
*చివరకు మిగిలేదే ఏది లేదు మిగిలింది నీది కాదు ప్రాణం ఒక రిలే రేస్ లాంటిది.*

# 21 మరణం మరణించదు

ఈ గ్రహంపైన సర్వ ప్రాణులు ఎలా జనించాయో అన్ని మతాలు దాదాపు ఒకే విధంగా చెప్తుతాయి బగవంతుడు ఒక్కొక్కటినీ ఈ భూమిపైకి పంపచాడని ఆ తర్వాత ప్రాణులు తమ దర్మాన్ని మరిచి విచ్చలవిడిగా జీవిస్తున్నాయని ఎన్నో కదలు పురాణాలు చెప్తున్నాయి ఇలా భూమిపై పడ్డ ప్రతి ప్రాణి తన సంతతిని ఎంచుకో ప్రారంబించాయి దానితో భూబారం ఎరిగిపోయి భూదేవి జనాబా బారాన్ని అటు ఇతర ప్రాణుల బారాన్ని భరించలేక మహావిష్ణువుకు తెలుపుకుందట సరే భూబారాన్ని తగ్గిస్తానని చెప్పి భూదేవిని భూమిపైక పంపించాడట ఆవిడ తిరిగి వచ్చి చూస్తే సగం ప్రజలు ఎ కారణం లేకుండానే ప్రాణాలు కోల్పోయి చచ్చిపడి ఉన్నారట వారి తాలూకు మనుష్యులు ఎడుస్తు విపరీతంగా బగవంతుని దూషించసాగారు ఈ విషయం విన్న దేవతలు తమ పలుకుబడ పడపోతుందనే బయంతో వారిపై అబిమానం ప్రజలలో అంతరించక ముందే ఓ ప్రణాళిక వేసారట మృత్యు దేవతను సృష్టించారట ఆ మృత్యువు దేవత గారు మరణ కారణాలు కనిపెట్టి వాటి ద్వారా జనబా సంఖ్యను తగ్గించడానిక నిరంతరం ప్రయత్నం చేస్తూనే ఉంది తినే తిండిలో త్రాగే ద్రవ పదార్థంలో నివసించే గృహాలలో ప్రయాణాలలో ప్రేమలో ఆస్తిలో అంతస్థులో రాజకీయంలో ప్రకృతిలో ప్రతి అంశంలో మృత్యువును ఇమిడ్చారు దేవతలు అంతే కాకుండా శరీర అవయవాలలో కూడా కణ కణంలో నర నరంలో మృత్యువును ఇమిడ్చారు దేవతలు అది తెలుసుకున్న మానవుడు మృత్యువు నుండి బయటపడటానికి వైద్య రంగాన్ని సృష్టించుకున్నాడు అందులోను మృత్యువును ఇమిడ్చారు దేవతలు

ప్రాణ రక్షణ కొరకై చేయించుకొనే వైద్య పరీక్షలలోను మరణాన్ని ఇమిడ్చారు అందుకే ప్రాణాన్ని దక్కించుకునే ప్రయత్నంలో పరీక్షలతో ప్రాణాలు పోగొట్టుకొన్నవారు ఎంతోమంది ఉన్నారు ప్రాణాలు కాపాడే వైద్యులు కూడా ప్రాణాలు కాపాడే ప్రయత్నంలో ప్రాణాలు పోగొట్టుకున్నారు వైద్య రంగానికి జబ్బులు సృష్టించారు వైద్యులూ మరణిస్తున్నారు ఎది ఎమైనా ప్రాణి సంతతి జనాబా విపరీతంగా ఎరుగ సాగింది అంతటితో ఆగక మాస్ కిల్లింగ్స్ ప్రకృతి వైపరిత్యాలు భూకంపాలు అగ్ని ప్రమాదాలు విష వాయువులు తుపాకులు ప్రేలుడు పదార్థాలు ప్రయాణంలో ప్రమాదాలు పడవ మునకలు గ్యాస్ లీకులు ఆయుదాలు యుద్ధాలు అణు యుద్ధాలు అనే ఈ మృత్యువు రూపాలు సృష్టించబడ్డాయి అయినా మాత్రం ప్రపంచ జనాబా ఎరుగుతూనే ఉంది ఇది చూసి విసిగెత్తిన దేవతలు మృత్యువు దేవత బాగా ఆలోచించి ప్రతి జన్మతో పాటు ఆ ప్రాణితో పాటు మృత్యువు కూడా జనించే విదంగా ప్రతిపాదనను ప్రవేశపెట్టారు అందుకే

ప్రతి ప్రాణిక ప్రతి తల్లి జన్మనిచ్చేటప్పుడు మరణానికి కూడా జన్మనిస్తుంది జనన మరణాలు ఒకసారే జన్మిస్తాయి అది మనకు తెలియకుండానే అతి రహస్యంగా అర్ధం కాకుండా జరుగుతుంది నిరంతరం అది మరిచిపోయి మనం ఆనందోత్సహాలు వెలిబుచ్చుకుంటాం దానితో మరణం కూడా జన్మించిందని మరిచిపోతాం ఆ పుట్టిన రోజు నుండి మొదలౌతుంది నిరంతర పోరాటం అదే ప్రాణానికి మరణానికి ఎడ తెగని పోరాటం ఈ పోరాటంలో కొందరికి వందేండ్లు కొందరికి వంద గడియలు అంతిమ విజయం మాత్రం మరణానిదే ప్రాణులు ఎన్నిటినైనా జయించవచ్చు మరణాన్ని మాత్రం జయించలేవు. ఎ కారణంతోనైనా ఎ క్షణాన్నైనా ఎ కారణం లేకుండా మనిషి మరణించొచ్చు మరణానికి చావులేని కారణాలు అనంతం వైద్య శాస్త్రానికే అంతుపట్టని కారణాలు కోటానుకోట్లు పుట్టుకను అంచనా వేయుచ్చు కాని మరణాన్ని అంతు-అంచనా వేయలేము అనుక్షణం జాగ్రత్త వహించడమే ప్రతి చిన్న విషయానికి జాగ్రత్త పడటమే కొంత వరకు సమంజసం సమాదానం పరమాత్మ ప్రతి ప్రాణిని ఆవరించి యుంటాడని కవచంలా అంటి ఎట్టుకొని ఉంటాడని కాపాడుతుంటాడని ఆ కవచం పగిలిపోతే మృత్యువు ఆవరిస్తుందని ఆద్యాత్మిక చింతన తెలుపుతుంది కాని మృత్యువే ప్రతి ప్రాణిని కవచంగా కాపాడుతుందని మరో వాదన కావచ్చు గదా ఆ కవచం అంతిమ విజయాన్ని సాదించి ప్రాణాన్ని పరమాత్మలో లీనం చేస్తుంది అందుకే మరణం ప్రాణికి పరమాత్మునికి మద్య వారది వైద్య రంగం ఎంతో మంది ప్రాణాలు పోతుండగా చూసింది ప్రాణాలు ఎలా ఎందుకు పోతాయో అర్ధం కాకుండా ఉంటుంది ప్రాణం పోయినప్పుడు ఎడ్చే వారు కొందరు నవ్వే వారు కొందరు అర్ధం తెలియక తెలిసినా చెప్పలేక ఎడుస్తూ నవ్వేవారు నవ్వుతూనే ఎడ్చేవారు కొందరు కారణాలు గుది గుచ్చి మరణ కారణాలు వల్లిస్తు ట్విస్ట్ చేస్తు ఒప్పించి చెప్పేవారు వైద్యులు వినేవారు లోకులు ఈ భూమిపై జన్మించాలని ఉంటే మరణానికి సిద్దంగా ఉండాలి వందేండ్లు బ్రతకాలని ఉంటే వృద్ధ్యాప్యం అనే శిక్షకు సిద్దంగా ఉండాలి వృద్ధ్యాప్యం సుఖమయంగా ఉండాలంటే యువకులుగా మంచి చేయాలి అయినా అంతిమ విజయం మరణానిదే మరణం మాత్రం మరణించదు చివరకు ప్రతి ప్రాణి మరణం శరణం గచ్ఛామి ఎవరి అనుమతితో నీవు జన్మించావు? ఎవరి అనుమతితో నీవు మరణిస్తున్నావు? మరణం అనేది లేకుంటే ఎమౌతుందో తెలుసా? బాగా ఆలోచించు

*అంకితం* *మరణం వృద్ధాప్యం అంటే బయపడని వారికి*
*అకాల మరణం ఒక్కటే దు ఖకారణం*

# ౨౨ దేవుడు - టీ

ఆఫీసుతో కూర్చున్నాను మద్యాహ్నం _-00 గంటలు ఇద్దరు సీనియర్ నర్సులు హడావిడగా వచ్చి సార్ మీరు మద్యాహ్నం 3-00 గంటలకు మా నర్సింగ్ డిపార్టుమెంట్‌కు రావాలి ఉన్నారు ఎందుకన్నాను మా ప్రిన్సిపాల్ గారు రిటైర్ అవుతున్నారు సెండాఫ్ టీ స్నాక్స్ ఉంటాయి తప్పకరండ టైం లేదు ఇంకా ఎందరికో చెప్పాలి అంటూ హడావిడిగా వెళ్ళిపోయారు ఇంకా ఒక గంట టైం ఉంది కార్యక్రమానికి ఇంత సేపు ఎలా వేచి ఉండడంరా దేవుడా? అంటూ కుర్చీలో కూర్చున్నాను

ఎంట నన్ను ఎలిచావు' అని దేవుడు అడగాడు ఎమి తోచక ఊరికే దేవుడా అన్నాను అంత మాత్రాన నీవు రావాలా? అన్నాను ఎదో విశేషం ఉంటేనే అలా ఎలుస్తావు లేకపోతే నీవు నన్ను ఎప్పుడు తలిచేది? ఎిచేది? అన్నాడు అవును ఏదో బాదలోను లేక ప్రమాదంలోను ఉంటే తప్ప నన్ను ఎలవవు ఏ బయం ఎ అవసరం లేకుండా నన్ను ఎలిచావు నీకు నేను అంటే బయం తప్ప బక్తి లేదు అని నాకు తెలుసు బయం లేకుండా బక్తి లేకుండా నన్ను ఎలిచావంటే ఏదో విశేషం ఉండ ఉంటుంది అదేంటో చెప్పమన్నాడు దేవుడు చేస్తానంటే చెప్పుతాను లేకపోతే ఊరికే చెప్పడం దేనికి? అన్నాను చేయవల్సింది ఐయితే చేస్తాను లేకపోతే లేదు? అన్నాడు అటువంటప్పుడు ఎందుకు చెప్పడం? అన్నాను నేను వచ్చినాను కాబట్టి చెప్పాల్సిందే లేకపోతే పోను ఎదో నాకు సంబందించిన సమస్యే అయి ఉంటుంది నేను మాత్రం అన్ని చేస చస్తానా ఏమిటి ? అన్నాడు దేవుడు అయితే చెబుతాను విను చేస్తే చేయి లేకపోతే లేదు నీ కర్మ నీ ప్రాప్తం అంటూ నాకు వెయ్యి మంది కూతుళ్ళు కావాలి అన్నాను నవ్వాడు దేవుడు నిజంగా నీకు వెయ్యి మంది కూతుళ్ళు కావాలా? అన్నాడు దేవుడు అవును అన్నాను నీ దురాశ పాడుగాను ఇది ఎమి కోరిక అడ్డదిడ్డంగా ఉంది నన్నే అన్-పాపులర్ చేద్దామనుకుంటున్నవా? ఇండైరెక్టుగా నీకు వెయ్యి మంది కూతుళ్ళు పుట్టాలంటే ఎట్ లీస్ట్ వంద మంది బార్యలుండాలి నాకే ఎనిమిది మంది బార్యలకంటే ఎక్కువ లేరు నీకు వంద మంది బార్యలను ఇచ్చి నా పాపులారిటీని పోగొట్టుకొని నిన్ను దేవుణ్ణ చేయడం ఇష్టం లేదు ఇది నా పర్సనల్ ప్రెస్టేజి అన్నాడు మిస్టర్ దేవుడు నిన్ను నాకంటే గొప్పవాణ్ణి చేయడం నాకు ఇష్టం లేదు ఇది అయ్యే పని కాదు నీ కోరిక తీరే పని కాదు కాని ఈ వెయ్యి మంది కూతుళ్ళను ఎమి చేద్దామను కుంటున్నావు ? నర్సింగ్ వృత్తిలో చేర్పించి నర్సులుగా తయారు చేద్దామని అనుకుం టున్నాను అన్నాను ఎందుకు? అన్నాడు కన్న తల్లికి కోపం వస్తే తిడుతుంది కొడుతుంది ఒక్కొక్కసారి వదిలివేస్తుంది కాని నర్సులు కొట్టరు తిట్టరు సేవలే చేస్తారు తల్లికంటే గొప్పగా

అందుకే అలా కోరుకున్నాను అన్నాను నీ కోరిక బాగానే ఉంది కాని ఆ విదంగా కూడా వెయ్యిమంది కూతుళ్ళను కన్న ప్రఖ్యాతి నీకు వస్తుంది అందుకే నీవంటేనే నాకు బయం అసలు నాకు లేని కోరికలు ఐడియాలు ఎలా వస్తాయి! అసలు నన్ను ఇరకాటంలో ఎటడం తప్ప మరేమి లేదు అసలు ఇలాంటి సమస్యలు ముందుముందు వస్తే పరిష్కరించు కోవడానికి తెలుసుకోవడానికి వచ్చాను అయినా ఇది అయ్యేది కాదు కాబట్టి ఇంకా ఏదైన ఉంటే కోరుకో అన్నాడు లేదా అడుగు అన్నాడు దేవుడు

ఆఁ ఇది తీర్చి చచ్చావు కనుక ఇంకేమిటి కోరేది నీవు వెళ్ళిపో తీర్చవు ఆర్చవు ఈ కోరిక నాకు వచ్చింది కాబట్టి సరిపోయింది అదే ఎ రావణబ్రహ్మకో లేక ఇంకా ఎ రాక్షసుడికో వచ్చి వుంటే నీ పని అయ్యి ఉండేది ఏదో నీవు నా ఫ్రెండ్ కాబట్టి నిన్ను ఇంతటితో వదిలివేస్తున్నాను వెళ్ళిపో నీ ఇష్ట బార్య అష్ట బార్యలతో కులుకు వారికి ఈ విషయం ఎమి చెప్పకు వింటే నిన్నే తంతారు అన్నాను

అదంతా అనవసరం దీనికి బదులుగా ఇంకో కోరిక కోరమన్నానా? కోరెటట్టుగానే ఉన్నావు అది కూడా కోరుకో చుద్దాం అన్నాడు దేవుడు సరే మరో చాన్స్ ఇస్తున్నాను అడుగుతున్నాను తీర్చలేక పోతే వెంటనే వెళ్ళిపో తీర్చగలితే ఉండిపో ఆ తర్వాతే టీ తాగుదాం అన్నాడు అబ్బా టీ తాగి ఎన్నాళ్లైందో ముందు టీ తాగుదాం అన్నాడు టీ కి ముఖం వాచి ఉన్న దేవుడు టీ తాగగానే వెళ్ళిపోతావు మళ్ళీ ఎన్నాళ్ళకో టీ తేవడానికి బాయ్‌ని పంపించి నా రెండవ కోరిక చెప్ప సాగాను వంద మంది బార్యలు వెయ్యి మంది కూతుళ్ళు ఇవ్వడం ఎట్లాగ నీకు సాద్యం కాదు గాని నన్ను వెయ్యి ముక్కలు చేసి ఒక్కో ముక్కను ఒక్కో నర్సు కడుపులో పెట్టేయి అలా వెయ్యి మంది నర్సుల కడుపులో నేను పుట్టేటట్టుగా చూడు అదే నా కోరిక అది చాలు చెయ్యగలితే చెయ్యి లేదా వివరణ అడగకు అన్నాను

అంటే నీకు వెయ్యిమంది తల్లులు కావాలన్న మాట నాకే అసలు తల్లే లేదు తల్లి ప్రేమ కరువై యుగయుగాలుగా బాద పడుతున్నాను ఈ బాద తీర్చుకోవడానికి మనుష్యులను ప్రాణుల సృష్టించి మళ్ళీ ఒక్కొక్క మనిషికి ప్రాణికి తల్లిని సృష్టించి వారి ప్రేమానురాగాలను చూస్తూ నేను ప్రేమ అనుబూతిని పొందుతన్నాను నాకు తల్లి లేదు ఇతరులకు ఒక్కరికి ఒక తల్లి మాత్రమే నీకు వెయ్యి మంది తల్లులా? అమ్మో! రూలు ఎలా మార్చేది ఇంత అన్యాయమా? నేను అప్పుడే వెళ్లిపోయి ఉంటే బాగుండును కాని ఎదో చాయ్ కోరకు ఆశపడి ఉంటే మళ్ళీ ఇరికించావు. వెయ్యి మంది తల్లుల ఒడిలో ఆడుకుందాం

కుడుకుదామని అనుకుంటున్నావా? నీకు అంత ప్రేమ కావాలా? అన్నాడు దేవుడు అవును అన్నాను. నీకు తల్లి లేనంత మాత్రాన ఇతరులకు ఒకే తల్లి ఉన్నంత మాత్రాన నాకు వెయ్యి మంది తల్లులు కావాలని కోరుకోవడంలో తప్పేమిటి? తప్పు లేదనుకో అది ఎలా సాధ్యం? బ్రహ్మకు చెప్పగలను నీ నుదుటి వ్రాత మార్పించగలను యముణ్ణి ఆదేశించగలను నిన్ను చంపి వెయ్యి ముక్కలు చేయగలను ఏమైనా చేయగలను కాని వెయ్యి మంది తల్లుల కడుపులో పుట్టేటట్లుగా చేయడం ఎలా? నా తల తిరిగిపోతుంది నా దమాక్ ఖరాబు చేసావు. చాయ్ వచ్చిందా అన్నాడు దేవుడు ఆ చాయ్ వచ్చింది అంటూ బాయ్ వచ్చాడు ఒక కప్పులో పోశాడు మరి నీకు అన్నాడు దేవుడు అది నీకే అన్నాను నాకా? మరి మీకు అని అన్నాడు వార్డ్ బాయ్ నేను మీటింగ్‌లో టీ తాగుతాను అంటూ మ్యాట్రన్ రిటైర్‌మెంట్ సభకు వెళ్ళాను ఇదే కద కల కద చెప్పాను సభలో కల అని చెప్పకుండ అందరు నర్సులు మొదటి బాగం వింటున్నప్పుడు ముసిముసిగా నవ్వుతు కన్పించారు రెండవ బాగం కద వింటున్నప్పుడు ఏదో మౌనం కొంత మంది సీనియర్ నర్సుల కళ్ళు చెమర్చడం కన్పించింది నీకు వెయ్యి మంది తల్లులు అది నర్సులే కావాలా? సాధ్యమా? గద్గద స్వరంతో అంటూ వెళ్ళిపోలేక చాలా సేపటికి సభ నుండి వెళ్ళిపోయారు ఇది ఎలా సాధ్యం? అన్నారు నర్సులు దేవుడు విజయ గర్వంతో నన్ను చూస్తూ నవ్వసాగాడు నేను చూడ సాగాను వెర్రి ముఖం వేసి దేవుడు వైపు అటు అటు వైపు చూడు అన్నాడు దేవుడు సభలో సీనియర్ నర్సులు అందరూ నా తల్లుల్లాగ జూనియర్ నర్సులు అందరూ నా కూతుర్లుగా కనబడసాగారు దేవునికి కృతజ్ఞతతో నమస్కరించాను దేవుడు ముసి ముసిగా నవ్వుతూ వెళ్ళిపోయాడు దాంక్స్ పర్ యువర్ టీ అంటూ

*అంకితం తల్లిలా సేవలందించే వారికి తల్లే మొదటి నర్సు*
*సందర్భం – ప్రిన్సిపాల్ - స్కూల్ ఆఫ్ నర్సింగ్ వీడ్కోలు సభ ఉస్మానియా ఆసుపత్రి నవంబర్ 2001*

# 23 పిచ్చి తల్లి

ఒకరోజు ఓ తల్లిదండ్రులు తన ఇరవై ఏళ్ళ కూతుర్ని తీసుకొని వచ్చి పరీక్ష చేయమన్నారు వెంట ఇంక కొందరు వచ్చారు వారిలో ఆ అమ్మాయి అన్న కొంతమంది తోటి ఉద్యోగస్థులు వెంట ఉన్నారు పేరు అడిగాను చెప్పింది ఎంటి నీ ప్రాబ్లమ్ అన్నాను చూడు డాక్టర్ ఇది న్యాయమేనా? అంది అమ్మాయి నా కొడుకును నాకు ఇవ్వకుండ గోపి ఎలా తీసుకెళ్తాడు? గోపి తండ్రి అయినంత మాత్రాన నాతో అయనకు అవసరం లేనంత మాత్రాన నాకు విడాకులు ఇచ్చి వదిలేసినంత మాత్రాన నా కొడుకును కూడా వాడు

తీసుకొని పోవడం న్యాయమా? నా కొడుకు నా హక్కు నా బ్రతుక ముందుముందు ఎలా ఉంటుందో ఎవ్వరికి తెలియదు నాకు వీడే దిక్కు కదా! విడాకులు కావాలని వేదిస్తుంటే సంతకాలు ఎట్టాను కాని కొడుకును వదులుకునేందుకు కాదు? ఎటమని వేదిస్తుంటే సంతకం పెట్టాను కాని అది నా ఇష్టంతో కాదు నాకు మళ్ళీ ఎండ్లి చేస్తారట ఇప్పుడు మాత్రం ఎమైంది డాక్టర్ వీడు నాకు అడ్డం ఉట వీడుంటే నాకు పెండ్లి కాదంట అందుకే అయనకే వదిలివేయమంటారు వీళ్లందరు బాబుకు ఇంకా రెండేళ్ళు కూడా దాటవేదు కన్న పాప మీద కన్న తల్లికే హక్కు ఉంటుది కదా? విడాకులు ఇచ్చే తండ్రపై ఉంటుందా? అయన మళ్ళీ పెండ్లి చేసుకుంటే వాడిని ఆయన రెండో బార్య బాగా చూచుకుంటుందా? ఎది ఎమైన సరే నేను చచ్చినా సరే సంతకం పెటనంటే ఎటన పెటను ఎట్టను ఎట్టను అంతే లాయరు ఎద్ద మనుషులు మా అమ్మానాన్నలు మా అన్న అక్క కూడా అలాగే అంటున్నారు ఇదేమి న్యాయం వాళ్లకైతే? అలా చేస్తారా? పుట్టిన ఎల్లలను సాకే బాధ్యత తల్లిపైన ఉంటుంది తండ్రి పైన కాదు బాబుకు మెయిన్‌టెనెన్స్ కూడ అవసరం లేదు నేను ఉద్యోగం చేస్తున్నాను ఎది ఎమైన సరే కోర్టు కూడ నా మాటే వినాలి బాబు నాకే చెందాలి న్యాయం జరగాలి అంటూ అరవడం మొదలు పెట్టింది ఆ ఇరవై యేండ్ల యువతి

డాక్టరుగా నేను ఎమి చేయగలను? ఇది కోర్టు విషయం కోర్టులో తేల్చుకోవాలి లేదా మీరందరు కుటుంబీకులు ఎదో ఒకటి సెటిల్‌మెంట్ చేసుకోవాలి అన్నాను జబ్బు ఎమైనా ఉంటే వైద్యం చేద్దాం అన్నాను ఇదే జబ్బు ఇంకేమి లేదు అంది తల్లి మరి బాబు ఎక్కడ? అన్నాను బాబా పాడా! ఏదీ లేదు దానికి పెండ్లియే కాలేదు డాక్టరు అన్నాడు తండ్రి అందుకే కదా మేము వచ్చాం మీ దగ్గరకు వైద్యం కొరకు అంది తల్లి

ఎండ్లి కాలేదా? గోపి నా బర్త కాడా? వీడు నా కొడుకు కాదా? అలా ఎందుకు చెప్పుతున్నావు? బుద్దిలేదా? అంది తండ్రిని తిడ్తూ

అలా కాదు నేను చెబుతాను మీరు జాగ్రత్తగా వినండి డాక్టర్ అంటూ వారితో వచ్చిన ఒక వ్యక్తి ముందుకు వచ్చాడు

ఎంటి నీవు చెప్పేది? అంతా ఎదో నాటకం కిప... చెప్తావు నీవు చెప్పేది అంతా నాటకం నువ్వు నోరు ముయ్ నీకుబుద్ది లేదు ఇదంతా చేసింది నీవు కాదా? అంటు అతనిపై విరుచుక పడింది ఆ యువతి

ఇంతకు ఇతను ఎవరు? అన్నాను

ఈయనే డైరెక్టర్ మా నాటకానికి డైరెక్టర్ అన్నారు వారిలో కొందరు

నా ఖర్మ నేనే డైరెక్టర్ను అదో వెదవ నాటకం నాకు బుద్ధిలేక ఈ అమ్మాయినే సెలెక్ట్ చేశాను నాటకాల వారోత్సవాలకు మా ఆఫీసు నుండ ఒక నాటకాన్ని సెలెక్టు చేసి అందులో ఓ తల్లి పాత్రను ఈ అమ్మాయికి ఇచ్చాము రిహార్సల్ మొదలు పెట్టాము ఇతడు గోపి నాటకంలో హీరో వీడికి పెండ్లి అయింది ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు అని అన్నాడు ఆ డైరెక్టరు

డైలాగు అంతా బాగానే చెప్పింది. అది కోర్టు సీను అందులో అందరి వాదన అయిపోతుంది జడ్జీ తుదిగా తల్లికోరిక ఏమిటని అడగాలి అది విడాకుల సీను భర్త కోరిక ప్రకారమే విడాకులకు ఒప్పుకుంది కాని పాప విషయం మాత్రం నమోదు కాలేదు పాపను తను దక్కించుకోవాలి తల్లిగా అనేది వాదన ఎక్స్ప్రెషన్ బాగా ఇవ్వాలి డైలాగు చెప్పలేక పోయింది మళ్ళీ మళ్ళీ అదే డైలాగులు చెప్పించారు మూడు రోజులు పట్టింది డైలాగు చాలా పవర్ఫుల్గా ఉంది దానికి దగ్గట్టుగా నటించకపోతే లాబం లేదు అంటూ గట్టిగా అరిచా రేపు ఫైనల్ చేద్దాం అన్నాను ఫైనల్ రిహార్సల్ రోజు మేము అనుకున్న దానికంటే గొప్పగా ఊహించలేని విదంలో అదే కోర్టు సీనులో అరుస్తూ విమర్శిస్తూ నాటకంలో లేని మరికొన్ని లా పాయింట్లు చాలా ఎగ్రేసివ్గా ఎదురు వచ్చిన వారిని ఎదిరిస్తూ దెబ్బతిన్న పులిలా బీకరమైన ముఖ కవళికలతో మహాకాళిలా నెత్తి విరబోసుకొని విరుచుకపడింది అది విన్న వారందరు చప్పట్లు కొట్టసాగారు వారోత్సవాలలో మనకే మొదటి బహుమతి వస్తుందని అన్నారు కొందరు చప్పట్లు కొట్టసాగారు బ్రహ్మాండంగా మెచ్చుకోసాగారు కాని ఆ యువతి మాత్రం ఎంతకు డైలాగు ఆపడం లేదు అలాగే చెబుతుంది ఆపటం లేదు ఆగడం కూడా లేదు అలాగే చెబుతూనే ఉంది వారం రోజులైంది పాప నాకు కావాలి పాప నాకు కావాలి ప్రపంచంలో ఎవ్వరికి హక్కులేదు నా పాపపైన నాకు తప్ప ఇలా తెల్లవార్లు అంటూనే ఉంది డాక్టర్ నిద్ర లేదు నీరు లేదు తిండి లేదు ఎక్కడ నా బాబు నా బాబును తీసుకొని రండి లేదా గోపిని లాయర్ను జడ్జిని వీళ్ళందరిని హత్య చేస్తాను చంపేస్తాను అంటూ అరుస్తుంది అన్నారు ఆ డైరెక్టర్ ఇంకా వెంట వచ్చినవాళ్ళు

ఈ జబ్బు నయం కావడం చాలా కష్టం ఎండ్లి కాని అమ్మాయి ఆపైన తల్లి పాత్ర ప్రబావం కవి రచించిన డైలాగు విదానం క్లైమాక్స్ సీను కొరకు డైరెక్టర్ ప్రయత్నం ఆ పాత్ర ప్రబావం ఆ అమ్మాయి మెదడుపైన పడింది అది సాహిత్య ప్రబావమే తల్లిగాని తల్లి పెండ్లికాని అమ్మాయి నాటక అనుబవం లేని యువతి తట్టుకోలేకపోయింది అందుకే ఇలా మారింది. ఈవిడ మామూలు మనిషి కావడానికి ఎ రెండు మూడు నెలలైన పట్టవచ్చు షాక్ దెరపి కూడా ఇవ్వవలసి ఉంది బాగు కూడా కాకపోవచ్చునేమో ఏమైనా సరే ఇప్పుడే

ఆరంబంలోనే బాగా వైద్యం చేయించాలి అని సీనియర్ సైక్యాట్రిస్ట్‌కు కేసు రెఫర్ చేశాను ఓ నాలుగు నెలల పాటు పాలో చేశాను చాలా మార్పు వచ్చింది ఎప్పుడు మెంటల్ ఆసుప్రతికి వెళ్ళినా నాతో క్లోజ్‌గా సక్రమంగా బాగా మాట్లాడేది నేను వెళ్ళామని వెళ్ళేముందు ప్రతిసారి నా కొడుకును తెచ్చావా? డాకర్ మరి ఇంకెప్పుడు తెస్తావు? అనేది అది వినగానే నాకు గుండె తర్కుపోయేది ఆ తర్వాత ఆ అమ్మాయిని ఎన్నో ఆసుపత్రుల్లో చూపించినట్లు తెలిసింది ఆ అమ్మాయిగాని తన తల్లిదండ్రులు గాని వారు తాలూకు మనుషులు కూడా మళ్ళీ కనిపించలేదు ఎమైందో కూడా తెలియదు వైద్యం కొరకు నార్త్ ఇండియాకు వెళ్ళినట్లుగా తెలిసింది అప్పుడు అర్ధమైంది సాహిత్య ప్రబావం కొందరి మస్తిష్కముపైన ఎంతటి ప్రబావం చూపుతుందో అలాంటి సాహిత్యాన్ని రచించేటప్పుడు కవి మెదడులో కూడా ఎవైనా మార్పులు వస్తాయా? ఆయన ఆలోచనలకు ఆయన ముఖ కవళికలకు అనుబంధం అనుసంధానం ఉంటుందా? అవి వ్రాస్తున్నప్పుడు అతని ముఖంలో మార్పులు ఎలా ఉంటాయో తెలుసుకోవాలనే ఆలోచన కలిగింది వాటిని ఎలా ప్రాక్టికల్‌గా చూపాలి ఎలా ప్రువ్ చేయాలో అనే తాపత్రయం మొదలైంది నాలో

కవులు ఎంతో మంది ఉంటారు కాని మనకు అందుబాటులో ఉండాలి వారికి తెలియకుండా ఈ ప్రయోగం చేయాలి అది ఎలా సాధ్యం? ఓ అయిదు సంవత్సరాలు ప్రయత్నం కొనసాగింది బాగా ఆలోచిస్తే ఓ కవి దొరికాడు ఆయనగారు రోజు ఎక్కడో ఏదో ఒకసబలో పాల్గొంటుంటారు ఈజిలీ ఎవైలెబుల్ సబ్జెక్టు నేనెవరో తెలియకూడదు రహస్యంగా ఆయన ముఖ కవళికలు (ఎక్స్‌ప్రషన్) క్యాచ్ చేయాలి అంతే ఆయన రచించిన పుస్తకాలు పాటలు సేకరించి చదివి వాటిలో ప్రజారంజకమైన బావాలు సందేశాత్మమైన వర్డింగ్స్ వెతికి వెతికి ఒక లిస్టుగా వ్రాశాను ఒక సంవత్సరం పాటు వారు ప్రసంగిస్తున్నప్పుడు వారి చాయా చిత్రాలను కెమెరాలో బందించాను వారికి తెలయకుండా వారి చాయా చిత్రాలను వారి బావాలను సమన్వయ పరిచి మ్యాచింగ్ చేశాను His thought and his own expression అని నామకరణం చేశాను రవీంద్రబారతిలో ఐదు వందల చిత్రాలను ప్రదర్శించాను నటులు శ్రీ అక్కినేని నాగేశ్వర్‌రావు గారు ప్రదర్శనను ప్రారంబిస్తూ నాలాంటి నటులపైన ఇలాంటి ప్రయోగం సులబం నటుడు కాని పద్మశ్రీ డాకర్ ఎ నారాయణరెడ్డి గారిపైన ఈ ప్రయోగం అసాధ్యం ఇది ఈనాడు సుసాధ్యం అసాదారణం ఈ నూతన ప్రక్రియ ప్రయోగం బహుశ ప్రపంచంలో ఇదే ప్రదమ ప్రయోగమై ఉంటుంది అని అన్నారు మహా నటులు ఎ ఎన్ ఆర్ మరియు ఎంతో మంది నటులు మంత్రులు సాహితీ వేత్తలు విలేఖరులు ప్రజలు ఆశ్చర్యాన్ని దిగ్భ్రాంతిని వెలిబుచ్చారు ఇంతకు మీరు ఎవరు? అని ప్రశ్నించారు ఎ నా రె గారు అంతా జరిగినది జరిగినట్లుగా తెలియజేశాను నాకు తెలియకుండా నా పైన చేసిన ఈ తెహల్కా ప్రయోగం నా అదృ

ూ_ వాప్ప్రా పె ఉంటూ ఈ విషయాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు
ాయుడుగారికి తెలియజేసారు ఎ నా రె గారు తన డెబ్బైవ జన్మదిన కార్యక్రమంలో
ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గారి చేత అదే రోజు దుశ్శాలువాతో నన్ను - నా
ప్రయోగా న్మానించారు రవీంద్రబారతిలో ఈ సన్మానం నాకు కాదు సాహిత్యశక్తికి
సాహిత్య ప్రతిభకు ప్రబావితురాలైన ఎండ్లకాని - తల్లి కాని తల్లి - ఎచ్చితల్లి ఆ చిన్నారి
తల్లికి మాత్రమే అని నాకో నేను అనుకుంటూ ఆ శాలువాను అందుకున్నాను ఆ అమ్మాయి
తరపున

*ఈ ప్రయోగంపై ఆదరాబిమానాలు గౌరవం చూపిన మాజీ డా॥ ఎ నారాయణరెడ్డి గారికి డా॥ అక్కినేని నాగేశ్వరరావు గారికి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారికి కృతజ్ఞతలు తెలుపుతూ ఈ ప్రయోగం ఆ ఎచ్చి తల్లి కి అంకితం*

# 24 అణు పిశాచి

ఈ అనంత విశ్వంలో బూగోళం పైనే జీవకణం ఉన్నట్లు విజ్ఞాన శాస్త్రం తెలుపుతుంది సృష్టిలో జీవరాశి లేని గ్రహం సౌందర్యవిహీనం - అనవసరం - అని మరీ మరీ తెలుపుతున్నాయి మన అన్ని మతాల గ్రందాలు

కోటాను కోట్ల గ్రహాలతో నిండిన ఈ సువిశాల విశ్వం వయస్సెంత? అందులో ఈ బూగోళం వయస్సెంత? బూమి పై పుట్టిన ప్రాణి వయస్సెంత? ప్రాణిలో ఒక ప్రాణి మనిషి ప్రాణం క్షణమంత అయినా ప్రాణానికి ఇది వారది - లేకుంటే ఈ బూ గ్రహం ఒక సమాది

అత్యున్నతస్థాయికి అబివృద్ది చెందిన మేదస్సు - మెదడు కణం అబివృద్ది అనే అహంకారంతో ఈ కణం - అనుక్షణం ప్రాణ హానినే కోరుకుంటుంది అదే అవదులు దాటి హద్దు మీరిన శక్తి అణుశక్తి అనుక్షణం జరిగే కణ క్రమ విబజనను ఒక్క క్షణంలో సర్వనాశనం చేస్తుంది అణు ఆయుదం ఇది ఒక అతి బయంకరమైన నిజం హృదయ విదారకరం

అందుకే ఈ ప్రపంచ దేశాల కుల-మత-జాతి వర్ణ వర్గాలు మూకుమ్మడిగా కృషిచేసి హద్దుమీరిన అణుశక్తి వద్దంటే వద్దని మానవాళి శ్రేయస్సుకే ఉపయోగించాలని అణుశక్తి వలన కలిగే నాశనాన్ని ఆపాలని అణుశక్తిని హద్దులో ఉంచాలని అబివృద్ది

చెందిన చెందుతున్న చెందనున్న దేశాలక తెలియ చేద్దాం ... ఉద యుద్ధాలు అహంకారాన్ని అణిచివేద్దాం ... శేషాలను ... ఆయుధాలు ... సర్వదా తుడిచివేద్దాం

హిరోషిమా నాగసాకి చరిత్రలు పురుగుపట్టిన ... అహంకారం ... గంకిట నిదర్శనాలు అందుకే ముమ్ముందు రానున్న ... ప్రమాదాలను ... ఆయుధాలను ... యుద్ధాలను ఆపేద్దాం అంతర్జాతీయ-గ్రహాంతర శాంతిని స్థాపిద్దాం ముందు తరాల ప్రతి ప్రాణి హృదయంతో కలకాలం జీవిద్దాం ఇదే మన ధ్యేయం ఇదే ... భారతీయుల సందేశం జై హింద్

*అంకితం ... అణు ఆయుధాలను వ్యతిరేకించే ప్రపంచ ప్రజలకు ... దేశాలకు ... ప్రయోగం చేసుకొను వారికి*

*సందర్భం - అణు ఆయుధ నిషేధ ... సర్వ ... సమావేశం ... తేది 10-4-11 వేయి కవితల ప్రసంగం*

# 25 అబార్షన్

సార్ ఇంకా ఇద్దరు పేషేంట్లున్నారు సార్ అన్నాడు ప్యూన్ రమ్మను అన్నాను ఒక యువజంట లోనికి వచ్చింది కూర్చోమన్నాను ఇంకా ఎవరైనా ఉన్నారా? అన్నాను లేరు సార్ వీళ్లిద్దరే అన్నాడు ప్యూన్ చెప్పండి మీ ప్రాబ్లం అన్నాను అబార్షన్ చేయించుకోవడానికి వచ్చాం అన్నారు ఆ జంట మంచిది కేసు రిజిష్టర్ చేయాలికదా పేర్లు చెప్పమన్నాను చెప్పలేదు ఎన్నెళ్ళు అన్నాను మూడవ నెల అంది అమ్మాయి ఏం చేస్తుంటారు అన్నాను యూనివర్సిటీలో డాక్టరేట్ చేస్తున్నాం అంది అమ్మాయి నీ భర్త? అన్నాను పేరు చెప్పింది కాని ఆయన ఇంకా నాకు భర్త కాలేదు బాయ్ ఫ్రెండ్ మాత్రమే అంది అమ్మాయి మేము ఇద్దరం ప్రేమించుకున్నాం ఆయన నా క్లాస్‌మేట్ ఆయన కూడా డాక్టరేట్ చేస్తున్నాడు నాతో పాటే అంది ఎక్కడుంటున్నారు అన్నాను నేను గర్ల్స్ హాస్టల్లో ఆయన బాయ్స్ హాస్టల్లో ఒకే యూనివర్శిటీ క్యాంపస్‌లో అంది అమ్మాయి మీరు ఇద్దరు ప్రేమించుకున్నారు అవునా? అన్నాను అదేంటి? అలాంటారు అవును ప్రేమించుకున్నాం అంది అమ్మాయి మరి పెండ్లి చేసుకోపోయారా? అన్నాను ఇక పి హెచ్ డి పూర్తి కావడానికి సంవత్సరం పడుతుంది ఇంట్లో ఈ విషయం ఇంకా ఎవ్వరికి చెప్పలేదు ఇంతలో ఇలా అయ్యింది అందుకే అబార్షన్ చేయించుకోవడానికి వచ్చాం అన్నాడు అబ్బాయి ఇద్దరు చాలా చక్కగా ఉన్నారు వారి ఆర్థిక స్తోమత చూస్తే ఒక మధ్య క టుంబానికి చెంది ఉంటారు లేక ంచే ప్రభుత్వ అబార్షన్

ఉటుంక ఎంపికొస్తారు ఉపెక స్వామ

అబార్షన్ ఎలాగు పెం డమక ందామని అపెకుంటున్నారు కదా? పెండ్లి కూడా తప్పకుండా చేసుకుందాం అనుక ంటున్నారు కదా? ఎండ్లి ఎప్పటికైనా తప్పదు కదా ఎలాగు గర్భిణి వస్తుంది ఎండ్లి చేసుక ంటే పోతే అన్నాను ఎండ్లి అవుతుంది పాపను కొన్చు డబ్బులు ఎలాసైన వస్తాయి ఒక సంవత్సరంతో ఎండ్లిచేసుకొని రండి అబార్షన్ చేస్తాం అన్నాను

వద్దండి గొడవ అవుతుంది అటు వైపు ఇటువైపు మా పేరెంట్స్‌కు తెలియదు అదీ గర్భిణితో ఉండగా ఎండ్లి అంతా గొడవ గొడవ పది మందిలో పలువన మా తల్లిదండ్రులు మమ్ము ంను తంతారు వాళ్ళు తన్నక ంటారు అంది అమ్మాయి ఆవిడ ప్రేమిక డు ఆ అబ్బాయి కూడా అదే అన్నాడు

అబార్షన్ చేయి ంచుక ంటే చాలా సమస్యలుంటాయి ఒక ఇద్దరు ఎల్లలను కన్న తర్వాత క ంటం నియంత్రణ అపరేషన్ చేసుకుంటే మంచిది ఇప్పుడే అబార్షన్ చేస్తే మళ్ళీ జన్మలో మీకు ఎల్లలు పుట్టకపోవచ్చు? అలాంటి సమస్యలుంటాయి అబార్షన్ చేయించుకుంటె బాగా ఆలోచించుకోండి అన్నాను అబార్షన్ అయిన తర్వాత ఒకవేళ ఆయన నిన్ను ఎండ్లి చెసుకోకపోతే? వదిలేసిపోతే? ఆలోచించుకో అన్నాను అలాంటి వారు కాదు వారు చాలా మంచివారు నేనంటే ప్రాణం నన్ను చూడకుండ ఒక క్షణం కూడా ఉండలేరు అంది గర్భిణితో ఉన్న ప్రియురాలు అందరు ఆడవాళ్లు అనే మాటె అది స్త్రీ పురుషుణ్ణి పూర్తిగా నమ్ముతుంది పురుషుడు పూర్తిగా స్త్రీని నమ్మిస్తాడు స్త్రీ మోసపోతుంది అబార్షన్ చేయించుకున్నాక ఆయన నిన్ను విడిచి పారిపోతే ఎమి చేస్తావు? నీవు ఏ ఆధారంతో పోరాటం చేస్తావు అన్నాను సంతకం చేయమంటే చేయనంటాడు చేస్తే ఎవరో దానా చేయాలి భర్తని కాదు కదా? అంటాడు ప్రియుడు నాకెదో అనుమానంగా ఉంది అబ్బాయితో గంటసేపు మాట్లాడి మళ్ళీ వచ్చి చెప్ప మన్నాను అమ్మాయితో

ఒక గంట తర్వాత వచ్చి డాక్టర్ అతని మీద నాకేదో అనుమానం కలుగుతుంది అంది అబార్షన్ చేసుక ంటానే ఎండ్లి చేసుక ంటా అంటాడు ఎంది కో ఏమో? సంతకం ఎట్టనంటాడ వాళ్ల అమ్మ నాన్నలతో మాట్లాడుదామంటే వద్దంటాడ అబార్షన్ చెయించుకోపోతే చంపేస్తా నంటున్నాడు ఎటేటో మాట్లాడేస్తున్నాడండి మీరు ఎలా చెపితే అలా చేస్తానంది అమ్మాయి అయితే అడ్మిట్ కమ్మన్నాను అడ్మిట్ చేశాను నేను చెప్పినట్లుగా చేయమన్నాను కొన్ని పరీక్షలు చె రేపు అబార్షన్ చేస్తానని అతనితో చెప్పాను ఓకే అన్నాడు అబ్బాయి

తెల్లవారేసరికి అబ్బాయి తల్లిదండ్రులు అమ్మాయి తల్లిదండ్రులు వచ్చారు అది మా ప్రమికుడు బెంబేలెత్తిపోయాడు మిమ్మల్ని ఎవరు పిలిచారు అన్నాడు అబ్బాయి వారు వీరు ఈ జంట పర్షణ పడ్డారు మీ అమ్మాయే మా వాణ్ణి బుట్టలో వేసుకుంది లేదు మీ అబ్బాయే మా అమ్మాయిని బుట్టలో వేసుకున్నాడు అంటు వాదోపవాదాలకు దిగారు ఒకరినొకరు తిట్టుకుంటు జంటను తిడ్తున్నారు కొద్దిసేపట తర్వాత వారిని కోపటికి పిలిచి ఏ నిర్ణయం చేశారని అడిగాను

గర్భిణీగా ఉన్నప్పుడు పెండ్లి చేసుకుంటే లోకం ఒప్పుకోదుగా? అన్నాడు అబ్బాయి పెండ్లి కాకుండానే గర్భిణి రావడం కూడా లోకం ఒప్పుకోదుగా? అన్నాను అందుకే అబార్షన్ చేయండి అన్నాడు అబ్బాయి అందుకే పెండ్లి చేసుకోండి అన్నాను అబ్బాయితో ఆయన చప్పుడు చేయలేదు మీరు అబార్షన్ చేయనంటే మీ మీద నేను కంప్లైంట్ ఇస్తా అన్నాడు అబ్బాయి ఇవ్వొచ్చు మీకు ఆ హక్కు ఉంది అబార్షన్ చేయనంటే నాపై యాక్షన్ తీసుకుంటారు కూడా అబార్షన్ చట్టం అలా ఉంది కాని చట్టాన్ని సద్వినియోగం చేసుకోవాలి గాని దుర్వినియోగం చేసుకోకూడదు సొంత పూచి పైన లేదా ఎవరైన బాధ్యులైన వారు వెంట ఉండి సంతకం చేస్తే బాధ్యత వహిస్తే తప్పకుండా అబార్షన్ చేస్తా మరి మీ కేసు? పెండ్లి కాని గర్భవతికి అబార్షన్ కొంచెం అన్ని వైపుల జాగ్రత్తగా ఉండాలి భర్త అయినా అన్న అయినా తల్లిదండ్రులైనా కన్సెంట్ సంతకం చేయాలి లేకట్లయితే లీగల్ ప్రాబ్లం రావచ్చు అన్నాను అబార్షన్ చేయకుండా ఉండటానికి ఏవో సాకులు చెప్పుతున్నారు అన్నారు ఆ జంట చదువుకున్న వారు మీరు ఎంత చెప్పినా వినటం లేదు అబ్బాయి మాత్రం సంతకం చేయనన్నాడు ఎందుకో మరి? బాగా ఆలోచించుకోండి అని అన్నాను అబ్బాయిని బయటికి పంపించి అమ్మాయితో మాట్లాడాను చూడమ్మ నీవు అబార్షన్ చేయించుకుంటే అతడు నిన్ను పెండ్లి చేసుకుంటాడని నీకు బాగా నమ్మకం ఉందా? అన్నాను ఉంది చాలా మంచివాడు అతనికి నేనంటే ప్రాణం నేను లేకుండా ఆయన ఉండలేడు ఆయన లేకుండా నేను ఒక క్షణం ఉండలేను తప్పకుండా చేసుకుంటాడు అని గట్టిగా ధైర్యంతో చెప్పింది సరే ఆయనతో సంతకం పెట్టించండి అన్నాను గొడవ పడితే లాభం లేదు మీరు అందరు సంతకం పెట్టండి అబార్షన్ చేస్తాం అన్నాను అందుకు అందరు ఒప్పుకున్నారు అందరు సంతకాలు చేశారు అమ్మాయి మాత్రం సంతకం చేయలేదు ఎందుకని అడిగాను అబార్షన్ చేసిన తర్వాత ఎవరి దారిన వారు వెళ్ళిపోతారు నన్ను వదిలి వేస్తారని అనిపిస్తుందని అంది అమ్మాయి

అందరు ఒప్పుకున్నట్లేనా? అవును అన్నారు అందరు సంతకాలు పెట్టి ఇరుక్కుపోయారు ఈ ఆధారంతో అమ్మాయి కంప్లైంట్ ఇస్తే అందరు జైలుకు పోతారు జాగ్రత్త

ఉవె కావచ్చు కాకపోవచ్చు కొందం దారుు వేరు వేరుగా మరికొందరి దారులు ఒకే ఉందావో వెడుతున్నట్లు తోచింది మొత్తానికి మళ్ళీ మనం పుడతాం మన ఆత్మలు మళ్ళీ మళ్ళీ పుడుతుంటాయి మనం ఇప్పుడు మరణించినా పర్వాలేదు అని తృప్తిపడి మరణాన్ని ధైర్యంగా ఎదుర్కోవాలి ఉంటూ దానికి సాధనం దైవ చింతన ఆద్యాత్మిక చింతన ఉంటూ సభ ముగించారు చావు తప్పదు కాబట్టి

సభానంతరం వాగా ఉండిపోయి ఇంటికి వచ్చి బోజనం చేసి బెడ్రూంలోకి వెళ్ళాను మేము కొత్తగా కట్టుకొన్న ఇల్లు వెనుకాల కటుౌంచి ఓ స్త్రీపురుషులు మాట్లాడుకుంటున్న సంభాషణ వినపడసాగింది వెంటనే మా ఆవిడను పిలిచి వెళ్లి వెనుకాల ఎవ్వరో మాట్లాడుతున్నారు చూడమన్నాను రెండు పున్నమి వెన్నెల ఎద్ద ఎద్ద రెండు రాతి గుండ్లు వాటి మట్టి చెట్లు బాగుచేయలేక వదలివేశాం చుట్టు కాంపౌండు మా ఆవిడ వెళ్ళి చూసి ఎవ్వరు లెరు అంది అయినా మళ్ళీ ఏవో మాటలు వినవస్తున్నాయి పిల్లలని వెళ్ళి చూడమన్నాను ఎవ్వరు లేరని చెప్పారు మళ్ళీ మళ్ళీ అర్ధరాత్రి వరకు మాట వినవంచడం వల్ల నేనే వెళ్ళి చూశాను ఆశ్చర్యం వేసింది ఒక స్త్రీ, ఓ పురుషుడు సర్వాంగ సుందరంగా ఉన్నారు మద్య వయస్కులు కదులడం లేరు మెదులడం లేరు ఒళ్ళాంతా బంగారంతో మెరిసిపోతున్నారు ఆ ఇద్దరు బంగారు విగ్రహాలు నన్ను చూసి మాట్లాడం ఆపివేనారు ఎవరు మీరు అని అడిగాను సమాదానం లేదు ఇదంతా చూస్తున్న మా ఆవిడ నీకేమైన ఎచ్చి పట్టిందా ఎవ్వరితో మాట్లాడుతున్నావు అంది వారితో కనిపించటంలే ఆ ఇద్దరు నీ నా రూపంలో ఉన్న ఆ జంటతో అన్నాను నవ్వి మీకు మరీ ఎచ్చెక్కింది అనవసరంగా సభలకు సమావేశాలకు పోవద్దు అంటే వింటారా సభలో ఏదో జరుగుతుంది ఇంట్లో ఇలా జరుగుతుంది లోనికి రండి అంది మా ఆవిడ కాదు కాదు వారు ఇద్దరు నిలువెత్తు బంగారు విగ్రహాలు కనబడ తుంటే అక్కడ ఏమి లేదంటావు పైగా నాకు ఎచ్చి పట్టిందంటావేంటి నీకే ఎచ్చి అన్నాను ఇంట్లో వాళ్ళు అందరు లేచి వచ్చారు వారికి ఎవ్వరికి ఏమి కనిపించటం లేదు నాకు మాత్రం కనిపిస్తున్నాయి కావాలంటే వాటిని పట్టుకొని తెస్తానని ఆ విగ్రహాల దగ్గరికి వెళ్ళి వాటిని పట్టుకొని లేపడానికి ప్రయత్నించాను నేను వాటిని తాకగానే ఆ విగ్రహాలు మావాళ్లందరికి కనిపించసాగాయి అందరు ఆశ్చర్యపోయారు మా పిల్లలు వాళ్ళ అచ్చం అమ్మ డాడులాగా ఉన్నారు వారు మన అమ్మనాన్నలే అనడం అవును నా కొడుకు కోడలె అని మా అమ్మ నాన్న అనడం అందరు వింతగా చెప్పుకోవడం ఇంకా కొంత మంది రావడం వెన్నెల రాత్రిలో చుట్టు ప్రక్కల వాళ్లు వచ్చి చూడసాగారు నేను విగ్రహాలను వదలి ఇటు కొంచెం జరిగాను అంతే విగ్రహాలు కనిపించకుండా పోయాయి ఏమండి విగ్రహాలు కనిపించకుండా పోయాయి ఇదేంటి అంటూ మా ఆవిడ నా దగరకు

వచ్చింది అటు ఇటు చేతులు చాచి గుడ్డదానిలా తారసపడ సాగింది నాకు మాత్రం విగ్రహాలు కనిపిస్తున్నాయి నీకెందుకు కనిపించటంలేదు? అన్నాను ఎలాగో ఆవిడ చేతిని విగ్రహాలకు తాకంచాను అంతే విగ్రహాలు అందరికి మళ్ళీ కనిపించసాగాయి వచ్చిన వాళ్లందరు ఆశ్చర్యంతో ఆనందోత్సహంతో అరవసాగారు మా ఆవిడ చేయి తీయగానే ఆ విగ్రహాలు మాయమై పోతున్నాయి కనిపించడం లేదు మళ్లి చేయి తాకగానే కనిపిస్తున్నాయి అంతే వార్త దావానలంగా ప్రాకింది కాలనీ వారు చుట్టు ప్రక్క ప్రాంతాలవాళ్ళు తండోపతండాలుగా రాసాగారు జనం విరుచుకపడసాగారు జనం ఎక్కువ కాగానే మా ఆవిడ ఇంట్లో నుంచి రావడం విగ్రహాలను తాకడం అవి ప్రజలకు కనిపించడం ఇది రోజు ఒక కార్యక్రమంగా క్రమంగా మారిపోయింది మా ఆవిడను ఒక దేవతలాగ ప్రజలు చూడసాగారు ప్రముఖులు మంత్రులు రాసాగారు ప్రభుత్వం కట్టుదిట్టం చేసింది పోలీసులు ట్రాఫిక్ కంట్రోల్ అంతా హంగామా రోజు రాత్రి పగలు ప్రదర్శన జరుగసాగింది ప్రజలు రావడం మా ఆవిడ విగ్రహాలు తాకిండం అందరికి విగ్రహాలు కనిపించడం చేయి తీయగానే విగ్రహాలు మాయం అవడం అందరు ఆశ్చర్యపడి చూడడం మా ఆవిడ విసుక్కోవడం చిరాకుతో అలసిపోయింది విసిగెత్తిపోయింది మా ఆవిడ బయటకు రాకపోతే ప్రజలు ఎద్ద ఎత్తున అరవడం డిమాండు చేయడం గోల చేయడం మొదలైంది ఇంట్లో మావాళ్ళందరు విసుగెత్తిపోయారు సెలవు రోజు ఆ రెండు విగ్రహాలు మాతో కలసి బోజనం చేసి మా పిల్లలతో మాతో మా తల్లిదండ్రులతో మా కుటుంబీకులతో మాలాగే ప్రవర్తించసాగారు మేమే వారుగా వారే మేముగా కలిసిమెలసి ఉండేవారు మా పిల్లలు కన్ఫ్యూజ్ అయ్యేవారు మరుసటి రోజు నుండి కద మాములే ఇన్ని రోజులుగా మా పిల్లలు వారిని పోటోలు తీసారు పత్రికల వాళ్లు విడియోలు కెమెరాలు డిజటల్ ఇన్‌ప్రారెడ్ కెమెరాలు రకరకాల మీడియాలు ప్రయత్నించాయి కాని వాటిని బందించలేకపోయారు పత్రికలలో టి వి లలో చూపించలేకపోయారు చూస్తే డైరెక్టుగానే చూడాలి కనిపిస్తాయే తప్ప చిత్రీకరించడం సాధ్యం కావేదు వాళ్ళను మా పిల్లలు అమ్మా డాడ అని పిలువసాగారు వారు తమ పిల్లలుగా పిలవసాగారు మేము వారు ఒకటిగానే మారిపోయాం తేడాలు లేకుండా ఒకరి నొకరు గుర్తించకుండా ఉన్నాం అలా ఒకనెల జరిగింది మళ్ళీ పున్నమి వెన్నెల రాత్రి వచ్చింది మా ప్రతిరూపాలు మాతో ఇలా చెప్పసాగాయి

పదిహేను వేల సంవత్సరాల క్రతం ఇక్కడ ఒక బ్రహ్మాండమైన అందాల నగరం ఉండేది మేము ఇరువురం బార్యబర్తలుగా జీవిస్తు మంచి పేరు తెచ్చుకొని అన్ని బాద్యతలు నెరవేర్చాం అంతిమ దశ వచ్చిన తర్వాత మరణానికి దగర అవుతు బగవంత ణ్ణి

ప్రార్థిస్తాము మీ కోసం [illegible] భగవంతుడు ప్రసాదించాడు ముక్తి మేమిద్దరం వారి
పిల్లలుగా పుట్టాలని ప్రకృతి మమ్మల్ని జన్మ ఉంటామని అన్నాము మేము విడగా బ్రతుక
లేము అప్పుడు భగవంతుడు మేము ఇలా జనించేట్లు అనుకుంటున్నాం అత్త
[illegible] ఏమి [illegible] జనించటం జరుగుతుంది పదే పదే కొందరు జనిస్తారు అర్థం
చేసుకొని [illegible] కొన్ని [illegible] కవతారాలు
తర్వాత [illegible] మళ్ళీ వారి [illegible] జీవిస్తారు అదే మీ జన్మ సుకృతం అన్నాడు
భగవంతుడు ఇది మా భాగ్యం కలిగించమని కోరుకున్నాం తథాస్తు అన్నాడు
మీ ఎంతవరకు ఆనాటి నుండి ఈనాటి వరకు మా అత్తమామ మీరు ఎప్పుడు కలిసి జీవిస్తారో
చూడాలని ఇక్కడ వేచి ఉన్నాం ఇది దేవుడు మాకు ఇచ్చిన వరం ఇది ఈనాటికి పూర్తి
అయ్యింది అన్నాయి ఆ మా విగ్రహాలు ఆత్మ ఉండదు ఆత్మ మళ్ళీ మళ్ళీ పుడుతుంది
ఆత్మకు నాశనం లేదని మళ్ళీ ఆత్మలు కలుసుకుంటాయని తెలుసుకున్నాం మీరేం బాధ
మేము వెళ్ళాలి ఈ విషయం భగవంతునికి చెప్పి వారికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి ఇక
మేము ఉండటానికి వీలులేదు పౌర్ణమి చంద్రుడు కనిపించకుండా పోయే లోపల మేము
వెళ్ళిపోవాలి వెళ్ళాలి ఇది భగవంతుని ఆజ్ఞ ఆలస్యం చేస్తుండగానే వెళ్ళాలి మీరు
మమ్మల్ని తాకకుండా ఉండండి ఆకాశంలోకి తేలుతూ వెళ్ళిపోతామన్నాయి మా ఆత్మలు

మేము వద్దన్నాం కాదన్నాం పిల్లలు మా అమ్మానాన్నలు కుటుంబీకులు అందరు బావురుమన్నారు ఏడ్వసాగారు మా ఆవిడ కూడా ఏడ్వసాగింది నేను కూడా ఆపడానికి ప్రయత్నించాను

మేము చెప్పినట్లు చేయకపోతే ఇప్పుడు మీ ఆత్మలమైన మేము మరణిస్తాం ఆత్మ మరణిస్తే ఏమౌతుందో ఎవరికి తెలియదు మళ్ళీ మేము కలుసుకునే యోగం ఉండదు అందుకే మాకు వీడ్కోలు పలకండి మేము ఇరువురం విడిగా బ్రతుకలేము అంటూ ప్రాధేయపడ్డాయి బంగారు విగ్రహాలు విగ్రహాలు కావు- కదులుతున్న బంగారు మానవాకృతులు మా ఆత్మలు ఆకాశంలో తేలుతూ పైకి పోసాగాయి మా పిల్లలు డాడి మమ్మీ అంటూ ఆకాశం వైపు చూస్తు అరవసాగారు నాయనా తల్లి అంటూ ఏడ్వసాగారు మా తల్లి దండ్రులు వద్దని చెప్పండి ఆపండి అంటూ మొత్తుకోసాగింది మా ఆవిడ వీడ్కోలు వ్యవహారమంతా చిత్రీకరించారు ప్రజలు పాత్రికేయులు ఫోటో గ్రాఫర్లు లైవ్ టెలికాస్ట్ మొదలుపెట్టారు కాని లాభం లేకపోయింది చిత్రాలుగా ఛాయ చిత్రాలుగా బంధించలేక పోతున్నాం లైవ్ టెలికాస్ట్ చూపలేకపోతున్నాం కంటికి కనిపిస్తున్నాయి కాని ఏ మీడియాలో

కూడా బందించవేక పోతున్నాం అంటూ గొడవ చేయసాగారు వితేఖరుు నేను కూడా ఆగండి ఆగండు వెళ్లొద్దు వెళ్లొద్దు అంటూ చేతులు పైక ఎత్తి అరవసాగాను

ఒయ్ ఓయ్ ఎంట ీ కదా మీటింగులు సభు వద్దంటే వినవు ఎదో విం ావు వస్తావు నిద్దురలో ఇలా అరుస్తుంటావు కలో ఎమిట నీ కద అంది మా ఆవిడ ిద్దుర నుండ లేప రోజు ఇది మామూలులేగా నాక ఉంటూ ఇంతకు ఆ అందమైన ఉమ్మాయి ఎవరు ఉంది మా ఆవిడ

ఆ ఆ అందమైన ఉమ్మాయే ాా అందమైనది మళ్లీ మరవవేనిది పెండ్ల ఉంటే జన్మ జన్మ దాసే చేసుక ంటా ు ఆది ముగ్గురు ఎల్లల తల్లి ముసలిది అందమమైన ముసలిది అన్నాను ఇంతకు ఎవరు ఉంది మా ఆవిడ ఇంకెవ్వరు అద్దం చూసుకో అంటూ కల కద చెప్పాను తెల్లవార్లు – పొద్దుపొడిచే దాకా – వాయ్ తెచ్చేదాకా – వాల్లే ఒడాయి ఇక వాల్లే అందరు ఆడవాళ్లక మీరు కదు ఇలాగే చెబుతారు కాబోలు ఉంది మా ఆవిడ నేనేమైన చూడ వచ్చానా? ఇదంతా ిజం అని నమ్మలా? అంటూ ఎదో చెబుతావు అంటూ వాయ్ ఇచ్చి వెళ్ళింది వంటల్లోక ఉదోలాగ మాస్తూ

*అంకితం ఈ కలకద మా ఆవిడకు మరియు సంతృప్తితో జీవించే దంపతులకు*
*జనవరి 001 – నా బల*

# 27 అన్నం దొంగ

దొంగ దొంగ దొంగ సార్ దొంగను పట్టాను సార్ పట్ట రూంలెప తాళం వేసినాం సార్ నేను ఇంకా పనోల్లం అందరం కలిసి పట్టుకొని బాగా తన్ని గుద్ది రూంల పడేస తాళం వేసుపట్టినాం సార్ ఉంటూ పోన్‌లో ఉరవసాగాడు మా ఇళ్ళు కడ్తున్న దొంగమేస్త్రి

మేము పైన పని చేస్తున్నం వీడెవ్వడో కంద పైన బంగ్లంతా తిరుగుతూ అన్ని మూట గట్టుకొని పోతుండు అప్పుడు సూసిన సార్ ఆ మూట వాన్ని దొర్క పట్ట కొట్టి రూంవేసిన సార్ మీరు వెంటనే రాండ్రి వచ్చేటప్పుడు పోలీసులను తొల్కరాండ్ర మేమందరం ఈడనే కూసుంటం జల్దినరా మరి ఎంతసేపట్ల వస్తవు ఉన్నాడు మేస్త్రి ఉటువైపు నుండి

ముందు పోలీసులకు చెప్పాలా? వీడే ఒక ఎద్ద దొంగ ఎమెంటు ఇసుక ఇనుము ఇటుకలు అమ్మేసేవాడు ఓ ఇల్లు కట్టాలంటే స్తోమతకు మించి డబ్బు ఖర్చు ఎట్టాలి ఓ

మద్య తరగతి వాళ్ళ ఉక్రమ సంపాదనకు పాల్పడాలి లేదా అప్పుల పాలవ్వాల ఎప్పుడే ఇల్లు ఉప్పుతుంది దొంగతనం చేయడానికి కూడా విలువైన వస్తువులు ఎమి ఉంటాయి? ఎక్కడి పటపగలు ఉందరు ఉండగా ఎమి తెలి దగర దొంగతనం చేసేవాడు ఎమి దొంగా ఎసలు వాడు దొంగెనా ఉని ఉనుమానం వచ్చింది పోలీసులకు వెంటనే చెప్పడం వద్దనుకొని ఉసలు సంగతేమిటో తెలుసుకొని ఆ తర్వాత పోలీసులకు చెప్పవచ్చు ఉని ఎరిపరి విదాలుగా ఆలోచిస్తు ఎక్కడక వెరుకున్నాను ఎటక వాలా యారం చుట్టు ప్రక్కల ఇండ్లు లేవు నేనే మొదట వాళ్ల ఇల్లు కట్టున్నాను అసలు ఎందుకు మొదలుఎట్టానో? దొంగలు రౌడిలు వాచ్‌మెన్ మెస్త్రీల ఉక్రమాలు ఇల్లు లేకపోతే బ్రతుకలేమా? కరాయి ఇల్లే హాయి ఎని మనసులో ఉనుక ంటూ సైట్ దగ్గరకు వచ్చేశాను

ఎక్కడి దొంగ ఉన్నాను ఎదే స్టోర్ రూంలో ఉన్నాడు మేస్త్రి దానికి తాళం వేసి ఉంది మేము వాణ్ణి పట్టి అందులో వేశాం అంటూ గొప్పగా చెప్పుకోసాగాడు అది సరే వాణ్ణి బయటక తీసుకరండి ఉన్నాను ఎమ్మో ఇంకేమైనా ఉందా? వాడు పారైనా పోఎచ్చు లేకుంటె పొడ్సైనా పొవచ్చు ఇంత మందిలో వాడేమి వారిపోడు అందరు ఇనుప కడ్డిలు పట్టుకొండి వాడు గొడవ చేస్తే మనపని మనం చేద్దాం అన్నాను నేనూ ఓ కర్ర చేత పట్టుకొన్నాను ఎందుకైన మంచిదని మేస్త్రీమరొ ఇద్దరు పనోళ్లు తాళం తీస లోనిక వెళ్ళారు చాలా సేపటి వరకు ఎవ్వరు బయటక రావటం లేదు బయమేసింది దొంగ వరిపోయాడా అన్న ఉనుమానం వేసింది ఎమైంది మేస్త్రి అన్నాను ఎమి లేదు దొంగ బయటకు రానంటున్నాడు సార్ ఉసలు లేస్తెలెడు సార్ ఉని ఉన్నాడు లేపుకొని రండి ఎందుకు రాడు? అన్నాను చేరో వైపు చేతులు పట్టుకొని లాక్కుంటూ రాసాగారు వాణ్ణి చూడగానే నా చేతిలో ఉన్న కర్ర ఒక్కసారిగా నాకు తెలియకుండానె క్రిందపడిపోయింది నాకు ఒళ్ళంతా చెమటలు పట్టసాగింది తల తిరిగిపోయింది మైకం కమ్ము సాగింది అమాంతం ప్రక్కనే ఉన్న ఇసుక కుప్పలో కుప్ప కూలిపోయాను

ఎముకలు గడ్డం అచ్చం అప్పుడె శిలువ నుండి ఊడదీసి లాక్కురాబడుతున్న యేసుప్రబువులా దేశం కొరకు వాంధీ ముస్లిం ఎమైక్యత కొరకు దీక్షకాల నిరహార దీక్ష చెసిచే దీక్ష ఎదిలేముందు నిమ్మరసం తీసుకోబోతున్న ఎముకల గూడైన శాంతి విహ్వాం మహాత్మాగాందీలాగా శాంతి - సంప దర్మం కొరకు పోరాటం చెసి చేసి బోది వృక్షం నిడలో మౌనం ముద్రలో అంతిమ దశలొ చర్మం ఎముకలే మిగిలిన తదాగతునిగా తన జీవితమే ఒక ప్రజాస్వామ్యంగా పొరాటం చేసిచేసి కాలజ్ఞానం వ్రాసి వ్రాసి జీవ సమాదిక వెళ్ళే ముందు ఎముకలు పోగులు మాత్రమే మిగిలిన వీరబ్రహ్మేంద్రస్వామిలా నిజానిజాలు వర్ణించి వర్ణించి కృశించి కృశించి క్రుంగి క్రుంగి ఎవసాన దశకు చేరుకున్న వేమనలా

ఎర్రటెండలో ఓ దరా వుంద చేతులు పైకెత్తి పడివుండి అల్లా ఇల్లా అంటూ బిక్షమెత్తుకుంటున్న సాహెబ్‌లా కనిపించసాగాడు అతను వాక్కొని ఎత్తి పడేశారు పనివాళ్ళు నా ముందు పేరు అన్నాను చెప్పాడు వినిపించలేదు బాగా వాని మాట ఇగాదంలో నుండ వచ్చినట్లనిపించింది ఎక్కడ ఉండేది? రోడ్డు ప్రక్కన గుడిసెలో అన్నాడు మళ్ళీ బాగా వినిపించలేదు కొంచెం మంచినీళ్ళు ఇచ్చాను త్రాగాడు బార్య పిల్లలు? ఉన్నారు అన్నాడు ఎక్కడ? అన్నాను ఏమో తెలియదు మూడు రోజులైంది వాళ్ళను చూసి అన్నాడు దొంగ నీ బార్య? - నాలాగే ఎక్కడో తిరుగుతూంటుంది నీ పిల్లలు? - అక్కడె గుడిసెలో ఉంటారు చిన్నవాళ్ళు ఒకడు మూడు ఒకడు ఐదు సంవత్సరాలు అన్నాడు దొంగ దెబ్బలు బాగా తగిలాయా? - అవును తగులవా? కొట్టిన తరువాత అన్నాడు దొంగతనం చేశాను కొట్టారు వారి తప్పేముంది అన్నాడు దొంగ నీరసంగా ఊపిరి తీసుకో రావడం లెదు పక్క బొక్కలు కటుక్కుమంటున్నాయి కాల్తోని తన్నిండయ్యా అని అన్నాడు దొంగ

ఇంతకు నీవు చేసిన దొంగతనమేంటి? అన్నాను చేతితో చూపలేక ప్రక్కన ఉన్న మా వాళ్ళు లాక్కొని దాచి పెట్టిన దొంగసొమ్ము ఇనుప ముక్కల కట్టను తన కళ్ళతో చూపించాడు అది చూడగానే మరోసారి గుండె ఆగిపోయినంత పని అయిపోయింది జానెడు బెత్తెడు ఐదారు ఇనుప ముక్కలు కట్టగా చుట్టి ఉన్నాయి

అన్నం తిని ఎన్నాళ్ళైంది? నిన్న తిన్నాను ఒక్కసారి ఇంకా ఈరోజు తినలేదు ఎప్పుడు తింటావు? ఈ ఏరుకున్న ఇనుప ముక్కలు అమ్ముకొని ఆ పైసలతో బియ్యం కొనుక్కొని గుడిసెకు పోయి న తర్వాత అని అన్నాడు బిచ్చం ఎత్తుకోలేకపోయావా? అన్నాను అది అంటేనే అసహ్యం అన్నాడు దొంగ ఈ దొంగతనం కాదా? ఏమో నాకు తెలియదు నాకు అన్నం కావాలి ఇక నాకు ఇంకేమీ అక్కర లేదన్నాడు దొంగ

నీ బార్య గుడిసెలో ఉంటుందా ఇప్పుడు ? ఆమె కూడా ఇనప ముక్కలు ఏరుకోవడానికి పోయి ఉంటుంది అది తిన్నదో తినలేదో యాడుందో ఏమో ? అంటూ ఇక మాట్లాడలేక పోయాడు దొంగవెదవ

మేస్త్రి ఇలా రా - హోటల్కెళ్ళి ఓ నాలుగు ప్యాకెట్లు అన్నం తీసుకురా అని పైసలు స్కూటర్ ఇచ్చి మేస్త్రిని పంపించాను అన్నం తెచ్చాడు మేస్త్రి ఓ ప్యాకెటు దొంగకిచ్చి తినమన్నాను తినలేక పోతున్నాడు దొంగ మేస్త్రిని తినిపించమన్నాను తినిపించాడు నీరు తాగాడు కాసేపు పడుకో అన్నాను

ఇదేంది సార్ దొంగక ఏదేదో మర్యాదలు చెస్తున్నవు? నేను తన్ని పట్టుకుంటే నా చేతనే తిండి తినిపిస్తున్నవు? నేను చేసింది తప్పా? నువ్వు చేసింది గొప్పా? నేను దివానగాన్ని

# 28 కిచ్ - కిచ్

కిచ్ కిచ్ కిచ్ కిచ్

అన్నయ్యా అదిగో చప్పుడు

మళ్ళీ కిచ్ కిచ్

అన్నయ్యా అదిగో పిట్టపిల్ల

ఎక్కడా? ఏమో?

మళ్ళీ కిచ్ కిచ్

అది పిట్టపిల్లా? కోడిపిల్లా? ఏమో ఎక్కడో?

ఏదీ తెలియడం లేదు

కిచ్ కిచ్ శబ్దం నన్ను నా ఇద్దరు చెల్లెండ్లను నిలువ నియ్యడం లేదు మా అమ్మ పనికి పోయింది నాన్న కూడా పనికి వెళ్ళాడు మేమె ముగురం గుడ అంతా వెతికాం పాత కుండలు కుక్కిమంచం కింద ఇంటి చుట్టూ ఉన్న రాతి కట్టంతో రాయి రాయి పొయ్యిల కట్టెల కుప్పలో చేద బావి చుట్టు వెతికాం కోడిపిల్ల గాని పిట్ట పిల్ల గాని కనిపించలేదు మళ్ళీ కిచ్ కిచ్ వెతికి వెతికి అలసిపోయి ఓ చోట గుడిసె ప్రాంగణంలో కూర్చున్నాం కిచ్ కిచ్ మాత్రం వినబడుతూనే ఉంది ఇంతలో అమ్మ వచ్చింది బరువైన మూటతో అంతా చెప్పాం అమ్మ కూడ వెతికింది గుర్తుపట్టింది ఒక చిన్న కుండ ఆ కుండ గోడకు ఉన్న చిలుక్కొయ్యకు వేసి ఉంది అందులో నుండి కిచ్ కిచ్ ఆ తర్వాత కుండను తీసి చూసింది అందులో ఓ చిన్న కోడిపిల్ల చాలా అందంగా ముద్దుగా బొద్దుగా తెల్లగా ఉన్నది అమ్మ చేతిలోకి గెంతి మా మీదకు దూకింది చిన్న చెల్లి నెత్తిన పెద్ద చెల్లి భుజం మీద అటు నుండి నాపై మా దగరే ఉంటూ మా చుట్టే తిరుగసాగింది మమ్మల్ని విడిచి వెళ్ళడం లేదు మాకు అనుమానం వచ్చింది దీని తల్లి ఏది అన్నాం దానికి తల్లి లేదు ఓ రోజు ఐదు పైసలకు ఓ గుడ్డు కొన్నాను మీకు వండి పెట్టేందుకు కుండలో పెట్టి మరిచి పోయాను ఇరువై రోజులకు పైనే అయ్యింది అందులో నుంచి ఓ పిల్ల పుట్టింది దానికి తల్లి? అన్నాం తల్లి లేదు మనమే దానికి తల్లి అంది మా అమ్మ అంతే ఆ రోజు నుండి మా లోకం అంతా ఆ కోడిపిల్లే దాన్ని విడిచి ఒక క్షణమైన ఉండే వాళ్ళం కాదు అది కూడా మా వెంటే ఉండేది నేను రోజు సాతాను బడికి వెళ్ళే వాణ్ణి మా అమ్మా నాన్నా పనికి వెళ్ళేవారు మా ఇద్దరు చెల్లెళ్లు చాలా చిన్న ఆ ఇద్దరిని సాయంత్రం వరకు నేనే చూసుకోవాలి చిన్న చెల్లి బావిలో పడుతుందన్న భయం పెద్ద చెల్లి ఏదో రాయి మీద వేసుకుంటుందోనన్న

యున్నారు చిన్న చెల్లి కోడి పిల్ల కావాలని ఏడ్వ సాగింది పెద్ద చెల్లి ఏడుస్తూ వెతకసాగింది ఇంతలో పెద్ద చెల్లి మాయమైపోయింది కనిపించలేదు చెల్లి ఏమైందిరా? అంది మా అమ్మ ఇక్కడే కోడిపిల్లను వెతుకుతుంది అన్నా చిన్న చెల్లి ఏదో చెప్పుతూ చెయ్యి చాపి చూపించింది అంతే అందరి గుండెలు ఆగిపోయినట్లు అయింది ఇల్లు సదరడం మాని అమ్మ నాన్న నేను పెద్ద చెల్లెను వెతకడం మొదలు పెట్టాం బావిలో గుంతలో నీళ్ళలో అంతా వెతికాం చెల్లి కనిపించలేదు కోడిపిల్ల కనిపించలేదు కడుపుతో ఉన్న మా అమ్మ చిన్న చెల్లిని సంకనేసుకొని ఒకవైపు వెళ్ళింది మా నాన్న మరోవైపు పట్నంలోనికి వెళ్ళాడు నేను కూడా వెతుకుతు గుడిసె వదిలి వెతకసాగాను రాత్రి తొమ్మిదైయింది మధ్యలో ఒక సారి ఇంటికి వచ్చాను అమ్మ నాన్న ఇంకా రాలేరు చెల్లి రాలేదు కోడిపిల్ల రాలేదు టౌను అంతా వెదుకటం మొదలు పెట్టాను పొద్దుగ చిరిగిన గౌనుతో మా చెల్లి కనిపించిందా? అంటూ అడుగుతూ పరుగెత్తసాగాను అలా పరుగెత్తి పరుగెత్తి ఓ సెనిగెకాయల గిర్నిక చేరుకున్నాను కొన్ని వందల మంది పసి వాళ్ళు నీళ్ళలో తడిసిన సెనిగెకాయలు కుప్పలు పోస్తున్నారు నీరు బురద సెనిగెకాయలు పసివాళ్లు - మా చెల్లె కనపడిందా అన్నాను ఎవ్వరో ఓ పిల్ల ఏడుస్తుంటే ఇంత అన్నం పెట్టి కూర్చోబెట్టాం అంది ఓ కూలి పరుగెత్తుకుంటూ వెళ్ళాను కొండంత ధైర్యం కొండంత సంతోషం వందలాది మంది ఎవ్వరు కనిపించటం లేదు చెల్లి తప్ప వెళ్ళి అందుకున్నాను వెక్కి వెక్కి ఏడుస్తుంది సెనిగెకాయలు తింటూ నన్ను చూచి అన్నయ్య ఎక్కడికి వెళ్ళావు పొద్దటినుండి నిన్ను అమ్మను నాన్నను చెల్లెను కోడిపిల్లను వెతుకుతున్న మీరు అందరు తప్పి పోయారు ఎవ్వరు దొరకలేదు మీ కోసం సెనిగెకాయలు దాచిపెట్టా తిను అంటూ ఏడుస్తూ కోడిపిల్ల దొరికిందా? అంది - ఇంకా దొరకలేదు చెల్లి మాత్రం దొరికింది అంటూ వీపున కూర్చోబెట్టుకొని నాలుగు మైళ్ళు పరుగెత్తుకుంటూ గుడిసెకు వచ్చా బాగా రాత్రి అయింది అమ్మ నాన్న చిన్న చెల్లి ఇంకా కొందరు గుమ్మిగూడి చీకటిలో చిరుదీపం వెలుగులో కూర్చున్నారు అందరు అమ్మ ఏడ్వ సాగింది గుడిసె బయట నుండే అమ్మా అంది చెల్లి అందరు పరుగెత్తుకుంటూ బయటకు వచ్చారు మమ్మల్ని కౌగలించుకున్నారు అమ్మ ఆనందానికి అవధులు లేవు నాన్న నివ్వెరపోయి చూడసాగాడు కోడిపిల్ల దొరికిందా? అంది చెల్లి మళ్ళీ లేదు అన్నారు అందరు అంతే చెల్లి మళ్ళీ ఏడ్వసాగింది రాత్రి అయింది ఎక్కడ ఉందో ఏమో రేపు చూస్తాంలే అన్నాడు నాన్న ఇద్దరు చెల్లెండ్లు కోడిపిల్ల కావాలని మరీ ఏడ్వ సాగారు బాగా రాత్రి అయింది బజారులో గుంతలో నీరు బాగా తగ్గింది చెల్లెండ్లు ఏడుస్తునే ఉన్నారు అమ్మ కోపంతో నోరు ముయ్యండి అంది కోడలేదు పాడులేదు అది చేయబట్టే ఇదంత పాడు కోడి అంటూ అమ్మ అరిచింది ఇద్దరు చెల్లెండ్లు కిక్కురు మనకుండా నోరు మూశారు అంతా నిశ్శబ్దం గుడ్డి దీపం - చిరు కాంతి గుడిసె అంతా బురద బురద కిచ్ కిచ్ కిచ్ కిచ్ శబ్దం అమ్మా అదిగో కోడిపిల్ల అంటూ ఇద్దరు చెల్లెండ్లు

కాకుు గ్రద్దు ఎల్లు ఉన్నాయి దొంగు ఉన్నారు తల్లి కోడతో వాు మేము తల్లుమై ఉన్నప్పటక వాటికి ప్రమాదాలు జరుగుతూనే ఉండేవి ఇద్దరు చెల్లెండ్లు తమ్ముడు నాలుగు కోడపిల్లు కోడి అందరం కలిసే ఉండేవాళ్ళం ఎప్పుడు ఏమౌతుందొనే భయం మాత్రం మాకో ఉండేది తల్లి కోడతో పాటు మేము కూడా తల్లుమై ఉన్నప్పటిం తల్లి కోడి తెల్లవారె సరికి కనిపించలేదు అక్కడక్కడ రక్తపు చుక్కల ఈకు కిటిక వరకు పడ ఉన్నాయి ఆ తరువాత మరొ రెండు కోడిపిల్లు మాయమైపోయాయి నిస్పృహయంతో బెంగతో అటూ ఇటూ కిటికి వైపే చుస్తూ ఉండిపోయాం

ఈ లోకంలో తల్లి లేని ఎల్లు కొందరు తల్లి తండ్రి తెలియని పిల్లు కొందరు అమ్ముకునే వారు కొందరు తల్లి దండ్రి తెలియని పసికందుు ఎందరో అనాదాశ్రమాల పాలై బలై పోతున్నారు దత్తత పేరుతో అమ్మబడుతున్న చిన్నారులెందరో బాల కార్మికులెందరో వెట్టి చాకిరి వ్యతు పడుతున్నారు కొకొల్లలు మూడ నమ్మకాలతొ దేవుడకి బలిచ్చే వారి చేతుల్లో బలైపోతున్న చిన్నారులెందరొ వారి బాదలను అర్ధం చేసుకునే వారు ఎవరు? ఈనాటికి ఆ కోడి పిల్లు బ్రతుకును అనుభవిస్తూ కనిపిస్తున్నారు రక్షణ లేకపోతే అంతే - మనిష ఎల్ల అంనా - కొడి పిల్ల అయినా తల్లి అయినా - తల్లి కొడ అయినా

*అంకితం అనాద బాలులకు నివసించిస్తున్న వారిక వారి సంస్థలకు మరియు చిన్న తనంలోనే బాధల తెలియిక తెలిపిన నా చెల్లెండ్లకు తమ్ముడికి ఈ కద అంకితం*